

తప్పక చూడండి!




విక్రమ్ వారి

# పెళ్ళితాంబూలం

బి.యస్. రంగా

మాటలు, పాటలు అనిసెట్టి
సంగీతం. విశ్వనాథన్ రామమూర్తి
ఆర్టు. వాలి.. డ్యాన్సులు చోప్రా















నవయుగ

## ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రకటనలు
## మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి



# ఉత్తరాలు

## ముఖచిత్రం

23—2—62 సంచిక ఆంధ్రపత్రిక తీసుకొని యింటికి వెళ్లితిని. మా ఇల్లుగలవమ్మ గారు ఆపత్రికపై గల ముఖచిత్రమును చూచి "అరెరె బంగారంలాంటి అమ్మాయిని అలా వానం లాగా ఉన్న వాడికిచ్చి పెళ్లిచేశారేమిటి!". (పూల మాల క్రిందపడినందుకు) అంటూ బాధపడుతూ చెప్పింది.

క్రోవి రాధాకృష్ణమూర్తి (గన్నవరం)

*　*　*

ముఖచిత్రం చాలా బావుంది కాని ఓ చిన్న సందేహం. వరుని మెళ్లో వేసిన పూలమాల అలా జారిపోయినదే, మరి అతని జంధ్యం మాత్రం అలాగే వుండిపోయినదేమిటి?

దాసా కూర్మనాథ్ (హిందూపురం)

*　*　*

ముఖచిత్రం మొదట అర్థముకాకున్నా నిదానంగా అర్థమై మామిత్రబృందాన్ని కడుపుబ్బ నవ్వించిందంటే నమ్మండి .

"మిత్రబృందము" (పామిడి)

*　*　*

23—2—62 తేదీ సంచిక ముఖచిత్రం చూడగానే ఎంతో నవ్వువచ్చింది కాని చిన్న సందేహం. పెళ్లికొడుక్కి కుడి బుగ్గన, పెళ్లికూతురికి ఎడమ బుగ్గన చుక్క వుండుట చూచాము. బాపు గారిది పొరపాటా? లేక చదువరులకు బాగా కనుపించాలని యిలా పెళ్లికొడుక్కి ఎడమ బుగ్గన, పెళ్లికూతురికి కుడిబుగ్గన వేశారా?

వి రామం (హైద్రాబాదు)

*　*　*

23—2—62 సంచిక ముఖ చిత్రం హాస్యరసభరితమై చాలా ఆకర్షించింది. కానిఒకసందేహం. కార్టూన్‌లోని ఇద్దరు ప్రేమించుకొని ఏకాంత ప్రదేశానికి పోయి పూలదండలతో గాంధర్వ వివాహం చేసి కొంటున్నారా ఏమిటి? పెళ్లి సరంజామా, పెళ్లిపెద్దలు ఎవరూలేరు మరి!

జె. పూర్ణచంద్రరావు (హైదరాబాదు)

## ఢిల్లీ లేఖ

"న్యూఢిల్లీ లేఖ" వ్రాస్తున్న శ్రీ కృష్ణగారు డి యం. కే పార్టీ సభ్యుడా? దయచేసి ఈ సందేహం తీర్చవలసినది

గంధం మనోహరరావు (రాజమండ్రి)

**మాకు తెలిసినంతవరకు కాదు.**

## కార్టూన్

23—2—62 సంచిక 47వ పేజీలో వేయబడిన కార్టూను నవ్వు పుట్టించిందనుకోండి! అయినా ఒక్క సందేహం కలిగింది ప్రేక్షకులంటూ ఎవరూ లేనప్పుడూ, సినిమా చూపించడమంటూ కూడా జరుగదని నా అభిప్రాయము

జి వి. శ్రీధర్ (మద్రాసు)

## చదువులావు

అయ్యో 'చదుల్రావే' ఉండి! (23—2—62 సంచికలో) కొంపతీసి చదువుకుంటున్నావా ఏం ఖర్మ!

శి. శ్రీనివాసరావు (తిరుపతి)

## సీరియల్ కథలు

ఏడు కొండలు సీరియల్ చాలాబాగుంది. ధర్మసూరిగారు చెల్లెలు సత్యవతి ఇంటికి వచ్చినపుడు చెల్లెలు, బావగారు అన్నమాటలు నాహృదయాన్ని కలవర పెట్టాయి మావంటి స్త్రీలకు ఈకథ పదేపదే చదవ బుద్దేస్తుంది..

ఎ సక్కూబాయి (నిజామాబాదు)

*　*　*

అసమాన మాధురీ కవితతో సర్వతోముఖ పాండిత్య ప్రతిభను చూపి రాయల మెప్పించి పండిత సభామధ్యంబున దీనారటంకాల తీర్థమాడిన కవిసార్వభౌమ శ్రీనాథుని, తన్మహాత్మ్యమును ఆంధ్ర సచిత్రవారపత్రికా దివ్యముఖమున ప్రత్యక్షముగా మనకు చూపించి యానంద సంద్రమున ముంచుచున్న శ్రీ నోరి నరసింహ శాస్త్రి గారికి నాధన్యవాదములు

సబ్బనీసు శశికళ (నరసరావుపేట)

## కథలు

కథాగమనము బాగాలేకపోయినా 23—2—62 వారపత్రికలోని కథలన్నిటిలోకి—నావోటు— "వాన కురిసింది" కథకే

జి. అప్పలాచారి (శ్రీకాకుళం)

*　*　*

ఆర్. యం చిదంబరం గారు వ్రాసిన నారయ్య కథ చాలాబాగుంది

టి. డి గిరిధర్ (రాజంపేట)

*　*　*

"ఎండమావులు" కథ చాలా అద్భుతముగ నున్నది. చివర చలపతి స్థితికి చాల జాలి కలిగినది. కాని నేను చేయగలిగినది ఏమియు లేదు!

బూడి రామమోహన్‌రావు (హైద్రాబాద్)

*　*　*

పుల్లయ్యా—

నీ బెవఖూఫీ దినదినాన్కి హద్‌సే బఢాయిస్తాంది. పట్నం కొచ్చినకాణ్ణుంచి సీన్మ టికెట్లు కని పోయి పోలీసోళ్లతాన తన్నులు తింటివి! గోశామహల్ తాన కిరాయ రంగమ్మ ఇంటికాడ గిట్ల ధోకా తింటివి! నీ సైకల్ ఎల్లా దొరికిన కైఫితు తెల్వక శాన పరశాన్‌గ ఉన్నది.

నిజం చెప్పమంటె ఈ దున్యల ఇన్సాఫ్ నామ్‌కైన లేదే మావా. లేకపోతే నీ అంత సాఫ్ సీదా మన్సికి గిన్ని తక్లీఫ్‌లా!

బనా ఒక చీజ్ అడ్గుతా — గుస్సా కాకు. నీ అంత కమ్ అఖల్ వాడికి బల్దాలో ఏం పనయ్యా? మజాగా నీ ఊర్లో జిరాయిత్ చేయించుకొంటు, మక్కబుట్టలు మెక్కుతు, జిందగి గుజరాయించక!

సూడు మావ — నేను చెప్పిన ముచ్చట ఇతాలించు. పనందు అయితే జల్దీన కారటు రాయి.

రాజయ్యమావా (రాజమండ్రి)

*　*　*

రామయ్యపంతులుగారూ దయచేసి నన్ను ఒక మిత్రునిగా స్వీకరించి నాకు కొంచము ముక్కుపొడి యిచ్చిన మీ మేలు జన్మ జన్మలకు మరువను

కె రామక్రిష్ణారెడ్డి (యానదిన్నె)

*　*　*

శ్రీకాశీనాధుని రాధాకృష్ణ వ్రాసిన "మూడవసమాధి" చాలా బాగుంది. గ్రామీణ వాతావరణంలోని వ్యక్తులు ఉచ్చరించే భాష, ఆ భాషలోని మాధుర్యం నన్ను ముగ్ధుణ్ణి చేశాయి

వి. జనార్దన్‌రెడ్డి (యాదగిరిగుట్ట)

*　*　*

కథ చాలా హృదయ విదారకంగా ఉన్నది. నిజంగా సైదులుకోసం 'అనమారి' చేసిన త్యాగం సాటి లేనిది. త్రాచుపాము దెబ్బతింటే మళ్ళీ పగబట్టి వస్తుందని నాకు నమ్మకములేదు. ఈ కథ చదివినంతసేపు మనస్సు ప్రతినన్నివేశంవద్దా అల్లల్లాడింది ఇప్పుడు పాము పగ బడుతుందని నమ్మకము కూడ కలిగింది.

కాంతిశ్రీ (ఏలూరు)

*　*　*

మధురాంతకం రాజారాంగారు వ్రాసిన "ఎక్కవలసిన రైలు" చాలా బాగుంది.

పురాణం ధనలక్ష్మమ్మ (ధర్మవరము)

*　*　*

'రావలసినపత్రిక' రాగానే, 'ఎక్కవలసిన రైలు' చదవగానే, 'చదవాల్సిన కథే' చదివానేమో అనిపిస్తుంది. చాల బాగుంది.

కాకర్ల రామకృష్ణ (గన్నవరం)

## రచయిత జవాబు

నా కథ 'చిత్రమైనకామెడీ' చదివి నంబూదూరునుండి శ్రీ వెంకట్రాయుడుగారు వెలిబుచ్చిన సందేహం చదివాను.

వారు పొరపడ్డా రనిపించింది. నరహరి పేపర్లో ఫోటో చూసి భయపడ్డం, ఆ ఫోటోలో ఉన్నది తనకొడుకేనేమో అని భ్రమించి కాదు తన కొడుకునుకూడా అదేస్థితిలో చూస్తాడేమోననే భయం, అనుమానం—అతణ్ణి ఆవరించాయి. సరిగా అతడి ఆలోచనల్లో వూహించుకుని భయపడుతున్న సంగతులు పేపర్లో చదవడంవల్లే భయపడ్డాడు. రెండు గంటల్రకితం మ్యాలుకు వెళ్లిన గోపీయే ఆ ఫోటోలో ఉన్నాడని నరహరి ఊహించుకున్నాడనుకుని వెంకట్రాయుడుగారు పొరబడ్డారు మరోకసారి కథను చదివితే వారి సందేహనివృత్తి అవుతుంది.

వాయుని సత్యనారాయణరావు (విజయవాడ) ★

# నేడే చూడండి!




రాజలక్ష్మి ప్రొడక్షన్స్ వారి

# ఖైదీ కన్నయ్య

దర్శకుడు
విఠలాచార్య

నిర్మాత
ఢూండి

ఈసిండియా రిలీజ్

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

## విషయానుక్రమణిక

శుక్రవారం : *9-3-62*
ప్లవ॥ ఫాల్గునమాసం శు॥చవితి
సంపుటము : **54** సంచిక : **27**

స్థాపితము:
**1908**

*

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

విడిప్రతి : 25 న. పై
సంవత్సర చందా : 13-0-0 రు.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి, మద్రాసు-1

★

## లోకంపోకడ



"సిగ్గు లేకపోతేసరి ! డిపాజిట్ కూడా పోగొట్టుకున్నారు"
"డిపాజిట్ పోతేపోయిందిగాని, ఈ పేటలోఉన్న నలుగురికీ పరిచయం అయ్యాను. అక్కడికదేచాలు!"




ముఖచిత్రం — శ్రీమతి కెన్నెడీ



[ఈనెల మొదటివారంలో భారతదేశం రావలసిన శ్రీమతి కెన్నెడీ అనారోగ్యంవల్ల ప్రయాణం ఒకవారం వాయిదా వేసుకున్నారు.]


నాయుడు
వంశపారంపర్యకే!
నిన్న


నాయుడు
వంశపారంపర్యకే!
నేడు


నాయకత్వం ఎవరిదో యోధులు ఇక తేల్చుకోవచ్చు


ఎన్నికల ఫలితాలు
ఎదురుగాలి


మహారాజు త్రిభువన్‌కు ఢిల్లీ ఆహ్వానం
ఢిల్లీ


నేను కాశ్మీర వెళ్లాలను కుంటున్నానే...
ఢిల్లీకి రండి!

# ప్రభుత్వ తాఖీదుకు ప్రధాని పట్టించిన దుర్గతి:
# కాంగ్రెసు హతమార్చిన ఇంగ్లీషుకు ఇతరదేశాలలో గౌరవం

## శ్రీకృష్ణ

ఎన్నికల సందర్భంలో శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ ఇక్కడ నాలుగు సభలలో ఒక్కరోజున ప్రసంగించారు. వీటిలో ఒకటి ప్రభుత్వోద్యోగుల వాడలో ఏర్పాటయింది. ఈ ఉపన్యాసాలు విన్నవారు అయోమయస్థితిలో పడిపోయారు. కాంగ్రెసు అభ్యర్థులుగా పోటీచేస్తున్న శ్రీయుతులు మెహర్‌చంద్‌కన్నా, చౌదరీ బ్రహ్మప్రకాశ్, నవల్ ప్రభాకర్ గారులను ఎందుకు ఎన్నుకోవాలో శ్రీ నెహ్రూ విశదం చేస్తారని ప్రజలు ఆసభలకు వెళ్లారు. కాని శ్రీనెహ్రూ ఈ అభ్యర్థులను గురించి నాలుగు ముక్కలు చెప్పడానికి బదులు శ్రీకృష్ణమీనన్‌ను విమర్శిస్తున్న వారిమీద విరుచుకు పడ్డారు. షేదరాలో ఒకగ్రామీణుడు ప్రధాని ఉపన్యాసం విన్నమీదట "శ్రీ కృష్ణమీనన్ అవుటర్ ఢిల్లీనుంచి పోటీచేస్తున్నారా?" అని ప్రక్కన ఉన్నవారిని అడిగాడట!

ప్రభుత్వోద్యోగులు ఎన్నికల ప్రచార సభలలో పాల్గొనరాదని శాసిస్తూ దేశీయ వ్యవహారాలశాఖ ఈ మధ్యనే ఒకతాఖీదు జారీ చేసింది. శ్రీనెహ్రూ ఈ దేశానికి ప్రధాన మంత్రికూడాను. మరి వారు ప్రభుత్వోద్యోగుల సభలో ఎందుకు మాట్లాడారో బోధపడదు. వారు ప్రభుత్వ తాఖీదు విషయం ప్రస్తావించి అది స్వతహాగా మంచిదేననీ, అంతమాత్రంచేత ప్రభుత్వోద్యోగులు ఎన్నికల ప్రచార సభలలో పాల్గొనే హక్కును కోల్పోయినట్లు కాదనీ, రాజకీయాలలో చిక్కుకొనరాదని మాత్రమే వారికి ప్రభుత్వం సలహాఇచ్చిందని తెల్పారు. ప్రభుత్వోద్యోగుల వోట్లు సంపాదించడానికి కాంగ్రెసు అభ్యర్థి కోరికపైననే శ్రీనెహ్రూ ఈ ప్రసంగం చేశారని తెలుస్తూనే ఉన్నది. దేశీయ వ్యవహారాలశాఖ ప్రభుత్వోద్యోగులకు ఇచ్చింది తాఖీదు కాని సలహా కాదు. ఎన్నికలప్రచార సభలకు హాజరు కావచ్చునని ప్రభుత్వోద్యోగులకు చెప్పిన ప్రధానమంత్రి తమ ప్రభుత్వం ఆదేశాన్ని నిరర్థకంచేశారని వేరేచెప్పనక్కరలేదు.

శ్రీకృష్ణమీనన్ పోటీకి సంబంధించిన అంశాలు మరోరెండు ఉన్నాయి. ఆయన కమ్యూనిస్టని ప్రత్యర్థులు ముద్రవేశారు. ఈ ఆరోపణను ప్రధానమంత్రి కాయ కత్తుల ఖండించారు. శ్రీ మీనన్ కమ్యూనిస్టుకాదని శ్రీమతి ఇందిరా గాంధికూడా ధ్రువపత్రం ఇచ్చారు. అయినా శ్రీ మీనన్ ఈఆరోపణను స్వయంగా తిరస్కరించలేదు. కమ్యూనిస్టుని కాదని అసందిగ్ధంగా, బేషరతుగా శ్రీ కృష్ణమీనన్ ఇప్పుడైనాసరే ప్రకటించినట్లయితే తమ అభ్యర్థిత్వాన్ని ఉపసంహరించుకొనడానికి సిద్ధంగా ఉన్నామని శ్రీ కృపలానీ ఎన్నికలు రేపోమాపో జరుగుతాయనగా బొంబాయిలో ఒక ప్రకటన చేశారు. కాని మీనన్ ఇందుకు ఏవిధమైన సమాధానం చెప్పలేదు.

శ్రీ నెహ్రూ ఢిల్లీలో చేసిన నాలుగు ఉపన్యాసాలలో వెల్లడైన ప్రధాన విషయాలు రెండు: 1. శ్రీ కృష్ణమీనన్ సిసలైన సామ్యవాది. నకిలీ కుర్చీ సామ్యవాదికాదు. 2. శ్రీ కృష్ణమీనన్ ప్రత్యర్థులు దేశాన్ని ప్రచ్ఛన్నయుద్ధ విషవలయంలోకి చొప్పించి, దేశంలో మెకార్థీ తత్వాన్ని ప్రవేశపెట్టటం ద్వారా దేశాన్నిసర్వనాశనం చేస్తారు.

ఇంతకు మునుపే నేను మనవిచేసినట్లు ఢిల్లీనుంచి పోటీచేస్తున్న అభ్యర్థులకు తోడ్పడటానికి శ్రీ నెహ్రూ ఈ సభలకు వచ్చారు గాని శ్రీ కృష్ణమీనన్ గూర్చి మాట్లాడటానికి కాదు. శ్రీ మీనన్ ఓడటం అంటూ జరిగితే సామ్యవాద వ్యవస్థను నెలకొల్పే యత్నం విఫల మవుతుందని, కమ్యూనిస్టుల్ని నామరూపాలు లేకుండా ఏరిపారేసే కార్యక్రమం ప్రారంభం అవుతుందని శ్రీనెహ్రూ తమ ప్రసంగాల ద్వారా ఉత్తర బొంబాయి నియోజకవర్గం ఓటర్లకు స్పష్టంచేశారు. దీని అర్థం శ్రీ మీనన్ ప్రభుత్వంనుంచి తప్పుకున్న ఉత్తరక్షణాన సామ్యవాదం అంతరిస్తుందనీ, దాని వ్రేళ్లు ఈ దేశంలో అంతలోతుగా పాతుకుని ఉన్నాయని తెలుస్తోందికదా!

మరోక కోణంనుంచికూడా కాంగ్రెసు సంగతి సందర్భాలు పరిశీలించవచ్చు. శ్రీ నెహ్రూ ప్రపంచ విఖ్యాతిగాంచిన రాజకీయవేత్త; ఒకగొప్ప దేశానికి ప్రధానమంత్రి. వారు నాయకత్వం వహిస్తున్న పార్టీ అప్రతిహతంగా 16 ఏళ్ళు పరిపాలన సాగించింది. అంతటివ్యక్తి కేవలం ఒక సహాయ మంత్రిని (శ్రీమెహర్‌చంద్‌ఖన్నా), ఒక పార్లమెంటు సభ్యుణ్ణీ (చౌదరిబ్రహ్మప్రకాశ్) గెలిపించేందుకు ఇంటింటికివెళ్లి ప్రచారంచేయవలసి వచ్చిందంటే, కాంగ్రెసులో ఏదోపెద్దలోపం ఉండితీరాలి. ఐదుగురు అభ్యర్థులలో ముగ్గుర్ని బలపరిచేందుకు శ్రీ నెహ్రూ ఒక్కరోజున నాలుగు ఉపన్యాసాలు చేశారంటే, ఈఅభ్యర్థులవ్యవహారమేమీ బాగుండలేదని ఆయన గ్రహించి ఉండాలి. కాగా ఈనాటి సామాజిక వ్యవస్థను సర్వనాశనం చేయడానికి పొంచిఉన్న కమ్యూనిస్టులను ఆయన ఒక్కమాటకూడా అనలేదు ఎంతసేపూ జనసంఘం, స్వతంత్ర పార్టీలమీదనే మండిపడ్డారు.

ఎన్నికల ప్రచారానికి ప్రభుత్వం ఎలా సహాయపడిందో ఉదాహరణపూర్వకంగా మనవిచేస్తాను. అనుకున్నట్లుగానే ఈ సమయంలో ఇక్కడ (రాజధాని నగరంలో) అక్రమ నిర్మాణాలు కుక్కగొడుగులలాగ లేచాయి. మురికివాడలలో నివసిస్తున్నవారు చిత్తం వచ్చినట్లుగా నిర్మాణాలు సాగించేందుకు నగరపాలక సంఘం తాలూకు వివిధరాజకీయ పక్షాలసభ్యులు సందాలపడి ప్రోత్సహించారు. ఫలితం వందలాది గుడిసెల్ని మట్టి కొంపలు వెలిశాయి. ఓటర్లను తృప్తిపరచేకార్యక్రమం ఇంతటితో ఆగలేదు. మురికివాడల నిర్మూలనాశాఖ సక్రమంగా పనిచెయ్యకుండా చెయ్యాలని నగరపాలక సంఘం సభ్యులు నడుంకట్టుకుని పాటు పడుతున్నట్లు తెలిసింది. ఓటర్ల మెప్పు పొందటంకోసం ఇంత బాధ్యతారహితమైన స్థాయికి దిగజారటం నిజంగా విచారకరం. మురికివాడల నిర్మూలనాశాఖ అభ్యర్థులతో లాలూచీ పడటం మరీ విచారకరం. ఈ శాఖను ఇప్పుడు స్తబ్ధత ఆవరించిందంటే, చాలామంది ఉద్యోగులు ఎన్నికలపనులతో సతమత మవుతూండటమే కొంత వరకూ కారణం. నిజానికి ఎన్నికలసమయంలో మరింత జాగ్రత్తగా కనిపెట్టి ఉండాలని నగరపాలక సంఘానికి తెలియకకాదు. అలాంటప్పుడు ఈశాఖ ఉద్యోగులు గైర్‌హాజరు కావడాన్ని ఎలా సహించి ఊరుకున్నదో ఆశ్చర్యంగాఉన్నది.

ఈకథ ఇంతటితో ఆగలేదు వర్తకగుమాస్తాల పనివేళలు మార్చారు కరువు భత్యం నిర్ణయానికి ఇంతకుమునుపే ఢిల్లీని "ఎ" తరగతి నగరంగా ప్రకటించారు. రక్షణశాఖ సిబ్బంది జీతాలు పెంచారు. బోనస్ సంఘాన్ని, వేతన నిర్ణయ సంఘాలను నియమించారు సమ్మెలో పాల్గొన్నందుకు గుర్తింపు రద్దుచేసిన కేంద్ర ప్రభుత్వోద్యోగుల సంఘాలను మళ్లీ గుర్తించారు. ఢిల్లీ నగరపాలక సంఘంలో

—62 వ పేజీ చూడండి



ఉత్తర బొంబాయి నియోజకవర్గం నుంచి ఎన్నికైన శ్రీ వి. కె. కృష్ణమీనన్.

---

ఈ లేఖ ఎన్నికలు ప్రారంభం కాక మునుపు వచ్చింది.




# సోనియా

'రమ'

నా పేరు రాజీ. మా నాన్నగారు చిన్ని రాజా అంటారు అమ్మ ముద్దొచ్చినప్పుడు బుజ్జి కన్నా అంటుంది మా అత్తయ్య—మా తాతగారి ఇంట్లో ఉన్నారులే వాళ్ళకి అసలు నా పేరే తెలియదు. "పేరేమిటిరా ?" అని అడుగుతారు చెబితేనా అక్కడితో ఊరుకోరు. "మీ అమ్మ, నాన్నల పేర్లు ఏమిటిరా" అని మళ్ళీ అడుగుతారు అమ్మకి నాన్నగారికి యింకో పేర్లుం ఉంటాయి! అమ్మ, నాన్నగారు అంతేగా! అదికూడ తెలియదు వాళ్ళకి. సరే మా సోనియాకి కూడ నా పేరు తెలియదు. తెలిసినా పిలవదు. దానికి మాట్లాడడమే రాదు. నేను బిస్కట్ తింటు న్నప్పుడు వాళ్ళదగ్గర కూర్చుని "మ్యావ్" అంటుంది. అదొక్కటే వచ్చును దానికి. ఇంకే మనిషం రాదు సోనియా అంటే పిల్లిపిల్ల దాని గురించి చెప్పనా ?

అది అసలు పుట్టనేలేదు మా యింటికి వచ్చింది ఒకరోజు అప్పటినుంచి మా యింట్లోనే ఉండిపోయింది ఆవేళ రాత్రి అన్నం తిన్నాక నేను కుర్చీలో కూర్చుని రేడియో తిప్పుతున్నాను. అది ఏమిటో పాడుతోంది దాంట్లోనుం లైటు వెలుగుతూంది కీ ముల్లుంటుంది. అది అటూ యిటూ తిరుగుతూంటే బావుంటుంది దాన్నే నేను తిప్పుతున్నాను. నాన్నగారు పేపరు చదువుకుంటున్నారు. అమ్మ పడుకుని పుస్తకం చదువుకుంటోంది. అమ్మ ఎప్పుడూ అంతే! పుస్తకంలో బొమ్మలు లేకపోయినా చదివేస్తుంది సరే అప్పుడేమో నాన్నగారు "ఏవిట్రా ఆ వెధవపని"

55—వ పేజీ చూడండి

## "సిరిసంపదలు" 'జాలీ డే'

**మధుమూర్తి**

పద్మశ్రీ పిక్చర్స్‌వారు ఈ పాటను రికార్డు చేసినప్పుడే అనుకున్నాను—ఈపాట చిత్రీకరణ కార్యక్రమం చాలా సరదాగా సాగుతుందని.

పాటలోని సాహిత్యం, సంగీతం పోకడలన్నీ శ్రోతలికి, ప్రేక్షకులకి ఉషారుతో ఊపు నందిస్తున్నవి. ఈ పాట చిత్రీకరణ ఎక్కడ జరుగుతుందనే వివరాలను చిత్రనిర్మాత వి. వెంకటేశ్వర్లునీ, దర్శకుడు పి. పుల్లయ్యనూ అడిగాను. వారు పూండి రిజర్వాయరు కొండల మధ్య నున్న నందనోద్యానంలో షూటింగు జరుపనున్నామని తెలియజేశారు. నా రాకకు కూడా అనుమతి నివ్వమని వారిని కోరాను. వారు అంగీకరించారు.

మదరాసు నగరానికి 35 మైళ్ల దూరంలో ఉంది పూండి. నిర్మాత చెప్పిన మూడు రోజుల తేదీలలో ఒకరోజు అక్కడకు వెళ్లాలని ఇతర పనుల నుంచి బైటపడి బయలుదేరాను. మఫోసిల్ బస్ ఎక్కి కూర్చున్నాను. ఆరోజే అమెరికన్ వ్యోమగామి గ్లెన్ భూమిని మూడుసార్లు చుట్టిన వార్త వచ్చిన రోజు. అతడు రెండుసార్లు భూప్రదక్షిణ చేయడానికి తీసుకున్న కాలవ్యవధిలో నేను మదరాసు నగరం నుండి పూండి చేరుకున్నాను.

అప్పుడే మధ్యాహ్నం విందు అరగించి పద్మశ్రీ నిర్మాణబృందం, నటీనట వర్గం రవ్వంత విరామం తీసుకుని "నెక్స్‌ట్ షాట్" కి సెటప్ చేసిన ప్రదేశం దగ్గరకు అంతా బయలుదేరుతున్నారు. ఇంచుమించు మద్రాసులోని స్టుడియో వాతావరణం అంతా అక్కడకు వచ్చినవారి ద్వారా నాకు కనబడుతూనే ఉంది. నేను కూడా నా కిచ్చిన విందును అందుకుని షూటింగ్ జరిగే 'స్పాట్' కు వెళ్ళాను.

కామెరా క్రూ కదిలింది. ప్లేబాక్ యంత్రం నడిచింది. నటీనటులు, నర్తకులు వెళ్లారు. దర్శకుడు పి. పుల్లయ్య, వారి సహాయకులు రాఘవేంద్రరావు, వరప్రసాదరావు, సుబ్బారావు (అబ్బి), నృత్య దర్శకుడు వెంపటి సత్యం, కామెరామన్ మాధవ్ బుల్‌బులే, ఆపరేటివ్ కామెరామెన్ గోపాలకృష్ణ, ప్రసాద్ ప్రొడక్షన్స్ సౌండ్ ఎక్విప్‌మెంట్ బృందం, మేకప్‌మన్‌లు నాగేశ్వరరావు, భద్రయ్య, వారి సహాయకులు మూర్తి, కపాలి; ఎడిటర్ ఎన్. ఎస్. శంకర్, ఆయన అసిస్టెంట్ సీను, స్టిల్సుకు చెందిన రామస్వామి, రామచంద్రయ్య, అలంకరణ శాఖ రాము, సూర్యారావు, సత్యనారాయణ, నిర్మాణ శాఖ లంకశర్మ, కృష్ణయ్య, మీరా, వేలాయుధం, సాయిబాబు, అప్పారావులు అందరూ అక్కడ ప్రత్యక్ష మయేసరికి నాకు పూండికి వచ్చిన జాడనే మరచిపోయాను.

పూండి రిజర్వాయర్ పరిసరాలు చాలా అందంగా ఉంటాయి. అక్కడున్న గెస్ట్ హౌసుకు ముందు సుందరమైన తోట, పార్కు లాంటిది ఉంది.

ఈ ప్రదేశానికి "సిరిసంపదలు" చిత్రంలోని పాత్రలు ఎందుకు వచ్చాయో వివరిస్తాను.

ఈ చిత్రగాథలోని ప్రధాన పాత్రలు ప్రసాద్ ఆనంద్, పద్మ, మధులు విద్యార్థిదశలోని వారు. వారు చదువుతున్న కళాశాలలో డిబేట్ పోటీలు

—53 వ పేజీ చూడండి



అన్నపూర్ణా ప్రొడక్షన్సువారి "ఇద్దరు కొడుకులు" చిత్రంలోని వి. వరోజాదేవి

# డాక్టర్ రాజు

బొమ్మల కథ

**దేవిక** 15


















## తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!

# మతిమరుపు కాంగ్రెసువాదులకు మళ్లీ గుణపాఠం

కౌండిన్య

ఆంధ్రరాష్ట్ర పరిపాలనా బాధ్యతను మరో ఐదేళ్లపాటు కాంగ్రెసే నిర్వహించాలని ప్రజలు నిర్ణయించారు అధికారదాహం, అవినీతి అక్రమ పక్షపాతం లాంటి ఆరోపణలకు గురియైనా, కాంగ్రెస్ పట్ల ప్రజాభిమానం పూర్తిగా పోలేదని స్పష్టమౌతోంది అయితే కాంగ్రెస్‌వారిలో బలసిన అహంభావానికి, రోడ్డు రోలర్ దృక్పధానికి గుణపాఠమా అన్నట్లు, వెనుకటి శాసనసభలో గల బలాన్ని ఈసారి చాలా తగ్గించివేశారు ముఠాతగవులు సర్దుమణిగి సంస్థ బాగుపడాలంటే, ఇలాంటి షాకులు చాలా అవసరం. 52 లో తిన్న దెబ్బవల్ల 55 ఎన్నికలలో తగవులు మాని సమైక్యంగా పోటీచేసి అఖండ విజయాన్ని సాధించారు. ఒరిస్సా, కేరళ రాష్ట్రాలలో కూడా ఈవిధంగానే జరగడం చూచాం. అయితే కాంగ్రెసు వారికి మతిమరుపు ఎక్కువ. 52 ఎన్నికల పాఠాన్ని 62ఎన్నికలనాటికి మరచిపోయిఅంతః కలహాలకు దిగటంవల్ల, ఇప్పుడు మునుపటంత తీవ్రంగా గాకపోయినా, కొంత దెబ్బ తినక తప్పలేదు. ఇప్పటికైనా ఆత్మపరిశోధన చేసుకుంటారని నమ్మకం లేదు. మిగతా రాష్ట్రాలతో పోల్చి చూస్తే మన రాష్ట్రంలోనే కాంగ్రెస్ కొంత మెరుగు, మరేం ఫర్వాలేదని ప్రాలుమాలే ప్రమాదం ఉంది.



శ్రీ కొత్త రఘురామయ్య

ఈ ఎన్నికల ఫలితాలను గమనిస్తే మొత్తంమీద ఒక్క స్వతంత్రపార్టీ విషయంలో తప్ప, తతిమ్మా పార్టీల బలాలు, ఎన్నికల ముందు అభిజ్ఞులు వేసిన అంచనాలకు ఇంచుమించు సరిపోయాయనే చెప్పవచ్చు. కాంగ్రెస్‌పార్టీకి మెజారిటీ వస్తుంది కాని, మునుపటి బలం ఉండదని అనుకున్నట్టే అయింది. వెనుకటి శాసనసభలో కాంగ్రెస్ పార్టీ బలం 240. ఇప్పుడది 176 కు తగ్గిపోయింది. అంటే మెజారిటీ లభించడానికి గల సంఖ్య కన్నా ఒక్క 25 స్థానాలు మాత్రమే ఎక్కువ వచ్చాయి. ఇదైనా సర్కారు, తెలంగాణా జిల్లాలు పెట్టిన భిక్షే. ప్రాంతాలవారీగా చూస్తే సర్కార్ జిల్లాలో 89 స్థానాలు, తెలంగాణాలో 62, రాయలసీమలో 25 వచ్చాయి. 1955 లో సర్కార్ జిల్లాలలో కాంగ్రెస్ ఐక్య సంఘటనలో భాగస్వామిగా కాకుండా 72 స్థానాలు సాధించింది, అంటే యిప్పుడు మరో 20 స్థానాలు ఎక్కువ లభించాయన్నమాట. ఈ ఎక్కువ స్థానాలు శ్రీకాకుళం, విశాఖ, గోదావరి, నెల్లూరు జిల్లాలలో లభించాయి 55 లో శ్రీకాకుళంలో 6, విశాఖలో 14, తూర్పు గోదావరిలో 8, నెల్లూరులో 11 వచ్చాయి ఈసారి శ్రీకాకుళంలో 13, విశాఖలో 13, తూర్పు గోదావరిలో 18, నెల్లూరులో 14 వచ్చాయి పశ్చిమ గోదావరి లో మొత్తం 14 స్థానాలు పూర్వం కాంగ్రెస్ గెల్చుకోగా ఇప్పుడు 10 మాత్రమే వచ్చి అరు పోయాయి కృష్ణలో లోగడ 12,



శ్రీ డి. సంజీవయ్య

గుంటూరులో 15 రాగా ఈసారి కృష్ణలో 10, గుంటూరులో 11 మాత్రం లభించాయి. అనగా ఈసారి కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాలలో కోల్పోయిన స్థానాలు ఉభయ విశాఖ తూ. గోదావరి, నెల్లూరు జిల్లాలలో భర్తీ కావడమే కాక ఇంకా ఎక్కువ గెల్చుకో గలిగినట్లు స్పష్టమవుతున్నది. కాని ఈసారి రాయలసీమలో దెబ్బతినిపోయింది. 55 ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ మొత్తం 57 స్థానాలలో 46 గెల్చుకోగా ఈసారి 25 కు మించి రాలేదు. పూర్వం అనంతపురం జిల్లాలో మొత్తం 14 స్థానాలు కాంగ్రెసు కైవసం కాగా ఈసారి 7 కన్నా ఎక్కువ రాలేదు. అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షుని జిల్లా అయినా, కాంగ్రెసుకు ఓటమి తప్పలేదు. ఈ నాలుగు జిల్లాలలో కాంగ్రెస్ విపరీతంగా దెబ్బతిన్న జిల్లా కడప. ఇక్కడ మొత్తం 11 స్థానాలలో 2 కు మించి గెల్చుకోలేకపోయింది అనాదిగా రాయలసీమ కాంగ్రెస్‌కు అండగా ఉన్న ప్రాంతమైనా, కాంగ్రెస్‌నాయకత్వం, రాష్ట్ర ప్రభుత్వ రథ సారధ్యం, రాయలసీమ నాయకుల చేతుల్లో ఉన్నా, కాంగ్రెస్ ఇలా దెబ్బతినిపోవడం విచిత్రంగానే కన్పిస్తుంది రాష్ట్రంలో అగ్రనాయకులైన సంజీవరెడ్డి, సంజీవయ్యగారలలో 'నాయకత్వ' పు తగాదాలకు వారివారి ముఠాకక్షలకు రాయలసీమ కాంగ్రెస్ బలిపశువై పోయింది



శ్రీ నీలం సంజీవ రెడ్డి

తెలంగాణాలో కూడా కాంగ్రెస్ బలం పెరగక పోగా తగ్గిపోయింది. 57 ఎన్నికలలో 68 స్థానాలు సాధించుకోగా ఈసారి 62 కి మించి రాలేదు కమ్యూనిస్టు కంచుకోటలైన ఖమ్మం, నల్గొండ, మొదలైన జిల్లాలలో పాగా వేస్తామని, కాంగ్రెస్‌వారు చేసిన ప్రగల్భాలు పటాపంచలై పోయాయి పైగా వరంగల్‌లో క్రితంసారి 14 స్థానాలు గెల్చుకోగా ఈసారి 7 కన్నా ఎక్కువ రాలేదు కాకపోతే ఖమ్మంలో ఒక సీటు మెదక్‌లో 2, కరీంనగర్ జిల్లాలో 3, అధికంగా గెల్చుకుని హైదరాబాద్ 1, అదిలాబాద్‌లో రెండు కోల్పోయింది.



శ్రీ కె. కొమురాజబహదూర్

ఈవిధంగా మొత్తం 6 స్థానాలు పోగొట్టుకున్నది కమ్యూనిస్టు ప్రాబల్యం గల ప్రాంతంలో ఇలా కాంగ్రెస్ బలం తగ్గిపోవడంతో ప్రమాద సూచన ఇక్కడ నాయకత్వం సరిగా లేదనడానికి ముఖ్యులైన శ్రీ కె వి రంగారెడ్డి ( ఉప ముఖ్య మంత్రి ), అచ్యుతరెడ్డి ( ప్రాంతీయ సంఘాధ్యక్షులు ), జె వి ( మాజీ మంత్రి ), బొమ్మకంటి ప్రభృతుల ఓటమి ప్రత్యక్ష తార్కాణం నాయకత్వం క్షీణత కానిదే ఇక్కడ కాంగ్రెస్ బలం పెరగదు ఇది ఒక్క తెలంగాణాకే కాదు, మొత్తం రాష్ట్రానికి, కూడా వర్తిస్తుంది

ఈ ఎన్నికలలో కాంగ్రెస్ బలం తగ్గిపోతుందని, కాంగ్రెస్ అధ్యక్షులు మొదలు, సామాన్య నాయకుల వరకూ ఆదినుంచి హెచ్చరికలు చేస్తూనే వచ్చారు కాని, ఆ ప్రమాదం నివారించడానికి చేసిందేమీ లేదు. ముఠాతగవులు సర్దుకోకపోగా, నాయకత్వ సమస్యను ముందే లేవనెత్తి తగవులు పెంచారు. పైగా స్థానికంగా బలం గలిగి

57—వ పేజీ చూడండి

# మనము - మన దేహస్థితి

డా॥ గాలి బాలసుందరరావు

## లివరు: కొవ్వు పదార్థములు

మన 'భోజనం' లో ప్రొటీనులు, పిండి పదార్థములు, కొవ్వు పదార్థములు అని మూడు ప్రధాన వస్తువులు ఉన్నవని యిదివరకే తెలుసుకున్నాము అవి జీర్ణమైనప్పుడు ఏఏ రసాయనిక వికృతులు పొంది ఏ స్వరూపంతో శరీరంలోనికి "గ్రహించ" బడతవో తెలుసుకున్నాము ఆహారం జీర్ణం కావడం ఒక ఎత్తు ఆ జీర్ణమయిన ఆహారం శరీరంలోకి ఆహరించబడడం ఒక ఎత్తు. అల్లా ఆహరించబడిన ఆహారమును శరీర ధాతువులు వినియోగించుకోడం మరి ఒక ఎత్తు గత వ్యాసములలో పిండిపదార్థములనుండి (Starch) చక్కెర పదార్థములు ఎల్లా తయారయ్యేదీ, అవి చిన్న పేగు నుండి పోర్టల్ వెయిను ద్వారా లివరులోకి చేరి అక్కడ ఏయే వికృతులు పొందేదీ తెలుసుకొన్నాము చక్కెరలు శరీర ధాతువులలో ఏవిధంగా వినియోగవడేదీ, ఏయే స్యందనములు అందుకు సహకరించేదీ, ఆహార వస్తువుల వినియోగం చర్చిస్తున్నప్పుడు వివరిస్తాను. ఆహారవస్తువులు శరీరంలో ఆహరించబడి శరీరంలో వినియోగించబడేలోగా లివరు నిర్వహించే విధులను ప్రస్తుతం చర్చిస్తాను

కొవ్వులు, (1) వృక్షజములు, (2) జంతుజములు, (3) ఖనిజములు అని మూడు రకములు కొబ్బరి నూనె, మంచి నూనెల వంటి నూనెలు వృక్షజములు పాలు, వెన్న, నేయి, గుడ్లు, చేపలు, మాంసాదులు వీటిలో ఉండే కొవ్వులు జంతుజములు, పెట్రోలు, వంటి తైలములలోనూ వాటినుండి తయారయ్యే 'పేరఫిన్' వంటి వస్తువులూ ఖనిజములు ఇందులో ఖనిజములు శరీరంలో జీర్ణం కావు; ఆహరించబడవు; దహించబడి శక్తినీ ప్రసాదించవు విరేచనం కాకపోతే కరిగివున్న పేరఫిన్ (Liquid Parafin) తీసుకుంటాము అది విరేచనంతో తీనుకున్నది తీసుకున్నట్లుగానే వెళ్లిపోతుంది కాని శరీరంలో ఏ మార్పు చెందదు పోగా వృక్షజములూ, జంతుజములూ అయిన కొవ్వులే మనకు ఆహారంగా ఉపయోగపడతవి

జఠరాశయంలో ఉండే, లైపేజ్ వల్ల కొవ్వులు కొద్దిగా జీర్ణమవుతవి డుయోడినంలోకి లివరు స్యందించే పిత్తరసమూ, పేంక్రియస్ స్యందించే రసమూ వచ్చి చేరుతవని యిదివరకే తెలుసుకున్నాము.

పిత్తరసంలో, ఒక రకమైన లవణములూ, అమ్ల పదార్థములూ ఉంటవి పిత్తరసంలో, కొవ్వు పదార్థములను జీర్ణంచేసే ఎంజయిము లేవీ ఉండవు. కాని, కొవ్వులు జీర్ణం కావడానికి పిత్తరసంలో ఉండే లవణములు చాలా అవసరం, ఈ లవణములలో కొన్ని నీటిలో కరుగుతవి. మిగతావి నూనె పదార్థములలో మాత్రమే కరుగుతవి నీటి ప్రభావం వల్ల కొవ్వు ఖండములు, చితికి, చిన్నవై, చిన్న చిన్న సూక్ష్మ కణములుగా మారిపోయి 'నవనీతం' గా (Emulsion) తయారవుతవి ఇల్లా నవనీతమయిన కొవ్వు పదార్థము డుయోడినంలో ప్రవేశించిన పేంక్రియస్ రసంలో వుండే, 'లైపేజ్' అనే 'ఎంజయము' వల్ల (1) గ్లిసరాల్, (2) ఫేటీ ఏసిడ్లుగా మారిపోతుంది చిన్న పేగులో మొదటి భాగమయిన జెజూనంలో తయారయ్యే ఆంత్ర రసంలోనూ 'లైపేజ్' ఉన్నది 'లైపేజ్' అంటే కొవ్వులను జీర్ణంచేసే పదార్థము పేంక్రియస్ రసములోనూ, ఆంత్ర రసములోనూ ఉండే లైపేజుల ప్రభావంతో కొవ్వు పదార్థములన్నీ పూర్తిగా జీర్ణమయిపోతవి లివరు తయారుచేసే పిత్తరసం లేకపోతే, కొవ్వులు నవనీతములు కావు అల్లా కాకపోతే అవి జీర్ణం కావడానికి చాలాకాలం పడుతుంది లివరు వ్యాధిగ్రస్తమయినప్పుడు కొవ్వులు జీర్ణంకావు అందువల్లనే కామెర్లు వచ్చినప్పుడు వైద్యులు కొవ్వు పదార్థములు ఆహారంగా యివ్వవద్దని ఆదేశిస్తారు

కొవ్వులు జీర్ణంకాగా తయారయిన గ్లిసరాల్, ఫేటీ ఏసిడ్లు చిన్న పేగు అఖరి భాగంలో ఉండే విల్లస్సుల ద్వారా పోర్టల్ వెయిన్‌లో ప్రవేశించి లివరుకు చేరుతవి వాటిలో కొంత భాగం సరాసరి రక్తంలోకే పోతవని కొందరు శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు ఆ విషయం ఆహార వినియోగమును చర్చిస్తున్నప్పుడు వివరిస్తాను కాని ఎక్కువభాగం లింఫు నాళముల ద్వారా, లింఫు నాళములకు తల్లి నాళమైన 'థోరాసిక్' నాళం ద్వారా పెద్ద వెయినులోకి నేరుగానే పోతుంది కాగా కొంతభాగము మాత్రమే లివరులోకి ప్రవేశిస్తుంది

లివరులో గాని, రక్తంలో గాని ప్రవేశించిన కొవ్వు అంతా శరీరంలో వెంటనే వినియోగింపబడదు శరీరంలో అనేకభాగములలో అది నిలవ ఉంటుంది. ఆహారం లభించని పరిస్థితులలోనూ, ఉపవాసములు చేసేటప్పుడో ఆ నిలవ వున్న కొవ్వు లన్నీ కరిగి, దహింపబడి, శరీర కార్యక్రమానికి కావలసిన 'శక్తి' ని తయారు చేస్తవి. లివరు గ్లయికోజన్‌ను (Glycogen) నిలవ చేసి నట్లే శరీరోపరిభాగములో, చర్మం క్రింద అనేక చోట్ల కొవ్వులు నిలవ వుంటవి వీటిని కొవ్వు 'డిపో' లు అనవచ్చును. గ్లయికోజన్ నిలవ అంతా శరీర కార్యక్రమానికి ఒక్కరోజు కయినా చాలదు. కాని కొవ్వు నిలవలు అల్లా కాదు. శరీర విస్మృత మున్న వారిలో మూడు వారములనుండి ఏడు వారముల వరకు, శరీరానికి కావలసిన శక్తిని ఉత్పత్తి చేయగల కొవ్వు శరీరంలో నిలవ ఉంటుంది అందుకనే, నిరసనవ్రతం చేసేవారిలో ఆహారలోపంవల్ల కలిగే దుష్ఫలితాలు మొదటి రెండు వారములలో అంతగా ఏర్పడవు

శరీరోపరిభాగమును కప్పిఉన్న చర్మానికీ, కండరములకూ మధ్య నారవంటి ఒక ధాతువు (Tissue) ఉన్నది ఆ పీచు పొరలో ఉన్న జీవ కణములు, శరీరంలో వినియోగం కాగా మిగిలి పోయిన కొవ్వును, మ్రింగి, తమలో దాచగల శక్తి కలిగివుంటవి శరీరానికి సునుపూ, వంపులూ యిచ్చేది యీవిధంగా నిలవ వున్న కొవ్వు పదార్థమే ఈ పీచు పొర (Fibr ous Tissue లోనే గాక లివరులో కూడా చాలా కొవ్వు నిలవ ఉంటుంది మనుషులు స్థూలదేహులు కావడానికి కొవ్వు నిలవలే కారణము ఈ స్థౌల్యం యెల్లా ఏర్పడుతుందో శరీరంలోకి ఆహరించబడిన కొవ్వు ఎల్లా వినియోగమవుతుందో చర్చిస్తున్నప్పుడు వివరిస్తాను. ఇప్పుడు కొవ్వును నిలవ వుంచి, శరీరానికి అవసరమయినప్పుడు లివరు ఏవిధంగా అందిస్తుందో యిక్కడ వివరిస్తాను

విల్లస్సుల ద్వారా పోర్టల్ వెయినులోకి ప్రవేశించిన కొవ్వుకణములు, లివరులో ప్రవేశించి అక్కడ నిలవ వుంచబడుతవి ఇంతేకాదు శరీరంలో ఉన్న ఇతర కొవ్వు డిపోలనుండి, కరగి తరలించబడిన కొవ్వు పదార్థములు కూడా ముందు లివరుకు పోయి, శరీరంలో వినియోగమయ్యే మాదిరి కొవ్వుగా మారి లివరులో నిలవవుంటుంది గ్లయికోజను, గ్లూకోజుగా మారకుండా శరీర ధాతువులలో వినియోగపడనట్లే, కొవ్వు డిపోలలో కొవ్వు కణములలో నిలవ వున్న కొవ్వు కొన్ని మార్పులు చెందకుండా శరీరంలో వినియోగం కాదు

ఎడ్రినల్ గ్రంథినుండి తయారయ్యే ఎడ్రినలిన్ మెదడు క్రింద ఉన్న పిట్యూయిటరీ గ్రంథి ముందు భాగంలో తయారయ్యే హార్మోనులూ, తమ ప్రభావం వల్ల, శరీరంలో కొవ్వు నిలవలలో ఉన్న కొవ్వును కదలించి, రక్తంలోకి పంపుతవి ఆవిధంగా రక్తంలో ప్రవేశించిన కొవ్వు లివరుకు చేరుతుంది. అంటే ఉపవాసం వంటి పరిస్థితులలో, లివరులో, సాధారణ పరిస్థితులలో కంటె అధికంగా కొవ్వు నిలవ వుంటుందన్నమాట ఇంతే కాదు భోజనంలో కొవ్వు ఎక్కువగా ఉండి, అది హరించబడినప్పుడు కూడా లివరులో కొవ్వు ఎక్కువగా పేరుకొంటుంది ఆహారంలో కొవ్వులు ఎక్కువై లివరులోనూ శరీర భాగములలోనూ అధికంగా నిలవ ఉన్నప్పుడు, హార్మోనుల ప్రమేయం లేకుండానే అది కరిగి రక్తంలో ప్రవేశిస్తుంది.

—67వ పేజీ చూడండి

# కవి సార్వభౌముడు

## నోరి నరసింహ శాస్త్రి



### జరిగిన కథ

కొండవీటి వేమారెడ్డి శ్రీనాథ భట్టును శ్రీ విద్యానగరమునకు విద్యావిజయప్రస్థానము చేయవలసిందని అర్థిస్తాడు. శ్రీనాథుడు విద్యానగరం చేరాడు. తనను జయించేందుకే శ్రీనాథుడు వచ్చాడన్న వార్త డిండిములకు తెలుస్తుంది. శ్రీనాథుడు మానసోల్లాస కావ్యాన్ని అభిప్రాయార్థం అరుణగిరినాథులకు పంపుతాడు. డిండిముడా కావ్యాన్ని అవహేళన చేస్తాడు. శ్రీనాథుడు డిండిములకు మానసోల్లాస కావ్యావహేళనంపై అధిక్షేపణపత్రం వ్రాస్తూ కావ్యదోషాలు పండిత పరిషత్తులో నిరూపించమని డిండిమునికి సవాలు చేస్తాడు. శ్రీదేవరాయ ప్రభువుల సమక్షంలో పండిత పరిషత్తు మానసోల్లాస కావ్యం దోషరహితమని నిర్ణయించగా, ప్రతిన ప్రకారం శ్రీనాథుడు అరుణగిరినాథుల డిండిమమును నాశనం చేయిస్తాడు. దేవరాయలు శ్రీనాథుని పాండితీ గరిమను గుర్తించి, విద్యానగరాస్థానంలో తెలుగు భాషకు గణనీయస్థానం ఇస్తున్నట్లు ప్రకటిస్తాడు. శ్రీనాథునకు కనకాభిషేకం, సర్వతోహల్లుకు "ప్రతిమల్లశేఖర" బిరుద ప్రదానం జరుగుతాయి. శ్రీనాథుడు స్వగృహోన్ముఖుడై యుండగా, తన ప్రభువు వేమభూపతి రాచకొండ వారితోడి పోరులో వీరకయున మలంకరించినన్న వార్త తెలుస్తుంది. బంధుమిత్రులను యాత్రకు పంపి శ్రీనాథుడు రాచకొండకు బయల్దేరాడు.

వారందరు వెళ్ళినతరువాత రెండు వారములు వల్లభరాయని వార్తాహరునికొరకై కర్నూలులో శ్రీనాథు డాగవలసివచ్చెను. తన యాత్రకై ద్రవ్యము కూర్చుకొనుటకును, భారము తగ్గించుకొనుటకును, తనకు విద్యానగరములో పెద్దలు కట్టబెట్టిన నూతన వస్త్రములన్నియు కర్నూలు శ్రేష్ఠిని పిలిచి అమ్మించెను. తారహారముకూడ నక్కడనే యమ్మివేసెను.

వల్లభరాయని వార్తాహరుడు తెచ్చిన యుత్తరములోని సూచనలు తు చ తప్పకుండ శ్రీనాథుడు రాచకొండ ప్రయాణము సాగించెను. ఆ సమీపముననే యున్న అలంపురం జోగులాంబను దర్శించివచ్చుభాగ్యము వారి కబ్బలేదు. శ్రీశైలం ప్రదక్షిణము సంప్రాప్తమవుచున్నదను తృప్తితో, వల్లభరాయలు నిర్దేశించిన విధముగా కృష్ణ దాటి, నెలరోజులకు వారు రాచకొండ సమీపించిరి. వారి దారి సూటిగా లేక వంకరటింకరగా నుండెను. చిత్రమేమోకాని, కొంతవరకు శ్రీవిద్యానగర రాజపురుషులును, ఆపైని దేవరకొండవారును, ఆపిమ్మట రాచకొండవారును వారి క్షేమసమాచారములు ప్రతి మజిలీయొద్దను శ్రద్ధగా విచారించుచుండిరి. అది వల్లభరాయని ప్రయత్నమే యని స్పష్టపడినది.

శ్రీనాథ కవిసార్వభౌముడు విద్యానగరమున ముత్యాలశాలలో కనకాభిషేకగౌరవమంది తమ నగరము దయచేయుచున్నారను వార్త ముందుగానే రాజాచలము చేరినది. కవిసార్వభౌముని గౌరవించుటకు మహానగరమంతయు నలంకరించిరి. శ్రీనాథుని చివరిమజిలీ నారాయణపురము. అక్కడికి రాజాచలదుర్గము కనుచూపుమేరలో నున్నది. నారాయణపురములో విడిసినంతనే రాజాచలప్రభువు దూతలు శ్రీనాథుని దర్శించి, తమ ప్రభువుల యానతిప్రకారము వారిని రాజమర్యాదలతో తమ నగరమునకు గొంపోవుటకు వచ్చితిమనియు, ఎప్పుడు సెలవైనప్పుడు బయలుదేరుటకు సిద్ధముగానుందుమనియు నివేదించిరి. శ్రీనాథుడు జానాడు మూడు జాముల వేళకు బయలుదేరెదనని వారికి తెలిపెను.

శ్రీనాథుడు నారాయణపురము మజిలీలో మహేశ్వరు నర్చించి, నిత్యము హృదయస్థయై యున్న శారదాంబ నిట్లని భక్తితో స్తోత్రమొనరించెను:

"దీనారటంకాల తీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల
పలుకుతోడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునకు
పగులగొట్టించి తుద్భట వివాద ప్రౌఢి
గౌడ డిండిమభట్టు కంచుఢక్క

48—వ పేజీ చూడండి

# కలతలూ - కలహాలూ

వి. సూర్యకుమారి

కలతలు, తద్వారా కలహాలు సంభవించి కల్లోకపటం లేకుండా కలకల్లాడుతూండే కాపురాలలో సైతం, క్షీర నీర న్యాయంగా, కలిసి మెలంగే కలిమిలో సైతము కలకలం బయలుదేరి కారుచిచ్చు రగుల్కొనే సంఘటనలను నిత్య జీవితంలో కాంచని వారుండరు ఇరుగు పొరుగుల్లో వచ్చే తగవులకు కొదవేలేదు

అసలీ మనఃక్లేశములకు, మనోదౌర్బల్యం, ఆవేశం, అనుమానము, అహంభావము, అసూయ, అసహనము, అసమర్థతలే కారణాలనడంలో అసహజం అసలు లేదనుకొంటాను వీటన్నింటికీ తోడు చెప్పుడుమాట లొకటి వీటికి చదువుసంధ్యలతో గాని, సంస్కారంతోగాని సంపర్కంలేదు

అత్యంత ప్రాణమిత్రులైనా చెప్పుడు మాటలు విని తమ పూర్వస్నేహాన్ని విస్మరించి క్షణికావేశానికి దాసులైపోతారు కలవరపాటుతో కలత మొదలు దాంతో మనస్సులో పాపం పెరిగినట్లు కోపం పెరిగి తాపంపుడ్తుందే కాని మొహాన్ని అడగటం మొహమాటం లోపలిబాధ పరోక్షంలోనైనా వెళ్లగ్రక్కందే పోదు దాంతో కలహారంభం శంకేముంది స్నేహలతకి చీడపురుగు పుట్టింది

బలహీనతకు బానిసైపోకుండా కొంచం పూర్వాపరాలోచించి అతి అనుమానంతో ఏమైనా అనియుంటే గోరంతలు కొండంతలుగా చేసి చెప్పడమైనదేమో యని యొకపరి విచక్షణ జరిపితే క్షమాగుణ మలవడుతుంది మొదలుకే మోసం రాదుకదా !

ఇక గృహచ్ఛిద్రాలు ఇవి సామాన్యంగా, సమిష్టి కుటుంబాల్లో, అత్తాకోడళ్ళు, తోడికోడళ్ళు, వదినా మరదళ్ళ మధ్య ఇలాగుంటాయి వీటికి కారణం "న్యూనతాభావం" అనవచ్చునేమో అంగనలలో అంకురార్పణమైన చిట్టీ పొట్టి మాట పట్టింపులు, చిలికి, చిలికి, గాలివానలౌతాయి మగవారి చెంత చేరేటప్పటికి అందుకనే గర్భవాససంజనితుని, గర్భశత్రువుగా భావించే తండ్రులును, తమపాలిట తగనిభారముగా అప్పచెల్లెండ్రను తలంచే అన్నదమ్ములు, తల్లితండ్రులను తరిమే తనయులునూ తటస్థపడుతున్నారు ఏకోదరులై యుండి ఐకమత్యం లేక సంసారసాగరంలో తిమింగలాలై పోరాడుతూంటే, భిన్నత్వంలో ఏకత్వం సాధించి మనదేశవాసుల మంతా భరతమాత అనుంగు బిడ్డల మంటూ ఏకత్రాటిపైన నడచుట సాధ్యమా అని ! దేనికైనా ఇంట గెలిచి రచ్చ గెలవమన్నారు

ఆత్మసంతృప్తి ఆరోగ్యం, ఆరోగ్యమే మహాభాగ్యం, ఎంత చెట్టు కంతగాలి యని మనస్సును సరిపెట్టుకుని, సంకుచిత స్వభావము విడనాడితే ఎప్పుడూ మదికి సంతోషంగా ఉంటుంది. సంతోషమే సగము బలము అన్నారు పెద్దలు అలా ఉన్ననాడెన్నడూ కలతలు కలుగనే కలుగవు పొరపాటున వచ్చిన సామాన్యంగా స్త్రీలే కదా చిన్న చిన్న విషయాలకు సైతం సరిపెట్టుకోలేరు మగవారు ఇరువైపుల పరికించి ఆలోచించి తటస్థ భావం వహించినచో కొంచం కలహాల నరికట్టినట్లే

అత్త ఆరళ్ళ కోడలి గోడు పలు పలు విధములైన కథలు వింటూంటాము అత్తవారింట అడుగిడు ప్రతియువతీ తన భావిజీవితం సుఖమయం కావాలని పుట్టినింటి వాతావరణానికి విపరీత విభేదము గల్గినప్పటికీ దానికి అలవాటుపడి అత్తమామల ఆదరాభిమానముల నందవలెననియే తలంచును ఏదైన చిన్నతనంవల్ల పనిపాట్లలో పొరపాట్లు వచ్చిన తిరుగుబాటుచేయని అత్తగారైన ఎంత అదృష్టము అట్లు క్షమించగల్గిన అత్త ఎంత ఉత్తమురాలు ఒకవేళ వేలెత్తి చూపినా తల్లిగా తలంచి మది నూరడించుకొన్న మగువ మన్నన లందుకొన్నడంలో ఆశ్చర్య మేముంటుంది విద్యకు తోడు వినయ ముండిన పసిడికి తావు లబ్బినట్లుండునుగదా !

ఇరుగు పొరుగులతో జరిగే వాగ్వివాదాలకు సర్దుకోవడమే శరణ్యం మితభాషిత్వానికి మించిన మంచి మరొకటి లేదు పిల్లలలో వచ్చిన పితూరీలు పట్టించుకో కూడదు ! ఎందుకంటే ఒకళ్ల నొకళ్ళు అనుకుంటూనే ఉంటారు కనుక

సతీపతుల సంఘర్షణ సంఘంలో విపరీత పరిణామాలకు దారితీసేది దీనివల్ల పిల్లలు పాడైపోతారు తొందరబాటు, మాటభేదంవల్ల గృహజీవనాన్ని స్వర్గతుల్యంగా వూహించుకొన్న యువతీయువకులు నరకంగా చేసుకొని కుములుతూండడం కనిపిస్తే కంట నీరు రాకమానదు

సామాన్యంగా ప్రతిపురుషుడూ తన పంతం నెగ్గాలనే తలపోస్తాడు అందుకు అనుకూలవతియై మసలిన ఇంతి, వంత నొందదు కాని మాకంటూ కొన్ని అభిప్రాయా లుండరా వ్యక్తిత్వాన్ని చంపుకోవాలా అని కొంద రనవచ్చు కాని స్త్రీ సహనమూర్తి క్షమయాధరిత్రి అన్నారు. ఓర్పుతో జీవనయాత్ర సాగిస్తే ఓడిపోడం ఉండదు సహనశీలత, సహజీవని యైనపుడు ప్రతి పురుషుని మనస్సూ మమతగొని మధురానుభూతి నొందుతుంది 



ఇంతకు ముందు ఆధర కిస్తున్న మాట నిజమేనండీ! కాని ఉద్యోగుల వేతనాలు పెరిగిన దగ్గరనుంచి ఈ ధరకే ఇస్తున్నాం !!



# వనితా వాణి

## వర్ణాంతర వివాహాలు

వాణిగారు వ్రాసిన 'వర్ణాంతర వివాహాలు' అన్న వ్యాసం నన్నెంతో ఆకర్షించినది. ఆవ్యాసముపై మూడుముక్కలు ముచ్చటింపదలచాను. దమయంతి మనసార ప్రేమించిన నలుని వివాహం చేసుకున్నది. రానున్న ఆపదలకు అధైర్యపడక స్వయంవరమున దేవతలనుకూడా కాలదన్ని ప్రేమించిన సామాన్యరాజును పెండ్లాడినది పవిత్ర ప్రేమను పరిపూర్ణము చేసికొన్నది ఈవిధమున రాణించిన చెల్లెండ్రు మనలో చాలామంది గలరు కాన 'వాని' గారి అంతిమవాక్కు "ఒక కన్యమనస్సులో వేరేజాతి అబ్బాయిని చేసుకుంటే వచ్చే ముప్పులకు భయపడి పెండ్లి మానుకోవడం ఏమయినా బాగుందా?" అన్నది ప్రశంసనీయమైనది.

ఎస్ మధుమంజరి. (మద్రాసు)

* * *

తల్లి దండ్రులు కాస్త ఛాందసులైనచో ఈ వర్ణాంతరవివాహాలవలన కొన్ని చిక్కులు ఏర్పడును అట్టి పరిస్థితులలో ఆశయములంటూ వర్ణాంతర వివాహాలుచేసుకుని తల్లిదండ్రులకు జీవితాంతము బాధ కలుగజేయ కూడదు

కుమారి నిర్మల (వీరఘట్టాం)

* * *

"వర్ణాంతరవివాహాలు" వల్ల దాంపత్య జీవితమునందు భార్యాభర్తలమధ్య ఒడుదుడుకులు ఏమియు లేకుండా సుఖవంతముగా సాగిపోవుటకు అనుకూలత ఏర్పడును. ఇట్టివిషయాలలో రచయిత్రిగారు చెప్పినట్లు పెద్దలయొక్క అనుమతి ఆదరాభిమానములు చాలా అవసరము ప్రభుత్వముయొక్క చేయూత కూడా దీనికి ఎంతో తోడ్పడును.

వై. సత్యవతి (బందరు)

* * *

నేడు సమాజంలో ఇష్టములేని పెళ్ళిళ్ళు చేసుకుని, పెద్దవారిని ఎదిరించే ధైర్యంలేక, కోరికలను అణచుకొని, లోలోన బాధపడుతున్నవారికి తోటివారి ఆదరణ, సహాయాలకు బదులు, హేళనలు దెప్పుళ్ళు పొందుతున్నారు.

యం వరలక్ష్మి, జి చిట్టి (విజయవాడ)

* * *

"వాని" గారు వ్రాసిన 'వర్ణాంతర వివాహములు' నిజముగా నొక ఆకర్షణ ఇంతవరకు అంత మంచి విమర్శను నేను చదివియుండలేదు. మూఢ నమ్మకములతో, మొండిపట్టుదలలతో ఉన్న కొందరు తల్లిదండ్రులు (ముఖ్యముగా ఆడపిల్లల తల్లులు), ఈ వ్యాసమును చదివి కన్నులు విప్పుదురని ఆశించుచున్నాను.

అరుణ (విశాఖపట్నం)

## మన కుటుంబవ్యవస్థ

ప్రతిఇంటిలో అత్తగారు కోడళ్లను ఏదో ఒక సాకుపెట్టి ఆడిపోసుకుంటూనే ఉంటారు ఒకానొకప్పుడు వారుకూడా కోడళ్లే అనే విషయం వారికి గుర్తు ఉండదుకాబోలు. సి కృష్ణకుమారిగారు "మనకుటుంబ వ్యవస్థ" అను వ్యాసములో చాలా చక్కగా వివరించారు.

ఎ. యస్ వల్లీమూర్తి (విరూరు)

* * *

కుటుంబములో ఏలోపములు లేకుంటే ఉమ్మడి సంసారమునకు మించినది మరొలేదు కాని అందుకు వ్యతిరేకమైతే దానికి మించిన నరకములేదు అన్నట్లు మాకుటుంబము ఉమ్మడిగా ఏలోటు లేకుండా ఆనందముగా ఉన్నాము

జి లక్ష్మీదేవి (కొండుపల్లె)

* * *

నాకు తెలిసిన ఒకాయన ఉన్నాడు ఆయన, తన కొడుకుని, కోడల్ని ప్రతివిషయానికి వంకపెట్టుకుని సాధిస్తూ ఉంటాడు "మీకు సినిమాలు ఎక్కువయిపోయాయి, మీవరాసెం నచ్చలేదు ఏం? అవనే చెయ్యాలా? పనికిమాలినపని? పొలాని కెళ్లరాదా? పొయ్యి అలకరాదా?" ఆయన తక్కర్లేని గొడవలేదు అదొకరకం విచిత్రం మనిషి! . పాపం, వాళ్ళు ఎలాగో సర్దుకుపోదామనుకున్నా అలా బ్రతకనివ్వడు ఆ మహానుభావుడు. ఏం చేస్తారు పాపం?!

కుమారి, పి. రమ, (పిఠాపురం)

* * *

చీరలు కొనుక్కుంటే, సినిమాలు చూస్తే, చూడలేని అత్తగార్లేకాదు ప్రాణంమీదికి వచ్చి, వైద్యం చేయించకుంటే, డాక్టర్లు ఎందుకు? వైద్యం ఎందుకు ? అనే అత్తగార్లుకూడావున్నారు

మా బంధువు లమ్మాయికి ఒక అత్తగారు ఉంది బట్టలుతకటానికని బట్టలసబ్బుకొంటే, బట్టల సబ్బు ఎందుకు అంటుంది ప్రాణంమీదికి వచ్చి, వైద్యం చేయించుకుంటే, వైద్యం ఎందుకు అంటుంది ఆ కోడలు ఈలాగే అత్తగారి వలన అడబడుచులవలన అన్నిరకాల బాధలూ అనుభవిస్తోంది మళ్లా వారు కాస్తో, కూస్తో చదువుకున్నవారే!

స్నేహసౌహార్దం అనేదానికి అర్థం తెలియని ఇటువంటి మనస్తత్వంగల కుటుంబాల్లో సుఖశాంతులు ఎలా వస్తాయి?

రంగ, ఎ రత్నం (నిడదవోలు)

* * *

ఈనాటి అత్తగార్లు మాకాలంలో అని విరివిగా ఉదాహరణలు చెప్తుంటారు నిజానికి వారికాలంలో ఒక ఇంటిలోనే భాగాలుగా వుండి వేరువేరుగా వంటలు చేసుకొనేవారు. మరి ప్రతివారి ఉద్దేశంలో ఈనాటి స్త్రీఅంటే చాలా గడుసరి వారు, భర్తలకు బాగుగా మాటలుచెప్పి మార్చగలరనీ వారి ఉద్దేశం. కాని ప్రతివారు భర్తకు సహాయంగా నలహాలిస్తూ సుఖంగా గడపాలనే వాంఛిస్తారుగాని అత్తగారిమీద భర్తకు చెడుగాచెప్పి వేరుగా ఉండాలనిగాదుగదా అనుకొనేది

పుష్పలక్ష్మి (విజయవాడ)

* * *

సి కృష్ణకుమారిగారు వ్రాసిన వ్యాసం చదువుతుంటే మా స్నేహితురాలి అత్తగారు జ్ఞాపకము వచ్చింది "కోడలు" అని చెప్పుకొనుటకే సిగ్గుగా ఉంది!! మరీ అంత పాడుగేమిటి!" అంటూ ఏదో ఒకటి మొహంమీద చిదరించుకుంటుంది. మొదట ఏరికోరి చేసుకొనుట ఎందుకు? ఇప్పుడు ఏడిపించుట ఎందుకు?

కె లక్ష్మీసీత (గూటాలగేటు)

* * *

కొందరు పురుషులు పెళ్లవకముందు ఉమ్మడి సంసారమే సాగిస్తామనుకొంటారు పెళ్లవగానే ఎప్పటికి వేరైపోతామా! అని ఆలోచిస్తూ ఉంటారు ఎందుకంటే! ఉమ్మడిగా ఉంటే ఆదంపతులకు ముద్దు, ముచ్చట్లకు స్వేచ్ఛ ఎక్కువగా లభించదు అందువలన వేరైపోతే అధికానందము పొందగలమని, పురుషులే పురమాయించే వారున్నారు కూడా

కె ఎ లక్ష్మీబాయ్ (కండ్ల)

* * *

చాలామంది అత్తగార్లు కొడుకు మంచితనాన్ని చూచుకుని తమకోడళ్లను బాధ పెడుతుంటారు ఇంకొకరకంవారు వుంటారు వాళ్ల కాలంలో వాళ్ల కోడరికం అనుభవించారని తమ కోడళ్లనుకూడా బాధపెట్ట చూస్తారు కొడుకూ కోడలూ అన్యోన్యంగావున్నా చూచివోర్చలేరు పల్లెటూళ్లలో యిప్పటికి యిలాంటి కుటంబాలువున్నై మాపక్కింటివాళ్లది ఉమ్మడి కుటుంబం. కొడుకు వారం పదిరోజులకోసారి క్యాంపునుంచి యింటికి వచ్చేవాడు అతనురాగానే తల్లీ చెల్లెలు చెప్పేవారు, భార్యమీద నేరాలు అదివినగానే తన భార్య ఏం తప్పుచేసిందని ఆలోచించలేకుండా భార్యని పట్టుకుని కొట్టేవాడు ఇంట్లో పెళ్లికానిని పిల్లలు వుంటారే వాళ్ల మూలానే తగాదాలన్నీ. కృష్ణకుమారి గారన్నట్లు అంతాకలసివుండి పోట్లాడుకునే కంటే దూరంగావుండి ఎప్పుడైనా

వెడుతూవుంటే ఒకరిమీద ఒకరా[ప్రేమగా వుంటారు

కె లలితకుమారి (తిమ్మనాయనిపేట)

* * *

ఉమ్మడి కుటుంబములోఉన్న శ్రీయస్సు సౌఖ్యం దేనిలోను వుండదు కాని దానికి అను గుణంగాలేనివారితో—ఉమ్మడి సంసారంచెయ్యడం చాలా కష్టం అంచేత, అంతాకలసి ఒకేమాటమీద, నిల బడి ఒకేమాట ఆడుకుంటే ఉమ్మడి సంసారం, స్వర్గసీమ చేసుకోవచ్చు

ఓలేటి రాజేశ్వరి (పార్వతీపురం)

* * *

కృష్ణకుమారిగారు వ్రాసిన వ్యాసం చదివితే నాకు మా 'చెల్లి' కాపురం జ్ఞప్తికివచ్చింది

వాళ్లకి చాలా ఆస్తివుంది ఒక్కడేకొడుకు బాగా చదువుకున్నాడుకదాఅని, సుఖపడుతుందని చాలా సంతోషించాం అందరం కాని పెళ్లయి వెళ్ళి నప్పటినుండి దాన్ని వాళ్లుపెట్టేబాధలు యిన్నీ అన్నీకావు భార్య భర్తల్ని మాట్లాడుకోనివ్వరు పుట్టింటికి పంపించరు మేమెవరమయినా చూడ టానికి వెడితే అత్తగారు సి ఐ డి లాకాపలా కాస్తూవుంటుంది ఏంమాట్లాడుకుంటామోనని అవి పెట్టలేదు ఇవిపెట్టలేదుఅని అనుమానం సాధిస్తారు, మానాన్నగారు వెడితే పోనీ ఉద్యోగ రీత్యా ఏవూరైనా వెడితేనన్నా సుఖపడుతారను కుంటే, తల్లీ, తండ్రీ, కొడుకును ఉద్యోగం చెయ్యవద్దంటారు ఆకొడుకు తల్లీ తండ్రీ ఎంత చెబితేఅంత చదువుకున్నాడన్నమాటేగాని సం స్కారంలేదు ఎక్కడా చచ్చిచెడీ ఈ మధ్యనే ఉద్యోగం అయింది యింకోవూళ్లో ఇప్పు డయినాదాన్ని అక్కడికి పంపిస్తారో, లేదో అను మానమే యింత వరకగా అది అత్తగారిదగ్గర, అతను ఉద్యోగపు వూళ్లోనూ వున్నారు అల్లాంటి వాళ్లూ, యిల్లాంటి వ్యాసాలు చదివయినా బుద్ధి తెచ్చుకుంటే బావుండుననిపిస్తుంది ఇల్లాంటి వాళ్లు విడిగా ఉండాలనుకోవటంలో మాత్రం తప్పేముంది ఎవరి హద్దుల్లో వారువుండి సర్దుకు పోతే ఎవరికీ కలతలురావు అల్లా వుండలేనప్పుడు సంసారంలో గొడవలు, అశాంతిను

రచయిత్రి వ్రాసినట్లు సమిష్టికుటుంబంగా వుండాలంటే, ఆడబడుచులూ, అత్తగార్లూ కోడళ్లూ అంతా ఐకమత్యంతో వుంటేనే ఆకుటుంబంలో శాంతి, ఉంటుంది

యస్ లక్ష్మి (రాజమండ్రి)

* * *

పూర్వకాలంలో అందరూ ఒకే కుటుంబంగా ఉన్నారు అంటే అప్పుడు స్త్రీ, పురుషులకి చదువుసంధ్యలు, స్వాతంత్ర్యము ఉండేవికావు కనుక ఎన్నిగొడవలు వచ్చినా సంసారాలు విచ్ఛిన్నం కాకుండా ఏకంగానే ఉండేవారు

ఇప్పుడు అలా కాదుగదా రోజులు మారాయి. స్త్రీలకికూడా స్వాతంత్ర్యము వచ్చింది ఎవరి కాళ్లమీద వాళ్లు నిలబడేశక్తి స్త్రీ, పురుషు లందరికీ సమానంగా ఉన్నాయి అత్తలం, ఆడ బడుచులం మేము, ప్రతివిషయానికి సాధిస్తాం అంటే ఎవరు సహిస్తారు మంచిగా ఉండి వాళ్ల మర్యాద వాళ్లుకాపాడితే వాళ్లతో సరిగా వీళ్లూ ఉంటారు ఈ కాలంలోమటుకు ఉమ్మడి కుటుం బాలు ఎన్నిలేవు? కోడళ్లని తమ కూతుళ్లకింద భావించి, చూసుకుంటే గొడవలెందుకొస్తాయి?

కోడలే ఇంటెడు చాకిరీ చేయాలి అది ఎక్కడికీ వెళ్లకూడదు అత్తమామలు, ఆడబడ చులు, మొగుడూకూడా ఎవరంతట వాళ్లు సినిమాలకీ, షికార్లకీ వెళ్లిపోయి కోడలికి ఇల్లు, వంట అప్ప చెప్తుతుంటే ఎన్నాళ్లని సహిస్తారు? వాళ్లమీద మర్యాదకూడా పోతుంది

శ్రీమతి లక్ష్మి రామకృష్ణ (నర్సీపట్టణము) ★

## ఎప్పుడూ ఇంతే—119

శంకర్





కేప్ కాడ్ సముద్రతీరంలో విహరిస్తున్న శ్రీ కెన్నెడీ, శ్రీమతి కెన్నెడీ, వారి కుమార్తె కెరొలిన్.

# శ్రీమతి కెన్నెడీ

'అమెరికా తొలిమహిళ' శ్రీమతి జాక్విలిన్ కెన్నెడి త్వరలో మన దేశం పర్యటిస్తారు.

'తొలిమహిళ' అలంకరణాలు అనుకరించటం అమెరికన్ స్త్రీలకు అలవాటు! ఈ విషయంలో ఒకరితో ఒకరు పోటీకూడా పడ్తారని ప్రతీతి. అలంకరణాలంటే అంతగా గిట్టని సనాతనవాదులకు, ఈమె 'వైఖరులు' ఎబ్బెట్టుగా కనిపించినా వాటిని చూసి ఆనందించేవారే ఎక్కువ.

కేవలం అమెరికా అధ్యక్షుని పత్ని కావటం, 'తొలిమహిళ' గౌరవం పొందటం - ఇవి మాత్రమే కాదు శ్రీమతి కెన్నెడీకి గౌరవాన్ని సంపాదించి పెడ్తున్నది. సంస్కారం గల 'యువతి', బాగా చదువుకున్నది; చిత్రలేఖనంలో కూడా పట్టా పుచ్చుకున్నది.

శ్రీమతి కెన్నెడీకి 'ఫోటోగ్రఫీ' లో మంచి అనుభవం ఉన్నది. శ్రీ కెన్నెడీతో పెళ్లి కాకముందు ఒక న్యూయార్కు పత్రికకు ఫోటోగ్రాఫర్-విలేఖరిగా పనిచేసి, ఎలిజబెత్ రాణి పట్టాభిషేకం, ఐసెన్‌హోవర్ పదవీస్వీకారం వంటి వాటిలో పాల్గొని ప్రశంసలు పొందింది. ఈ పత్రికా వ్యాసంగంలోనే జాక్విలిన్‌కు జాన్ కెన్నెడీతో పరిచయం ప్రేమగా, పరిణయంగా పరిణమించింది.

అధ్యక్షుని పత్ని అయినా ఆర్భాటం, ఆడంబరం లేని స్త్రీ శ్రీమతి కెన్నెడీ. జాన్. ఎఫ్. కెన్నెడీ సెనేటర్‌గా ఉన్న రోజుల్నుంచి ఆమె వివిధ పత్రికల వ్యాసాలు చదివి, అనువదించి పెడుతూ భర్తకు రాజకీయరంగంలో

---

శ్రీమతి కెన్నెడీ జార్జిటౌన్‌లో ఉన్నప్పుడు రమణీయమైన ప్రకృతిని తిలకిస్తూ ఈ కాలువ గట్టుమీద విహరించేవారు

తో గృహకటవే కాక, ఇప్పుడు కూడా దైనందిన జీవితంలో భర్తకు, ఇద్దరు పిల్లలకు (ఒక కూతురు,ఒక కొడుకు) ఏమేమి కావాలో, కావలసినవి సరిగా అందుతున్నాయో లేదో స్వయంగా కనుక్కుంటుంది.

ఈమె ‘వైట్ హౌస్’ లోకి వచ్చిన తర్వాత ఆ భవనం యొక్క అందం అధికమయినదంటారు. అమెరికా అధ్యక్షుని భార్యగానే కాక ఒక వ్యక్తిగా కూడా జాక్విలిన్ కెన్నెడీ పేరెన్నికగన్న దనవచ్చు.





శ్రీమతి కెన్నెడీ గుర్రపుస్వారీలో ఆరితేరినవారు

# ఆమె సౌందర్యవతి...ఆమె పాండ్స్ ఉపయోగిస్తుంది



## రోజంతా సహజ సౌందర్యముతో మనోహరముగా ఉండుటకు పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్, పాండ్స్ ఫేస్ పౌడరు, రెండిటినీ ఉపయోగించండి

మెత్తని పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మరియు నాజూకైన పాండ్స్ ఫేస్ పౌడరు వాడితే మీ ముఖ వర్చస్సు తేజోవంతముగా మరియు యవ్వనపు శోభతో కలకలలాడుతూ ఉండుటను చూడగలరు!

సౌందర్యమును పెంపొందించే యీ సులభమైన పద్ధతిని ప్రతి రోజూ అనుసరించండి.

**మొదట:** మీ ముఖముమీద పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును తేలికగా రాసుకోండి. మంచువంటి యీ క్రీమ్ రాసుకొన్న వెంటనే కనపడకుండా పోతుంది. జిడ్డుగా ఉండదు మరియు పౌడరును అంటుకొని ఉండేలా చేస్తుంది! ఈ క్రీమ్ చర్మము మీద చిన్న చిన్న కళంకములను కనపడనీయకుండా చేసి మీ ముఖమును మృదువుగా ఉండేలా చేస్తుంది...పౌడరును గంటలతరబడి బాగుగా అంటుకొని ఉండేలా ఉంచుతుంది.







**తరువాత:** మీ ముఖముమీద పాండ్స్ ఫేస్ పౌడరును పైపైన రాసుకోండి. మీరు ఎంతో మనోహరముగా మరియు సొగసుగా కనబడతారు మీ చర్మపు రంగుతో కలిసేలా ఎన్నో నాజూకైన, తేలికైన రంగులలో లభించే యీ పౌడరు గంటలతరబడి బాగుగా అంటుకొని ఉంటుంది.

చీస్బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు. ఎస్. ఏ లో స్థాపించబడినది)

### జరిగిన కథ

రామవరం ఆంధ్ర - ఒరిస్సా రాష్ట్రాల సరిహద్దు ప్రాంతంలో ఒక గ్రామం. శ్యామబాబు అక్కడ దిగి, ఆ ఊరిలోనే వైద్యవృత్తి చేసుకుంటున్న రాధానాథ మిశ్రాగారిని కలుసుకుని ఆయన సహాయంతో ఉద్యోగం సంపాదించుకుంటాడు. రామవరంలోని మిల్లు యజమాని సత్యనారాయణరావుగారు తన పిల్లలకు శ్యామబాబు ట్యూషన్ చెప్పే ఏర్పాటు చేయిస్తాడు. నారాయణి మిశ్రాగారి పనిమనిషి. మిశ్రాగారు తాగుబోతు ఒకరోజున పోలీసులు ఆయనను పట్టుకుంటే శ్యామబాబు జరిమానా చెల్లించి విడిపిస్తాడు మిశ్రాను విడిపించుటకు హామీ నిల్చిన సూర్యప్రకాశరావు పేకాటలో ధనం పోగొట్టుకొని ఆత్మహత్యకు పూనుకొనగా శ్యామబాబు రక్షిస్తాడు. మిల్లు గుమాస్తా ధర్మసూరి కుమార్తె లలితను చూసి శ్యామబాబుకు పూర్వస్మృతులు వస్తాయి. లలితను వివాహం చేసుకోవాలని, ధర్మసూరి మేనల్లుడు శంకర్ ధర్మసూరిగారింటికి వస్తాడు. ధర్మసూరిగారు తన కుమార్తెను శంకర్‌కు చేసుకోవలసిందిగా శంకర్ తలిదండ్రులను అడిగి విఫలుడౌతాడు. శ్యామబాబుకు రామవరం జమీందారు కాంతారావుతోను, దినకరరావు అనే వ్యవసాయశాఖోద్యోగితోను పరిచయం ఏర్పడుతుంది. శంకర్ తన తలిదండ్రులకు ఇష్టంలేకపోయినా లలితను వివాహమాడ్తానని శ్యామబాబుతో అంటారు. ధర్మసూరిగారు వేరే సంబంధం చూసి లలిత పెళ్ళి చేయాలనుకుంటారు.

---



కాంతారావుగారికి శ్యామ్‌బాబు ఏవో అనేక వింత విషయాలు తెలిసినవాడనీ, చాలావూళ్ళు తిరిగినవాడనీ నమ్మకం కలిగింది. పైగా శ్యామ్‌బాబు ఒంటరివాడు. బహుశా సంసారం కూడా ఏమీ లేదేమో ? అసలు శ్యామ్‌బాబు పెళ్ళి, పెటాకులూ లేకుండా ఏదైనా సాధించడానికి తిరుగుతున్నాడేమో ? అది ఏమై ఉంటుంది ? ఆలోచించగా, ఆలోచించగా కాంతారావుగారు ఒక నిర్ణయానికి వచ్చారు. అదేమిటంటే శ్యామ్‌బాబు గొప్ప డబ్బు నార్జించే ఉపాయం కోసం ఈవిధంగా తిరుగుతూ పడుతున్నాడు కాని మరే ఇతర కారణంవల్ల కాదు ఈ విషయం తను తప్ప ఇంకెవరూ కనిపెట్టలేరని కాంతారావుగారి నమ్మకం. ఎందుకంటే కాంతారావుగారిది బ్రహ్మాండమైన 'బిజినెస్' బుర్ర. ఎదుటివాడు ఇంకా స్పష్టంగా ఏమీ ఆలోచిస్తూ ఏందని చేస్తాడో తెలుసుకోగలగడమే, 'బిజినెస్' బుర్రల లక్షణం. శ్యామ్‌బాబు, అప్పుడప్పుడు తను మహాత్ముల్ని దర్శిస్తూంటానని, సాధువులతోటి మాట్లాడుతూంటానని అనటం, కొన్ని కొన్ని మూలికలు చేసే పనుల్ని గురించి మాట్లాడటం, కాంతారావు

—43 వ పేజీ చూడండి

జూల్స్ వెర్న్



# భూగర్భంలోనికి సాహసయాత్ర

## జరిగిన కథ

హాంబుర్గ్ నగరనివాసి ప్రొఫెసర్ లిడెన్ బ్రోక్ ఒక పాత గ్రంథం సంపాదిస్తాడు. దానిలో ఒక లేఖపత్రం దొరుకుతుంది

'ఆర్నె సాక్నుస్సెమ్' అనే ప్రాచీన శాస్త్రజ్ఞుడు, ఐస్‌లాండ్‌లో ఆరిపోయిన ఒక అగ్ని పర్వతం ముఖద్వారంలోనుంచి భూగర్భంలోనికి వెళ్ళినట్లు అందులో వ్రాసి ఉంటుంది తమ్ముడు కొడుకు ఆక్సెల్ తో కలిసి ప్రొ॥ లిడెన్ బ్రోక్, అక్కడికి ప్రయాణం కడతాడు. స్నెఫెల్స్ పర్వతంవద్దకు దారి చూపేందుకు వారు హాన్స్ అనే గైడ్‌ను కుదుర్చుకుంటారు. స్కార్టారిస్ శిఖరం దిగువన వారికి మూడు రంధ్రాలు కనిపిస్తాయి మధ్య రంధ్రంమీద స్కార్టారిస్ నీడ పడేవరకు కనిపెట్టుకొని ఉండి, నీడపడిన రోజున ఆరంధ్రంగుండా లోనికి దిగుతారు. కొంత దూరం వెళ్ళేసరికి వారికి రెండుదార్లు కనిపిస్తాయి తూర్పువైపు సొరంగం లోంచి పోగాపోగా ఆదారి ఒకచోట ఆగిపోతుంది. పొరపాటు తెలుసుకొని వారు మళ్లీ రెండుదార్లు చీలినచోటకు తిరిగివెళ్లి, రెండవ సొరంగంలో ప్రయాణం కొనసాగిస్తారు. అలసిపోయిన ఆక్సెల్ దప్పికతో మూర్ఛపోతాడు. హాన్స భూగర్భజల ప్రవాహాన్ని కనుగొని అతని దప్పిక తీరుస్తాడు అంతా మళ్లీ ముందుకు నడుస్తారు పోగాపోగా ఒక పెద్దగొయ్యి ఎదురవుతుంది. దానిలో దిగి ఎనిమిది రోజులపాటు ప్రయాణం చేసిన తరువాత వారుఒక విశాలమైన ప్రదేశానికి వస్తారు. అక్కడ విశ్రాంతి తీసుకుని మళ్లీ బయలుదేరుతారు. ముందు నడుస్తున్న ఆక్సెల్ దారితప్పి ఒంటరివాడవుతాడు. హాన్స, లిడెన్ బ్రోక్ తిరిగి అతణ్ణి స్పృహతప్పి ఉన్న స్థితిలో కలుసుకుంటారు

## 30

మొదట ఏమీ కనిపించలేదు వెలుగుకి అలవాటు తప్పిన నాకళ్ళు వెంటనే మూసుకు పోయాయి. తెరచి చూడగలిగేసరికి సంభ్రమాశ్చర్యాలతో కళ్ళు ఒప్పగించి చూస్తూ ఉండిపోయాను

"సముద్రం!" అని అరిచాను

"అవును," అన్నాడు మాపెదనాన్న "లిడన్ బ్రోక్ సముద్రం

దీనిని కనిపెట్టినది నే నేకనుక నాపేరు పెట్టేందుకు ఎవరి ఆక్షేపణా ఉండవని నమ్ముతున్నాను"

ఒకపెద్ద సరస్సు లేక మహాసముద్రంవలె అజలాశయము కనుచూపుమేర అవతలకూడా ఉన్నట్లున్నది దీనితీరము గాఢ వక్రాకారముకలదిగా ఉన్నది. నీటి అలలు ఈ తీరంమీద సన్నని, బంగారురంగు కల ఇసుకమీద వచ్చిపడుతున్నాయి ప్రాచీనకాలపు జీవరాసుల గుల్లలు ఎక్కడచూచినా కనిపించాయి. అదిబయలు ప్రదేశముకాదు కాబట్టి అలలశబ్దము విచిత్రముగా గర్జించి ప్రతిధ్వనించేది: అంతవేగము

—40 వ పేజీ చూడండి

# చదువుల్రావు




అసలు యీస్టూడెంట్స్ అన్స్టేండర్డ్స్ పడిపోయారోయ్. 'కామరాజ్ నాడార్ ఎవరూ? అంటే ఈజిప్టు అధ్యక్షుడు అని వ్రాసారు ...
ఛఛ


కుతుబ్‌మినార్ అంటే ఏమిటీ అంటే షాజహాన్ భార్యని అనివ్రాస్తారు.
ఘాం ఛాం


'ఇండియాకు ప్రధాన మంత్రి ఎవరూ? అంటే జవహార్ లాల్ నెహ్రూ అని వ్రాస్తారు. కానీ...
ఛనభూ నిజంగా స్టేండర్డ్స్ పడిపోయాయండి


?!!!
రాషురాయు
సత్యమూర్తి




"రహస్యం చెపుతున్నా. మళ్లీ మానవమాత్రుడికి ఈ గుట్టు వెళ్లిందా మున వరువు దక్కదు. జాగ్రత్త!"

"ఏమిటది ?"

"నోరు జారి ఎవరి చెవినన్నా వేశావా మన కిహ పుట్టగతు లుండవు."

"మొదట చెప్పి, తరువాత భయపెట్టినా ప్రయోజనం ఉంటుంది."

"ఇంతటి రహస్యం నీ నోట దాగుతుందా అని నాకు సందేహం."

"నీ సందేహానికేంగాని అసలు రహస్యం అంత ప్రమాదకరమైందని తెలుసుకున్నతరువాత నిన కుండా ఉంటే మొదట నా ప్రాణం ఆగదు."

"ఎందుకొచ్చిన గొడవ పోనివ్వా. వెళ్లి కాసిని కాఫీనీళ్లు గొంతులో పోసుకొని మనదారి మనం పోదాం."

"మా బాబ్బాబుగా. చెబుదూ. పుణ్యం ఉంటుంది. నువ్వు చెప్పకపోతే ఈ చెట్టుక్రిందే నిరసన వ్రతం ఆరంభిస్తాను."

"అటువంటి పిచ్చి పనులేం చెయ్యకు. కొంప అంటుకుంటుంది. మొదట కాఫీ తాగి ...."

"అలాగే .... కాఫీఖర్చులన్నీ నేనే పెట్టుకుంటూ. ఆ విషయం కాస్త చెబుదూ."

"మరేం లేదు. వ్యవహారరీత్యా ఏదో పేచీ వచ్చి చికీపేరు చెబితే ముకీ మండిపడుతున్నాడు. మాటల్లేవు. మధ్య రాయబారం నన

త్వారాజే సాగుతుంది."

నడుస్తున్న కాశీపతి హఠాత్తుగా ఆగిపోయాడు. గుడ్లప్పగించి కోదండపాణివంక అలాగే చూస్తూ నిలబడ్డాడు. అతను ఆ 'షాక్'నుంచి తేరుకొని సాధారణస్థితికి రావటానికి రెండు నిమిషాలైంది.

"ఏ వి టే వి టీ ! నిప్పంటుకుందంటావ్. హమ్మయ్య, ఇహ పరవాలేదు. నేను బతికి బైట పడ్డాను దేవుడా !" కాఫీడబ్బులు నష్టమయినా ఫరవాలే దనుకున్నాడు కాశీపతి.

రహస్యం చెప్పింతరువాత కోదండపాణికి గుండె బరువు తగ్గినట్లయింది. ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ అన్నాడు. "ముకి 'ఎక్స్టెన్షన్' బుట్ట దాఖలా కావచ్చు."

"కాలాంతకుడయ్యా ముకి. ఏమిటో అనుకుంటున్నావ్. ఈ కుర్రవెధవల ఆటలు ఆయన ముందు సాగవు."

రోజూ ఇదే ధోరణిలో సాగిపోతుంటుంది వాళ్ల సంభాషణ. కోదండపాణి, కాశీపతి కలెక్టరాఫీసు గుమాస్తాలు. వాళ్ళు చర్చిస్తున్న చికి, ముకి ఎవరో కాదు. కలెక్టర్ చక్రధరరావు చికి, సిరస్తార్ ముకుందరావు ముకి. వాళ్ల సంభాషణ మరో ప్రాణికి అర్థంకాకుండా ఉండటానికి ఏర్పాటు చేసుకొన్న సాంకేతికపదా లవి.

ఉదయం ఒకచేత సంచి, మరొకచేత గొడుగు తీసుకొని టవును బస్సుకోసం చింతచెట్టు క్రింద నిలబడటం లగాయతు సాయంత్రం ఆఫీసు పనులు ముగించుకొని నాయర్ హోటల్లో కాఫీ తాగే వరకూ వాళ్ల దైనికజీవితంలో ఎటువంటి చిన్న మార్పు వచ్చినా సహించలేరు.

"విన్నావా !" ఒకరోజు ఉదయం హఠాత్తుగా అనుకోకుండా కోదండపాణి కాశీపతి యింటికొచ్చి చెప్పాడు "చికి, ముకి అన్నదమ్ములట !"

కాశీపతి నమ్మలేకపోయాడు. "అంటే ఒక తల్లికడుపున పుట్టిన వాళ్లంటావ్ !"

"అవును."

"అంటే నువ్వు చెప్పేది నిజమే నంటావ్ ?" ఇంకా నమ్మకం కలగలేదు కాశీపతికి.

కోదండపాణికి అరికాలుమంట నెత్తికెక్కింది. "అహ నమ్మొద్దు. నేను చెప్పింది పచ్చి అబద్ధం."

"ఇదుగో, అలా కోప్పడితే ఎలా చెప్పు. ఇటువంటి గొప్పవిషయం నమ్మడానికి పుట్టించిన బ్రహ్మకయినా కాస్సేపు పడుతుంది. ఇంతకీ ఆ యిద్దరూ ఒక తల్లి బిడ్డలంటావ్ ?"

"అనేదేమిటి. ఒక తల్లి బిడ్డలే. యీ విషయము తెలుసుకోడానికి నేను ఎన్ని తిప్పలు పడ్డానంటావ్."

"కావచ్చు. ఒరేయ్ చిన్నీ ! మంచినీళ్ళ పట్టుకు రారా. నా గొంతు తడారిపోయింది."అంటూ ఆశ్చర్యాన్ని దిగమింగుకుంటూ కుర్చీలో కూలబడ్డాడు కాశీపతి. అతని మెదడు వేడెక్కింది. నరాలు చురుగ్గా పనిచెయ్యసాగాయి. లోపల్నుంచి చిన్ని పట్టుకొచ్చిన మంచినీళ్ళు తాగి మనస్సు స్వాధీనం చేసుకొని అన్నాడు. "చూశావా, ఇంతకాలం అదే ఆఫీసులో పనిచేస్తున్న మనకి తెలియకుండా తెలివిగా ప్రవర్తిస్తున్నారు !"

"ఆ గొడవంతా అలా ఉంచు. ఇక ముందుంది ముసళ్లపండగ. ముకి దాఖలుచేసుకున్న 'సర్వీస్ ఎక్స్టెన్షన్' చికికి పెద్ద సమస్య అయి కూచుంది.

"అవును మరి. ఒకప్రక్క సోదర ప్రేమ మరొకప్రక్క కీర్తిసంపద రెండూ రెండు ధృవాల్లా గున్నాయి. 'శాంక్షన్' చేశాడా అన్న కృతజ్ఞుడై ఉంటాడు. లేదా కర్తవ్యపాలన కోసం అన్ననయినా లెక్కచెయ్యని కర్మిష్టి అని ప్రభుత్వం హర్షిస్తుంది. ఏది వరిస్తాడో మహానుభావుడు.'

"అక్కడే ఉంది కిటుకు. ఏదో రాసి ఐ. ఏ. యస్. పాసయినట్టుకాదు. ఇందులో చూపించాలి తెలివితేటలు."

"ముకికి యాభై అయిదేళ్ళు నిండాయి. హాయిగా 'పెన్షన్' తీసుకొని కృష్ణా, రామా అంటూ కూర్చోక ఎందుకొచ్చిన బాదరబందీ చెప్పు."

"కాలం మహా గడ్డుగా ఉందిరా! మా ఆవిడ ప్రతిదానికీ మా పక్కింటి వాళ్లతో పోటీ పడుతుంది" విలపించాడు సోమసుందరం తన చిన్ననాటి మిత్రుడితో.

నీవింకా అదృష్టవంతుడివి!! మా ఆవిడ లక్షాధికార్ల భార్యలతో పోటీ పడుతుంది." చెప్ప లేక చెప్పాడు మిత్రుడు.

ఎస్. మాధవరావు, (విజయవాడ)

"నెలనెలా చేతికొచ్చే డబ్బు చేదటయ్యా ! అందులో ఆయనకి ఎదిగొచ్చిన ఆడపిల్ల యింట్లో ఉంది. దానికి పెళ్లి చెయ్యొద్దూ ?"

ప్రస్తుతం ముకుందరావు ముందున్న పెద్ద సమస్య అదే. ఆయన జీవితకాలంలో యింతవరకూ ఎవరికీ, ఏవిషయంలోనూ భయపడలేదు. హుజూర్ సిరస్తారుగా ఏజిల్లాలో పని చేసినా, ఎక్కడున్నా, ఒక్క కలెక్టర్ దొరవారికి మాత్రం 'హెచ్. ఎస్.'. మిగిలినవాళ్లకి సింహస్వప్నం.

ఆఫీసు టైముకు ఒక గంట ముందే వస్తారు. పదిగంట లవ్వగానే అటెండెన్స్ రిజిస్టర్ చెక్‌చేసి కలెక్టర్ టేబులుకు పంపించేస్తారు, ఆలస్యంగా వచ్చినవాళ్ల వివరాలతోసహా.

మిగిలిన ఆఫీసు వ్యవహారాల్లోనూ ఎటువంటి లోపం రానివ్వరు. దేవేంద్రుడు దిగొచ్చినా కరుణ చూపించని స్వభావం. తన విషయంలోనూ అంతే. ఆఫీసుగుమ్మంలో కాలుపెట్టింది మొదలు తిరిగి యింటికి వెళ్లేవరకూ యంత్రంలా పని చేస్తారు. మిగిలినవాళ్ళూ ఒళ్ళు వంచి ప[illegible] చెయ్యాలని ఆయన పట్టుదల. మధ్యాహ్నం ఇంటి నుంచి తీసుకొచ్చే ఫ్లాస్కుతప్ప బయటికెళ్లి హోటల్లో టిఫిన్ తీసుకొనే అలవాటు లేదు. ఆ ఫ్లాస్కులో ఉంది కాఫీయో, విషమో మరో మానవమాత్రుడికి యీనాటివరకూ తెలియదు. తరువాత రాత్రి ఎనిమిదింటికి యింటికి వెళ్లిం తరువాతే భోజనంగురించి ఆలోచించేది. అంతే. ఎప్పుడయినా అంతకు మించి ఒక పట్టు పట్టటం, అదీ అవసరమైతే !

"అది ముసలి పులి ! ఎంతకయినా తగును !" అని వ్యాఖ్యానిస్తుంది ఆయనగురించి కోదండపాణి వర్గం. టేబులుమీద ఎన్ని ఫైళ్ళున్నా, ఎంత పనున్నా ఇట్టే ముగించేస్తారు ముకుందరావుగారు. ఒక్కొక్కసారి కలెక్టర్‌గారికే నడుం విరిగినంతపని అవుతుంది, ఆయనదగ్గర్నుంచి వచ్చే ఫైళ్లు చూడలేక.

"ఆరు నూరయినా, నూరు ఆరయినా మన దగ్గర ఎవరి ఆటలూ సాగవు" అంటారు ముకుందరావుగారు. ఆ మాట ముమ్మాటికీ నిజం. టెంపరరీ శివరావు దగ్గర్నుంచి సూపర్ సీనియర్ శేషయ్యవరకూ ఆయనపేరు చెప్తేనే హడల్ !

కలెక్టర్ల విషయంలోనూ అంతే. ఉద్యోగరీత్యా గౌరవించినా వాళ్ల లోటుపాటులు క్షుణ్ణంగా తెలుసు ముకుందరావుగారికి. తాను అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్టు అన్నిపనులూ ముగించి వాళ్లముందు పెడితే ఒక సంతకం గీసి పారేస్తారు. అంతకన్నా పొడిచేదేమీ లేదని ఆయనకి బాగా తెలుసు. ఈ విషయం దాదాపు పదేళ్ల నుంచి ఆయన మనస్సులో బాగా నాటుకుపోయింది. పాత ఐ. సి. ఎస్. ఆఫీసరైతేనే ఆయన గౌరవించేది. ఐ. ఏ. యస్. లు వచ్చిం తరువాత ఆయన మనసు మారిపోయింది. నిన్న గాక మొన్న వచ్చిన కుర్రకుంకలు అనుకుంటారు. ఒక్కొక్కప్పుడు బహిరంగంగా చెప్పేందుకూ శంకించరు. ఇటువంటి పరిస్థితుల్లో ఎవరయినా ఆయన మాటకు అడ్డుచెప్పారా యిక సింహగర్జన ప్రారంభమవుతుంది. చివరికి చేసేదేం లేక 'పిల్లతో నా దుంప తెగుతుంది.' అసలు తెలియనూ తెలియదు. చెప్తే అర్థంచేసుకొనే జ్ఞానమూ లేదు!' అనేసి పూరుకుంటారు. ఈ వ్యాఖ్యలన్నీ యింటికొచ్చింతర్వాతే!

ఇటువంటి సమయంలో ఆయన తమ్ముడు చక్రధరరావు ఆనర్స్ పాసయ్యాడు. వెంటనే ఐ. ఎ. యస్. పరీక్షకు పంపించాలని నిశ్చయించుకున్నారు ముకుందరావుగారు.

"ఏవో నాలుగుముక్కలు ముక్కున ఇరికించుకొని ఐ. ఏ. యస్. పాసై నా ప్రాణం తీస్తున్నారు. నువ్వూ ఒక ఐ. ఏ. యస్. అయి నావంటి ముసలి సిరస్తార్ ప్రాణం తియ్యి" అన్నారు తమ్ముడితో. చక్రధరరావుకు అన్నయ్యని చూస్తేనే భయం. ఇక ఆయన అభిప్రాయానికి ఎదురు చెప్పే ధైర్యం ఎక్కడ్నుంచి వస్తుంది. ఒకవేళ అలా చెప్పటం సంభవిస్తే మాటల్తో వదుల్తారా ?

38—వ పేజీ చూడండి




దైవజ్ఞపాతూరి శ్రీరామమూర్తి

9-3-1962 శుక్రవారము మొదలు
15-3-1962 గురువారము వరకు

## మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

వృత్తివ్యాపారాలలో స్తిమితము, మనశ్శాంతి లభిస్తవి. స్నేహితులతో వచ్చిన మాట పట్టింపులు క్రమంగా సర్దుబాటు అవుతవి. ఎప్పటికప్పుడు ధన విషయంలో సాధారణమైన ఇబ్బందులు కనుపిస్తూ ఉంటవి. అయితే ఏ సందర్భంలోనూ మాట రాకుండా వ్యవహారాలలో జయం సాధించగలుగుతారు. స్నేహితులు చేసిన పొరపాట్లు మిమ్మల్ని కొంతవరకు బాధించగల అవకాశా లున్నవి. పిల్లల మూలంగా సుఖము, సంతోషము లభిస్తవి. పెద్ద పెద్ద వ్యాపారాలలో ప్రవేశించతగిన సమయం. రాజకీయాలలో గౌరవము, క్రొత్తవారి స్నేహము లభిస్తవి. శక్తి సామర్థ్యాలను వినియోగించుకొని ఆర్థికంగా ఫలితం పొందతగిన సమయం. ఈ సమయంలో గుట్టుగా ఉండటం అవసరం. 9, 10 లలో బంధువుల రాకపోకలు, శుభకార్యాలు.

* * *

## వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

ద్వివాస్రగహంవల్ల పేరుప్రతిష్ఠలతోపాటు సుఖము, శాంతి పొందగలుగుతారు. ఆదాయం పెరగటంవల్ల మీ నూతన కార్యక్రమాలకు త్వరలో ఒక రూపం ఏర్పడుతుంది. ఎదుటివారి పొరపాట్లను నిర్భయంగా బయటపెట్టి మీ అంతస్థును నిలబెట్టుకుంటారు. ఈ వారంలో దేహశ్రమ మాత్రం అధికంగా ఉంటుంది. మీ ధనాన్ని ముందుగా ఇతరుల చేతిలో పెట్టే సమయంలో మీరు చిక్కుపడవలసిన అవసరం రాకుండా చూచుకొనండి. విద్యార్థులకు ప్రోత్సాహకరమైన సమయం. శుభకార్య ప్రయత్నాలలో ముందు నిరుత్సాహం తోచినా సకాలంలో అనుకూలత కనుపిస్తుంది. వారాంతంలో కుటుంబంలోని వారికి అనారోగ్యం చేస్తుంది. 11, 12 తేదులలో వ్యవహార జయం, వినోద కార్యక్రమాలు.

### గ్రహస్థితి

కర్కాటకంలో రాహువు, మకరంలో శని కేతువులు, మకర కుంభాలలో బుధుడు, కుంభంలో అంగారక గురువులు, కుంభ మీనాలలో సూర్యుడు, మీనంలో శుక్రుడు, మేష, వృషభ, మిధునాలలో చంద్రుడు.

## మిధునం :

(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)

గత కాలంలో ఎంత ఆదుర్దా చెందినప్పటికీ, ప్రస్తుతం మీరు నలుగురిలో హోదాను కాపాడుకోగలుగుతారు. వృత్తిలో సమర్థుల సహవాసం కలుగుతుంది. డబ్బుకాని, ముఖ్యమైన రికార్డు కాని ఇతరులమీద వదలి అజాగ్రత్తగా ఉండతగిన సమయం కాదు. ప్రయాణాలు అనుకూలిస్తవి. వ్యాపార వ్యవహారాలలో కలిగిన పొరపాట్లను సర్దుకుని ప్రశాంత వాతావరణంలో ముందుకు పోగలుగుతారు. ప్రస్తుతం మీ చేతిలో ఎంత డబ్బు ఉన్నా కర్పూరం మాదిరి హరించుకుని పోతూ ఉంటుంది. వాతప్రకోపంవల్ల అసౌఖ్యం కనుపిస్తుంది. భాగస్థులు మొదలయినవారితో ప్రసంగించటంలో నిబ్బరంతో ఉండవలసిన సమయం. బంధువుల వద్ద నుంచి కష్టవార్తలు తెలుస్తవి. 13, 14 తేదులలో ఆదాయ వృద్ధి, పుణ్య కార్యాలు, ఇష్టవస్తు లాభం.

* * *

## కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

ప్రస్తుతం గ్రహబలం అంత అనుకూలంగా ఉన్నట్లు కనిపించదు. నిజం మాట్లాడటం వల్ల నిష్ఠురాలు అధికం కాగల సమయం. తరచూ ఆదాయానికి ఆటంకాలు వస్తూంటవి. నౌకరులు మొదలైనవారివల్ల జరిగే లోపాలు అశాంతికి దారి తీయగలవు. స్వల్ప విషయంలో కూడా ఆదుర్దా, చికాకు కలుగుతూ ఉంటవి. ఈ సమయంలో అధికారులతో స్నేహం లభిస్తుంది. కుటుంబంలో అన్నివిధాలా ప్రోత్సాహం బాగుంటుంది. ధన వ్యయం మాత్రం అధికంగా కనుపిస్తుంది. యంత్ర సంబంధమైన పనులలో జాగ్రత్త అవసరం. వారాంతంలో గొంతు, రొమ్ము—ఈ భాగాలలో బాధ కలిగే అవకాశా లున్నవి. 14, 15 తేదులలో సంచారము, అకస్మాత్తుగా ఖర్చులు.

* * *

## సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

మీకు సంబంధించినవారు చేసిన అవకతవకలను సరిచేసుకుని రావలసిన బాధ్యత పైన పడుతుంది. ప్రతి పనిలోనూ ముందు కలహాలు, ప్రతికూల సూచనలు కనుపిస్తూ ఉంటవి. కుటుంబంలో అనారోగ్య కారణాలవల్ల ఖర్చులు పెరుగుతవి. దూరమందున్న స్నేహితులు మీకు అన్ని విధాలా సహాయపడతారు. భాగస్థులను కలుపుకుని నిర్వహించే పనులలో శ్రమ అధికంగా ఉంటుంది కాని, ఫలితం బాగుంటుంది స్పెక్యులేషన్ వంటి పనులలో ప్రవేశించటం మంచిదికాదు. అధికారము, గౌరవము బాగుంటవి. వాహనాలు, భూములు మొదలయినవి కొనటానికి గ్రహబలం అనుకూలిస్తుంది. సంఘంలో మీ అభిప్రాయాలకు వ్యతి

లేకత కనుపించగల అవకాశా లున్నవి. 10, 11 లలో నిరుత్సాహము, వృత్తిలో శ్రమ.

* * *

### కన్య:

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

అనేక సందర్భాలలో మీ శక్తికి తగిన ఫలితం పొందగలుగుతారు. మనశ్శాంతి, సుఖము లభిస్తవి. వృత్తి ఉద్యోగాలలో పైవారి ఆదరాభిమానాలు, ధనాదాయము బాగుంటవి. ప్రయాణాలు ప్రశాంతంగాను, లాభదాయకంగాను జరుగుతవి. ఏ వ్యవహారంలో మీరు ప్రవేశించినా చురుకుగా ఒక మార్గానికి తీసుకుని రాగలుగుతారు. మీకు మాట యిచ్చిన ఒకరిద్దరు పెద్దమనుష్యులు మిమ్ములను మధ్యలో వదలి వెళ్లవచ్చు. అయితే మీ బుద్ధిబలంతో కార్యక్రమాలను కొనసాగించ గలుగుతారు. ఈ సమయంలో డబ్బు ధారాళంగా వస్తుంది. ఖర్చు కూడా అదేవిధంగా ఉంటుంది. అయితే ఏ విధంగానూ దండగ అని అనుకొనవలసిన అవసరం ఉండదు. విందులు, వినోదాలు మొదలైనవాటిలో పాల్గొంటారు. 11, 12 తేదులలో శుభవార్తలు, వ్యవహార జయం.

* * *

### తుల:

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

ప్రస్తుతం మీ ఆరోగ్యం మాత్రం సంతృప్తికరంగా ఉండదు. ఆహార విహారాలలో జాగ్రత్తగా యుండండి. వ్యాపార రంగంలో మీ ఆలోచనలు పూర్తిగా అనుకూలిస్తవి. ఏదోవిధంగా ముందు జరుగవలసిన కార్యక్రమాలను చురుకుగా సాగిస్తారు. మీ మీద బంధుమిత్రులకు కలిగిన అపోహలు తొలగిపోతవి. ధనాదాయం మామూలుగా ఉంటుంది. సంఘ కార్యాలలో ప్రోత్సాహం తక్కువ. సంగీత సాహిత్య విషయాలలో ఆసక్తి, ప్రవేశము కలవారికి మంచి అవకాశాలు లభించగల సమయం. క్రొత్తవారిని కలవటానికి, వ్యాపార వ్యవహార విషయాలలో ఒప్పందాలు కుదుర్చుకొనటానికి అనుకూలమైన కాలం.. అయితే ఎంత అవసరం వచ్చినా ఇతరుల కలహాలలో జోక్యం పెట్టుకోవద్దు. 13, 14 తేదులలో శుభ కార్యాలు, ప్రయాణం.

* * *

### వృశ్చికం:

**(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

గత కాలంలో మీరు చేసిన శ్రమ అంతా ఫలితానికి రాగల సూచన లున్నవి. మాట పట్టింపులు, అభిప్రాయభేదాలు క్రమంగా తొలగిపోతవి. మిమ్ములను చల్లగా మోసం చేయటానికి ప్రయత్నించినవారే అకస్మాత్తుగా బయట పడటం జరుగుతుంది. చెప్పుడు మాటలను ఆధారంగా తీసుకుని ఆత్మీయులతో కలహాలకు దిగవద్దు. పై అధికారులను సంతృప్తిపరచటం కొంచెం శ్రమ కరంగా ఉన్నా, పట్టుదల వదలకుండా మీ ధర్మాన్ని నెరవేర్చుకొన గలుగుతారు. ఈర్ష్య, అసూయలు కలవారితో స్నేహం చేయటంవల్ల కొన్ని చిక్కులను కొనితెచ్చుకున్నట్లుగా ఉంటుంది. సరదా నిమిత్తం కూడా తొందరపడి హాస్యం మాట్లాడ వద్దు. 14, 15 తేదులలో బాహ్య ఆడంబరం, మొహమాటం కొరకు ఖర్చులు.

* * *

### ధనుస్సు:

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

మీ మనస్సులో ఎన్ని సమస్యలు వేధిస్తున్నా వాటిని ఒక ప్రక్కకు నెట్టి ముందు జరుగవలసిన దానిని నిర్ణయించుకో గలుగుతారు. ఏ సందర్భంలోను ఋణం చేయటం వంటి ప్రయత్నాలు విరమించుకొనటం మంచిది. వస్త్రాలు, అలంకార ద్రవ్యాలు కొనే ప్రయత్నాలు అనుకూలిస్తవి. మాటలలో సహనంతో వ్యవహరించి గౌరవం నిలుపుకొంటారు. ఇతరులవద్దనుంచి రావలసిన ధనం సులభంగా వస్తుంది. ఎదురుగా మీ మాటను అనుసరిస్తున్నట్లు మాట్లాడుతూ చాటుగా మిమ్ములను దూషించేవా రుంటారు. ముందు మీరు ఒప్పుకుని ఉన్న కాంట్రాక్టులు మొదలైన వాటిల్లో ఎక్కువ ఫలితం ఉండదు. కాని గౌరవం పొందగలుగుతారు. సంతానంవల్ల సుఖసంతోషాలు లభిస్తవి. మీ మనస్సుకు అక్రమంగా తోచినా ఎవ్వరినీ ఏమి అనటానికీ వీలు కాని పరిస్థితిలో ఇరుక్కుంటారు. 14, 15 లలో సంతోషవార్తలు, శ్రమ, స్వల్ప లాభం.

* * *

### మకరం:

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

ఏది ఎలా ఉన్నా ఆర్థిక విషయంలో విజయం సాధిస్తారు. ఈ సమయంలో మాటలలో యుక్తి అవసరం. ప్రయాణ సూచన లున్నవి. నలుగురితో బాటు గౌరవం పొందాలంటే మాటలలో, వేషంలో హుందాతనం ప్రదర్శించుకొనవలసి వస్తుంది. చివరకు ఆలోచిస్తే ఇదంతా వృథా ఆడంబరమనే విషయం తెలుసుకొంటారు. కోర్టు కచేరీలలో అనుకూలత లభిస్తుంది. విద్యార్థులకు ఉత్సాహం బాగుంటుంది. సాధారణంగా ఈ సమయంలో సంఘ కార్యాలలో పెత్తనం నిర్వహించవలసి వస్తుంది. కాని, మనస్సుకు నిరుత్సాహం తోస్తుంది. తరచూ మీ కార్యక్రమాలలో ఆటంకాలను ఎదుర్కొంటూ ముందుకు పోవలసి వస్తుంది. పిల్లల ఆరోగ్యం లోపించటంవల్ల వారాంతంలో ఆందోళన కలుగుతుంది. 14, 15 తేదులలో కలహ ప్రసంగాలు, త్రిప్పట.

### ఈ వారము ధరలు

బంగారు ధర వారం ఆరంభంలో పెరుగుతుంది. వెండి ధరలో ముందు మందీ సూచనలు కనుపించినా క్రమంగా తేజీ వస్తుంది. పసుపు ధర గతవారం వలెనే ఉంటుంది. నూవుల ధర తేజీలో నిలకడగా ఉంటుంది. నూవుల నూనె ధర వారాంతంలో మందీ రావచ్చు. వేరుశనగపప్పు ధర బాగా తేజీ వస్తుంది. నూనె ధరలో తరచు హెచ్చు తగ్గులు వస్తూ ఉంటవి. ముడి ఇనుము ధర మందీలో ఉంటుంది. ధాన్యం ధర తేజీ వస్తుంది. కాని వారాంతంలో తగ్గగల అవకాశా లున్నవి.

### కుంభం:

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

పేరుప్రతిష్ఠలు పొందగల సమయం. మీరు క్రొత్త మనుష్యులతో సంబంధం ఏర్పరచుకొనవలసి వస్తుంది. ఆదాయము, ఖర్చు కూడా అధికంగా తోచగల అవకాశా లున్నవి. మిమ్ములను ముందు నిలబెట్టి తమ కార్యం సాధించుకొనేవా రుంటారు. ప్రసంగాలలో నిర్మొహమాటంగా ఉండవలసిన అవసరం కలుగుతుంది. వృత్తి ఉద్యోగాలకు సంబంధించిన అనుకూల వార్తలు తెలుస్తవి. విలువగల వస్తువుల నిమిత్తం, వినోదాల నిమిత్తం ధనవ్యయం అవుతుంది. తోటివారు సాధించలేని పనులను సంతృప్తికరంగా నెరవేర్చ గలుగుతారు. వారం రెండవ భాగంలో దూరపు ప్రయాణం చేస్తారు. జాలితలచి సహాయం చేస్తే చివరకు మీకే అపకారం చేయటానికి చూస్తారు. యథార్థం మాట్లాడి కలహాలు కొని తెచ్చుకొంటారు. 9, 10 తేదులలో సాహస కార్యాలు, కుటుంబ సౌఖ్యము.

* * *

### మీనం:

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

సంఘంలో పటాటోపంగా ఉన్నామని అనుకొనటమే కాని, దేహానికి, మనస్సుకు కూడా అలసట అధికమవుతుంది. వ్యాపార రంగంలో చురుకుదనం లోపిస్తుంది. ప్రశాంతంగా కాలం గడుపుదామనే భావం అధికమవుతుంది. తరచూ ప్రయాణాలు చేస్తారు. మిత్రుల ప్రోత్సాహంవల్ల వృథా ప్రయాసను భరించవలసి వస్తుంది. క్రొత్త పనులలో ప్రవేశించదగిన అవకాశాలు కనుపిస్తున్నా మనస్సు మాత్రం కొంచెం వెనుకకు తగ్గుతుంది. అధికారుల మనస్సుకు తగినట్లుగా మసలుకో గలుగుతారు. గాయము, పుండ్లు మొదలయిన వాటివల్ల బాధపడవలసి వస్తుంది. శుభ కార్య ప్రయత్నాలు ఉత్సాహకరంగా ఉంటవి. 11, 12 తేదులలో ధనలాభం, వ్యవహార విజయం.



# కాల్గేట్ వాడి నోటినించి దుర్వాసన రాకుండా చేసుకోండి

## రోజంతా దంతక్షయం రాకుండాకూడా కాపాడుకోండి!




ఎందుకంటె : ఒక్క సారి తోముకొంటేనే

**కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85 % వరకు తొలగించును**

కాల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే ఆపుతుందని మరియు భోజనము అవగానే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని దంత శాస్త్ర చరిత్రలో పూర్వమ్ము ఎన్నడూ తెలియచేయనంతటా శాస్త్ర పరిశోధనల ఫలితముగా నిరూపించబడినది !

ఊరికే నోటిలో నీళ్లు పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమంతప్పకుండా కాల్గేట్‌తో పళ్లు తోముకోండి. దాని చేవతనమైన నురుగు పళ్ల మధ్య కనపడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లి పోతున్న ఆహారపు తునకలను తీసివేస్తుంది !

పిల్లలు కాల్గేట్‌తో పళ్లు తోముకొనుటకు యిష్టపడతారు. ఎందుకంటె చాల సేపు ఉండే దాని పిప్పర్‌మెంట్ వంటి రుచి అంటే వారికి ప్రీతి !




మీకు పొడరు కావాలంటే, ఈ లాభములన్నిటిని మీరు కాల్గేట్ టూత్ పొడరు ద్వారా పొందగలరు... ఒక డబ్బా నెలలు వస్తుంది

కాల్గేట్‌తో క్రమం తప్పకుండా పళ్లు తోముకొంటే

- ✔ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✔ దంతక్షయమును నిరోధించును
- ✔ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును




**నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు ప్రపంచములో ఏ యితర పళ్లు తోముకొనే క్రీమ్ కన్న కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు**



# హాసోహాసం లహాలహాసం



## గురుశిష్య సంభాషణ

ఒక గురువుగారి దగ్గరికి పొద్దున్నే ట్యూషనుకని వచ్చిన శిష్యుడి పాఠాలు: గురుశిష్యుల సంభాషణ.

Aక్కడకు పోయినావురా? ఎ(రినాగన్నా?
Bక్క మొగం వేయక చెప్పు సమాధానం!
Cనిమాకి వెళ్ళలేదూ? పాఠం చదివేవా?
Dబ్బీలో డబ్బులేవ్వు సార్ ...అందుకని...
Eక్కడ కూర్చొని తిన్నగా ఏడూ...
FA కట్టినా, BA కట్టినా బియ్యపు గింజల కోసమే కదా.. ఆఁ.
Gఒక సీసా ఓ మారిలా తీసుకురా ...
తర్వాత వెళ్తావా...వెళ్ళు...కాని...
Hచ్చుగా భోజనం చేసేవ్ ...అజీర్తి రాగల్దు.
Iనా ఫరవాలేదు, నువ్వెళ్ళి భోంచెయ్...
ఆ తిర్వాత
Jట్కాబండి తీసుకురా, స్టేషను కెళ్లాలి...
ఆ దార్లో...
'Kసరి' మార్కు 'చుట్టలాక కట్ట' కూడా మర్చిపోకు,
Lల్లవేళలా ఆ కొట్టు తీసుంటుందిలే...ఆఁ మరిచా...
M. O. ఫారం రావాలి, పనోల్ల పని...ఒచ్చిందేమో, అడుగు...
Nంత వేగంగా వస్తే అంత మంచిది.. ఒరేయ్
Oక్క మాటిలా రా. .
Pక్కబలం ఉందని పరిగెత్తే పడ్తావు జాగర్త
అలాని నా పని మానీకేం
'Qరియాసిటీ' కొంచెం లేకపోతే చికాకు... వెళ్లు...
...............
...............
Rరి నీ బండబడా!! అరగంటైనా ఇంకా ఇక్కడే వున్నావా?
S సార్, ఇప్పుడే "సిటీ"మీద వెళ్దామని
Tక్కట్టుకి డబ్బుందా...ఇవ్వనా?
Uత్తగా పనిచేసుకు పోవాలిగాని ... మళ్ళీ మిమ్మల్నడుగుతా నుటండీ...
Vనయాలకేంలే ... కావలిస్తే పట్టుకెళ్ళు
ఆ తిర్వాత నా పనన్నీ
W.P B.పరం చెయ్యాక...ఆఁ...ఏమిటే?
నొప్పా? నేనప్పుడే అనకున్నా...సరే
Xలే తియ్యించుకో... తెలుస్తుంది డిసీజు...
ఊఁ...వేగం రా...
Yలు బీసుల్ని దార్లో చూస్తూ కూర్చోకేం...
వెళ్ళు...మంచిది
.....................
Zడ్డి వెధవా! అన్ని పన్లు సక్రమంగా పూర్తి చేసేశావా...ఫో...పోయి చదువుకో...
ఇవాల్టికి చాలు ఈ పాఠాలు.

కూర్పు: "రాగు" (అనకాపల్లి)

*     *     *

## జయుని నుడులు

అన్ని దానములనుఓటుదానమేగొప్ప
మంత్రిపదవి కన్న పదవిలేదు
బస్సురూటుకన్న లెస్సయైనది లేదు
జనులు వినుడునిజము జయునినుడులు.

సొదుం జయరాం (ఉరుటూరు)

*     *     *

## విన్నపము

అష్టైశ్వర్యము లిమ్మని నిన్నడుగలేదు.
కాంతకనకము నిమ్మని నిన్ను కలవర బెట్టలేదు.
ధనదాన్యము లిమ్మని నీకు దండము బెట్ట లేదు.
భూమినిమ్మని నిన్ను బతిమాలలేదు.
పేటలిమ్మని నిన్ను పలుమార్లు వేడలేదు,
వస్తు వాహనము లిమ్మని నిన్ను వరము లడుగలేదు.
నేను కోరిన దొక్కటే వెంకటేశ;
వేగమే మంత్రి పదవిచ్చిన చాలునాకు,
నిన్ను కోరకయే వీటిని సమకూర్చుకొందు నిముషమ్ములోన,
ఎడుకొండలవాడ! వెంకటేశ!

కె. వి. వి. నరసింహారావు, (విజయవాడ)




మినిస్టరుగారి వెనకాల ఎలక్షన్లలో పనిచేసినతను—
"మినిస్టరవ్వగానే, నాకు ఉద్యోగం ఇప్పిస్తానన్నారుగా?"
"ఉద్యోగాలేమీ, ఖాళీలు లేవోయ్...అయినా ఉద్యోగాలు ఎందుకు ఖాళీలు ఉండటం లేదో పరిశీలించడానికి ఒక ఆఫీసరు పోస్టు సృష్టించి నీకిప్పిస్తానులే."

# యుగధర్మం

కనీసం ఒక్క విద్యార్థినైనా కనీసం పన్నెత్తి పలక రించలేకపోయింది. ఇంటా బయటా కనీసం నోరెత్తి తన అభిప్రాయాలన్నీ చెప్పగలిగింది కాలేకపోయింది. అంత మేథకురాలిగా ఆ యువతిని సృష్టించినందుకు, విధాతను తిట్టిపోసిన రోజులు కూడా లేక పోలేదు. బి. యే. మొదటి సంవత్సరం చదివి తండ్రి ఆన తితో చదువు మానేసిన ఆ యువతి, ఆ తరువాత శుష్కవేదాంతవిచారంతోనూ, అర్థంలేని వ్రతాల తోనూ కాలం గడుపుతోంటే అతని హృదయం తరుక్కుపోయేది. ఆ అమ్మాయి మనసుమారి, తండ్రిని ఎదిరించి ఎవర్నయినా వివాహం చేసుకుంటే ఎంత బావుండును అని ఎన్నిసార్లు అనుకున్నాడో లెక్కలేదు. ఆమెకన్నా చిన్నవారెందరో వివాహం చేసుకుని హాయిగా సంసారం చేస్తున్నారు. ఆమె జీవితం మాత్రం అలా ఎందుకు మోడయిపోవాలి?

చేయి చుర్రుమనటంతో రాధాకృష్ణ ఈ లోకం లోకి వచ్చాడు. సిగరెట్ పారేసి లేచి రూముకేసి బయలుదేరబోయి, అనతిదూరంలో నడచివస్తున్న యువతీ యువకుల్నిచూసి దిగ్భ్రాంతుడై ఆగి పోయాడు. కాత్యాయని! అవును ఆమే! అతను నోరు తెరిచి 'అక్కా' అని కేకవేసిన క్షణాన్నే ఆమె అతని వంక చూసింది. రాధాకృష్ణ వడివడిగా ఆమెను జేరుకుని, "ఎప్పు డొచ్చావమ్మా?" అన్నాడు సంభ్ర మంతో.

"నిన్నొచ్చాం!! కులాసాగా వున్నావా?" అన్నది కాత్యాయని.

"నాసంగతికేం లే? అస లీ ఊరు ఎలా వచ్చావ్?" అన్నాడు రాధాకృష్ణ. అవును మరి! అది చిత్రమయిన సంగతే!

"వారి నడుగు ఆ సంగతులన్నీ" అన్నది కాత్యా యని పక్కనున్న యువకుడ్ని చూపించి నవ్వి.

రాధాకృష్ణ అతనివంక తేరిపారజూచి, "ఎవరు వీరు?" అన్నాడు.

అతడు నవ్వాడు. "నా పేరు రమణారావు బావ గారూ!" అన్నాడు. అదే సమాధానం అన్నట్టు.

"వాట్?"

"నిజమే! అందుకు మీ అక్కగారే సాక్ష్యం"

అది సుల్తాన్ బజారనీ, అక్కడ పిచ్చికేకలు వెయ్యటం, ఆనందంతోగాని మరిదేంతోనయినాగాని తెయ్యిమని ఆడిపోవటం అపరాధమనీ, పైగా కూత వేదు దూరంలోనవే పోలీసు స్టేషను ఉందనీ, సమ యానికి గ్రహించకపోయినట్లయితే రాధాకృష్ణ అక్షణాన ఏం చేసేవాడో చెప్పలేం. అప్పటికే ఆ ఉషారులో గిర్రున తిరిగేసి వాళ్ళిద్దరి చేతులూ పుచ్చుకుని, "పదండి, మా రూముకిపోదాం" అన్నాడు. రమణారావూ, కాత్యాయనీ ముసి ముసి నవ్వులు నవ్వుకుని, అతనితోబాటు రూముకి వచ్చారు. కూచు న్నాక కొద్ది క్షణాలదాకా ఎవరూ నోరు విప్పలేదు. కాత్యాయని తలవంచుకుని కూచుంది. రమణారావు గోడల్ని తగిలించిన రక రకాల కాలెండర్లవంకా, బల్లమీద చిందర వందరగా పడివున్న పుస్తకాలవంకా ఒక్కమాటలో చెప్పాలంటే బ్రహ్మచారి నివాసానికి కొండగుర్తులావున్న ఆ గది అంతా కలయజూస్తూ కూచున్నాడు.

చివరికి రాధాకృష్ణ నిశ్శబ్దాన్ని భంగపరిచాడు. "మీ సామాన్లు తీసుకొచ్చెయ్యండి బావగారూ! అంతా కలిసే ఉందాం!" అన్నాడు.

"అలాగే! కాని ఈ........" ఆ తరువాత ఏమన డానికీ నోరురాక ఊరుకున్నాడు రమణారావు.

"అలాంటి సందేహాలేమీ అక్కర్లేదు. పక్క గది కూడా తీసుకుందాం" అన్నాడు రాధాకృష్ణ.

"మరి మీ అక్కగారి అనుజ్ఞ?"

"వచ్చినట్లే"

నవ్వింది కాత్యాయని. సంభాషణ ముందుకు సాగి అరగంటా ముప్పావుగంటదాకా నిశ్శబ్దాన్ని చీల్చి చెండాడి పారేసింది. ఆ తరువాత రమణారావు అన్నాడు, "వాళ్ళు మనకోసం కనిపెట్టుకునుం టారు. పోదామా కాత్యాయనీ?" అని.

"నో నో! అదేం కుదరదు! వెళ్ళి మీ సామాన్లు పట్టుకొచ్చెయ్యండి" అన్నాడు రాధాకృష్ణ.

"బావుంటుందా?"

"ఎందుకు బావుండదు? నువ్వు చెప్పక్కా" అన్నాడు రాధాకృష్ణ.

"పోనీ మీరు వెళ్ళిరండి. తెల్లారి సామాను తీసుకు వచ్చెయ్యండి."

రమణారావులేచి నిలబడి నవ్వుతూ, "అవున్లే! తమ్ముడు కనబడ్డాక మేం కంటి కానుతామా?...... వెళ్ళొస్తాను" అన్నాడు.

బావగార్ని సాగనంపి, తిరిగి లోపలకు వచ్చాడు రాధాకృష్ణ. ఇద్దరూ కాసేపు మవునంగా కూచు న్నారు. తలవంచుకుని చాప పుల్లలు నొక్కుతూ, "ఆయన........ఎలా కలిశారక్కా?" అన్నాడు రాధా కృష్ణ.

"మామూలుగానే" అన్నది కాత్యాయని.

"చెప్పవూ?"

జాలిగా అత డడిగిన ఆ ప్రశ్న కాత్యాయని హృద యంలోని వాత్సల్యాన్ని కదిపింది. చెమర్చిన నయ నాలను చెంగుతో వత్తుకుని, "చెబుతానుబాబూ" అన్నది. రాధాకృష్ణ చెవు లప్పగించి కూచున్నాడు.

—మనయింటి వెనకవున్న రాజారావు గారింటో సావిత్రిగారని మునిసిపల్ స్కూల్లో టీచరుగా పని చేస్తున్నామె అద్దెకు జేరింది. ఒకరోజున పెరట్లో పూలుకోస్తుంటే పలకరించింది. పిచ్చాపాటిగా సాగిన ఆ కబుర్లలో నా క్వాలిఫికేషన్ సంగతివిని ఎంతో సంబరపడిపోయింది. ఒంటరిగా వుంటుందేమో

రోజూ నాకోసం మళ్ళీ ఇంటికివచ్చి ఏవేవో మాట్లాడి పోతుండేది ఆనాటినుంచీ. వినమ్రంగా, అమాయకంగావుండే ఆమె అంటే కొద్దిరోజుల్లోనే నాన్నగారికీ, పెదనాన్నగారితోసహా అందరికీ అప్యాయత కలిగింది. నాన్నగారూ, పెద్దనాన్నగారూ వేదాంతం మాటాడుకుంటుంటే విద్యార్థినిలా వింటూ కూచునేది.

ఒకరోజున—ఆరోజు శుక్రవారం. తలంటి పోసుకుని పూలసెజ్జ పుచ్చుకుని మనయింటికి వచ్చింది. నాన్నగారు ఆవేషంచూసి, "అమాంతం దైవభక్తురాలవయిపోయావేమమ్మా సావిత్రమ్మా?" అన్నారు నవ్వుతూ. "ఇవాళ నాపుట్టింరోజు మామయ్యగారూ! కాత్యాయనితో దుర్గగుడికి పోదామని వచ్చాను" అన్నది. వంటింట్లో కూర తరుగుతున్న నా గుండెలు ఝల్లుమన్నాయి. నాన్నగారి తరహా నీకు తెలుసుగా? 'మా అమ్మాయి రావటానికి వీల్లేదమ్మా' అని నిష్కర్షగా చెబుతారేమో, ఆమె నొచ్చుకుంటుందేమోనని వణికిపోయాను. కాని ఆయన "అంతే గదా? తోపలుంది పిలు" అన్నారు. ఒక్క వుదుటున లేచి సావిట్లోకి వచ్చాను. సావిత్రి నన్ను చూసి, "పదండి మహారాణిగారు" అన్నది సరదాగా. అయిదు నిముషాల్లో బయలు దేరాం యిద్దరం. గుమ్మం దాటుతుండగా, "తొందరగా తిరిగొచ్చెయ్యండమ్మా" అన్నారు నాన్న.

గుడి దూరమని సావిత్రి రిక్షా పిలుస్తానంటే వద్దన్నాను. చెప్పకపోనేల తమ్ముడూ? పంజరంలో చిలకలా ఆరు సంవత్సరాలపాటు వీధి మొగమయినా చూడకుండా యింట్లో మగ్గిన నాకు ఆరోజు మహత్తర పుణ్యదినంగా అనుభూతి కలిగించింది. చైతన్యంతో తొణికిసలాడుతూన్న బజారువెంట కరువుదీరా నడువాలనిపించింది. లోకమంతా వింతగా, కొత్తగా కనపడసాగింది. సావిత్రి కబుర్లకి అన్యమనస్కంగా వూ కొడుతూ నడవసాగాను. కొంతదూరం నడిచాక, సావిత్రి ఆగిపోయింది. ఆ సంగతి నాకు తెలిసేదికాదుగాని, ఆమె నా చెయ్యి పట్టుకు ఆపడంతో ఆగిపోయాను.

"మా అన్నయ్యొస్తున్నాడు" అన్నది సావిత్రి.

"ఎవరూ?"

సావిత్రి జవాబుగా, చేతి సంచితో చిరునవ్వు మొఖంతో మా దగ్గరకొచ్చిన అన్నగార్ని పరిచయం చేసింది.

ఆయనేమీ బావగారు. బి. యే. పాసయినారనీ, ఉద్యోగంకోసం వెదుక్కుంటున్నారనీ చెప్పింది. అంతా కలిసి గుడికి వెళ్ళాం. దోవలో ఆయన చాలా సరదాగా మాట్లాడారు. ఆయన నాకు కొత్తవారనీ, అందులో పురుషులనీ స్పృహ లేకపోయింది నాకు అందువల్ల. ఇద్దరికిద్దరే తమ్ముడూ! అమాయకత్వానికి రూపకల్పనలా వుంటారు. వారి స్నేహం దొరికినందుకు గర్వించాను. ఆరోజంతా దాదాపు సావిత్రి యింటోనే గడిపాను.

వారం రోజులు గడిచాక ఒకనాడు నాన్నగారు అడిగారు, "సావిత్రి వాళ్ళన్నయ్య వొచ్చాట్టగామ్మా" అని.

"వూ" అన్నాను.

"నువ్వు వాళ్ళింటికి పోవటం తగ్గించాలమ్మా! రోజులసలే మంచివికావు" అన్నారు.

ప్రాణం చివుక్కుమంది.

అమ్మ మాత్రం "సంబంధాలు చూడటం చాతగాకపోయినా ఆంక్షలు విధించటం మాత్రం చాతవును" అన్నది

నాన్నగారి ముఖంకోపంతో జేవురించింది. కొట్టేవారేనేమోగాని పెద్దమ్మ రావటంతో, "చాల్లే ఇహ ఆపు" అని వూరుకున్నారు.

కలిగిన కాస్త ఉత్సాహమూ జావకారిపోయినట్లయింది నాకు. ఏనాడూ, ఏ విషయంలోనూ నాన్నగారిమాట జవదాటడానికి కలలోనయినా వూహించలేని నాకు ఆనాడు ఆయన మాటలో గౌరవం కలుగకపోయింది. ఆయన అన్నమాటల వెనకవున్న ధ్వని నాకు జీవితంమీదా, అందరిమీదా విరక్తి పుట్టించింది. ఒక్కసారి ఇరువైఆరుసంవత్సరాల జీవితమూ కళ్లకట్టినట్లయింది. నా బతుక్కి అర్థం ఏమిటి? నాన్నగారి ఆంక్షలు

---

"నేనొక రోజు, విమానంలో అమెరికా వెడుతున్నాను. అట్లాంటిక్ మహాసముద్రంమీద ఎగురుతూండగా పెద్ద తుఫాను వచ్చి ఒకరెక్క విరిగిపోయింది! అమాంతం నీటిలోకివెళ్లి పడిపోయింది విమానం! ఆహా, దేవుడి దయే లేకపోయినట్లయితే మాగతేమికాను! దైవకృపవల్ల ఈ ఉదంతం ఉత్తకథ ..." అన్నాడు ఒకపెద్దమనిషి.

కె. వి. ఎస్. ఎస్. (మద్రాసు)

---

నన్ను ఏం చేస్తున్నాయి? అలాంటి ప్రశ్నలు వేధించసాగాయి. ఆరు సంవత్సరాల యాంత్రిక జీవితం నన్ను మొడిపోయిన మోడును చేసింది. అందువల్ల నాకుగాని, నాన్నగారికిగాని ఒరిగిందేమీలేదన్న సత్యం విశ్వరూపంతో సాక్షాత్కరించసాగింది. నావంటి వ్యక్తులు ఈ లోకంలో మరి వుండరనిపించింది. ప్రతిదానికీ వో హద్దు వుంటుందనిపించింది. ఆరోజంతా ఆ ఆలోచనల్తో అయోమయంగా గడిపాను. రాత్రి పడుకుంటే నిద్ర పట్టలేదు. పక్కగదిలో నాన్నగారూ, అమ్మా మాటాడుకుంటున్న మాటలు చెవిని సోకాయి. సమాధానం దొరుకుతుందేమో నా సందేహాల కన్న ఆశతో చెవులు రిక్కించుకు విన్నాను.

"ఈడొచ్చిన పిల్ల.....ఎన్నాళ్లని దాన్నలా అట్టే పెడతారండీ?" అమ్మ ప్రశ్న.

"సంబంధం మంచిది కుదరొద్దూటే?"

"మీకు వివరూ వచ్చేరా యిరి! అందంవుంటే చదువు లేదంటారు. రెండూవుంటే డబ్బు లేదంటారు. పాతికేళ్ళు పైబడ్డాయి దానికి ఈపాటికి ఇద్దరు పిల్లల తల్లి యేది గంతకుతగ్గ బొంత అని ఏదో ఒకటిచూసి ముడి పెట్టెయ్యాలి గాని"

"అలాంటివేం కుదరవు? సర్వ లక్షణ శోభితుడయిన కుర్రవాడు దొరికి తేనే పెళ్లి చేస్తాను. లేకపోతే అలాగే వుంటుంది. పెళ్లి మొర్రో అని యాడవటంలేదు గదా అది? ఉన్న ఒక్క కూతురు పెళ్లి కక్కుర్తిగా చేశాడన్న వెధవపేరు నాకెందుకు?

"బాగానేవుంది వరస"

ఆ తరువాత సంభాషణ కొనసాగలేదు. అలాంటి సంభాషణలు నాడు కొత్తకావు. నాన్నగారి మాటలు ఆరోజున కొత్త రకంగా తోచాయి నాకు. ఆడదాన్ని నాకు పెళ్లి చేసుకోవాలి అని వుంది అని చెప్పటమా? చెబితే ఆ నాన్నగారే "సిగ్గులేనిది" అంటారనిపించింది. మనిషినై పుట్టిన నాకు కనీసం స్నేహితురాలితో సంభాషించే స్వేచ్ఛనయినా యివ్వలేకపోయినవారు అంతకు మినహా ఏమి అంటారు?

ఆ రాత్రి గడిచింది.

మరునాడు ఉదయం సావిత్రి పిలుస్తే ఏమయితే అదయిందని వెళ్లాను. ముందు గదిలో కూచొని ఉన్న ఆయన, "సుప్రభాతం!" అన్నారు నన్ను చూసి. "సుప్రభాతం" అన్నాను.

కాఫీగ్లాసులు తీసుకువచ్చిన సావిత్రి నాకొకటి, ఆయన కొకటీ యిచ్చి, "సాయంత్రం చిన్న ప్రోగ్రాం ఏర్పాటు చేశాం కాత్యాయనీ?" అన్నది.

"ఏమిటి?" అన్నాను.

"సినిమా"

రాను అందామనుకున్నాను. "ఏమిటి విశేషం?" అన్నాను.

"ఏమీలేదు. ఇవాళ్టితో ఆఖరయ్యే గొప్ప సినిమా వుండటమే. స్కూల్‌నించి నేను తిరిగొచ్చేసరికి అయిదున్నరవుతుంది. నువ్వు అప్పటికి రెడీగా వుండాలి."

"అలాగే" అన్నాను బింకంగా.

అయిదు నిముషాల తరువాత యింటికి తిరిగొచ్చాను. ఎవరితోనూ ఆ సంగతి చెప్పలేదు. ఏదో కారణంచెప్పి, సినిమా ఎగ్గొట్టవచ్చు. కాని అలా చెయ్యి బుద్ధి కాలేదు. అమ్మా, పెద్దమ్మా నాలో కలిగిన మార్పు పసికట్టునట్టు నిట్టూర్చటం గమనించాను. భోజనంచేసి పడుకున్న సమయంలో సుందరివచ్చి, "అలా వున్నా వేమక్కా?" అన్నది.

"ఏంలేదు. కాలేజికి వెళ్లలేదూ?" అన్నాను.

"సాయంత్రం అవర్సులేవు.....ఒక్క విషయం అడగనా అక్కా?" అన్నది

"అడుగు" అన్నాను చిత్రంగా ఫీలయి.

"రమణారావుగారు ఎలాంటివారు?"

"ఎందుకు?"

"చెప్పు"

"మంచివారే!"

నిట్టూర్చింది సుందరి. "నిన్న సాయంత్రం కాలేజీనించి వస్తుంటే దోవలో కలిశారాయన. నన్ను ఇల్లు జేరిందాకా పొగుడుతూనే వున్నారు. ఇంత అందమయిన దానివి. చదువుకున్నదానివి. ఎన్నాళ్ళక్కా నీ కీ అజ్ఞాతవాసం?" అన్నది.

## యుగధర్మం

సుందరి నోటవెంట అలాంటి మాటలు ఏనాడూ వినని నేను తెల్లబోయాను.

"అవునక్కా!......నేనే నీ స్థితిలోవుంటే నాకే ఆయనలాంటి స్నేహితుడు దొరికితే... హాఁ" అన్నదీ ఆవేశంగా.

నిర్ఘాంతపోయాను! తాటాకుబొమ్మలతో పెళ్ళిళ్ళు చేస్తూ, పసిపిల్లలా తిరిగిన సుందరి ఎంత మారిపోయిందీ అనిపించింది. అది ఆమె అమాయకత్వానికి తెలియని తనానికీ నిదర్శనమే కావచ్చు. అయినా ఆమె అభిప్రాయం సహజంగా కలిగేదేనేమో కూడా! పెద్దదాన్ని గనక అభిప్రాయాలన్నీ గుండెల్లో దాచుకుని, "నీ మొహంలే! పోయి చదువుకో" అన్నాను. సుందరి వెళ్ళిపోయింది."

ఆ సాయంత్రం అయిదున్నరకల్లా ఎవరికంటా బడకుండా పెరటి గుమ్మంగుండా సావిత్రి యింటికి వచ్చాను. సిగరెట్ కాల్చుకుంటూ చెల్లెలితో మాటాడుతూ, కూచునివున్న ఆయన, "పంక్చువాలిటీ అంటే అలా వుండాలి? పదండి పోదాం" అన్నారు లేస్తూ. సావిత్రి ముస్తాబయి వచ్చేసరికి ఆయన రిక్షాలు తీసుకు వచ్చారు. ముగ్గురం బయలుదేరాం.

సినిమా హాల్లో జరిగిందేమిటో చెప్పటానికి సిగ్గుపడటంలేదు తమ్ముడూ! అనురాగం ఏర్పడటం వరంలాంటిదంటారు. ఆయన్నుగురించి సావిత్రి అన్నగాతప్ప ఆలోచించి ఎరగని నేను, సుందరి మాటల ప్రభావమో ఆయన నిష్కల్మషమయిన చిరునవ్వు ప్రభావమోగాని, నా దైవంగా తలిచాను ఆవేళ. కొందరు మనుషులు అమాయకంగావుండి గోతులు తీస్తారంటారు. కావచ్చునేమో! కాని ఆయన అలాంటివారయినా కూడా ఆ గోతిలోపడిపోవటానికి సంపూర్ణసంతోషంగా అంగీకరించగలననిపించింది. నాన్నగారి పూజాగదిలోవున్న రవివర్మ శ్రీ రామచంద్రుడ్ని గుర్తుకుతెచ్చే ఆయన విగ్రహంలో వున్న ఆకర్షణ నాలో నిద్రాణమయిన స్త్రీత్వానికి మొదటిసారిగా కనుపించింది. నా జీవితానికిక కొరత లేదనిపించింది.

సినిమా అయిపోయింది. ఇంటికి తిరిగివచ్చి తలుపు తట్టినప్పుడు నేను చేసిన పనిలోని తెలివితక్కువతనం అర్థమైనట్లయింది. ఏం చేశాను నేను? ఏం జరుగుతుందిప్పుడు? నాన్నగారు రుద్రులయిపోరా? వణుకుతున్న చేతులతో తలుపు తట్టాను. అయిదు క్షణాలకు "నువ్వు యింటి కెందుకమ్మా" అన్న నాన్నగారి శాంత వచనం వినిపించింది.

అర్థమయింది.

తలుపు తియ్యండి నాన్నగారూ!" అన్నాను గాద్గదికతను జయించటానికి ప్రయత్నిస్తూ.

తలుపు భడాలున తెరుచుకుంది. "సిగ్గులేనిదానా! తిరిగావుగా వాడితోటి? ఛీ! వాడితోటేవుండు. నాకు కూతురే పుట్టలేదనుకుంటాను" అన్నారు దిక్కులు పిక్కటిల్లేట్లు.

"నా కన్నీరు యింకిపోయింది. నాన్నగారూ దూషణ వచనాలు చాలించండి" అన్న మాటతో ఆగిపోయాను. ఎవరా?' అని అందరితోపాటు రాజారావుగారి యింటి

వైపు చూశాను.

ఆయన! "వచ్చెయ్యి కాత్యాయనీ! దేవుడు నా కిస్తున్న వరానివి నువ్వు! అడ్డుపడకు" అన్నా రాయన అడ్డుగోడ దూకివచ్చి

"మా యిద్దరివంకా చూసి, "బజారు వెధవలు!" అనేసి తలుపు ధడాలున మూసేశారు నాన్న.

ఇదంతా జరిగి మూడు రోజులయింది. ఆయనా, నేనూ ఈ వూళ్లోనే రిజిస్ట్రారు ఆఫీసులో వివాహం చేసుకున్నాం. నేను స్వార్థపరురాలినే! పాపినే! కాని నాకీ నాడు జీవించటానికీ, ఆనందించటానికీ హక్కు వుంది. అది చాలదూ?

తల పక్కకు తిప్పేసుకుని కళ్లు తుడుచుకున్నాడు రాధాకృష్ణ. కాత్యాయని ఆవేశభారంతో ఇక మాట్లాడలేకపోయింది. రాధాకృష్ణ చిరునవ్వు తెచ్చుకుని, "మంచి పనేచేశావక్కా? ...... పొద్దుపోయింది. పడుకో......" అన్నాడు.

ఇద్దరూ పక్కలు పరుచుకున్నారు.

రాధాకృష్ణకు వెంటనే నిద్రపట్టలేదు కాత్యాయని చెప్పిందంతా వింటుంటే, సంతోషంతోపాటు బాధ కూడా కలిగింది. యోగ్యుడయిన భర్త దొరకటంకన్నా, ఆడది కోరదగిందిలేదు. కాని, కన్న తలిదండ్రులను, తోబుట్టువులను శాశ్వతంగా దూరం చేసుకునే పరిస్థితి ఆనందప్రదమా? కసితో, ద్వేషంతో కారిన కన్నీరు మూడు పువ్వులూ ఆరు కాయలుగా సాగవలసిన దాంపత్యధర్మానికి శాపం పెట్టకాదా? తానిప్పుడు ఏం చెయ్యాలి? అతనికి అంతా దుర్భేద్యమయిన సమస్యగా తోచింది. బలవంతంగా ఆలోచనలు విరమించుకుని కళ్లు మూసుకున్నాడు.

రెండురోజులు గడిచాయి.

ఈ రెండు రోజులూ, కాలేజీకి సెలవుపెట్టి అక్కనీ, బావనీ వెంటబెట్టుకుని భాగ్య నగరమంతా తిరిగాడు రాధాకృష్ణ. ఇల్లు విడిచి ఎరగని కాత్యాయనికి ఆ మహా నగరంలోని, దాని పరిసరాలలోని వింతలూ, విశేషాలు ఒకటి పదింతలుగా భాసించాయి. మూడోరోజు ఉదయం టిఫను ఆరగిస్తున్న వేళ రమణారావు అన్నాడు: "అన్నీ చూడటం అయింది గనుక ఇక నేను ఉద్యోగాన్వేషణ ప్రారంభిస్తాను" అని.

"మీ కిక్కడ అయినవాళ్లుగాని, తెలిసినవాళ్లు గానీ వున్నారా?" అన్నాడు రాధాకృష్ణ.

"లేరనుకోండి నోరుంటే తలకాయదా?"

"ఇదివరకు రోజులు లెండి .. మా కాలేజీలో ఒక ప్రొఫెసరుగారు యాస్బెస్టాస్ లిమిటెడ్‌పార్ట్‌నర్. నేనంటే చాలా అభిమానంగా వుంటారు అక్కడేదయినా అవకాశం వుందేమో కనుక్కుందాం"

"అలాగే"

భోజనం అయాక బావగార్ని తీసుకుని యూనివర్సిటీకి వెళ్లాడు రాధాకృష్ణ. ప్రొఫెసరుగారు రాధాకృష్ణ అడిగిందానికి 'ఎస్' అనేసి, నాలుగయిదు రోజుల్లో రమణారావును ఉద్యోగంలో చేరమన్నాడు. సెలవు తీసుకుని ఇద్దరూ యివతలికి వచ్చారు. రాధాకృష్ణ బావగార్ని ఒక్కక్షణం ఆగమని టపాకోసం జనరల్ హాల్‌లోకి వచ్చాడు. ఉన్నాయి ఉత్తరాలు. అవి తీసుకుని బావగారితో హుటాహుటిని యిల్లు జేరుకున్నాడు, శుభవార్త అక్కగారి చెవిన వేయడానికి.

* * *

ఆ ఉత్తరాల్లో ఒక ఉత్తరం రాధాకృష్ణ తండ్రి చలపతిరావుగారు రాసినది. వెంటనే బయలుదేరి రావలసిందని. రాధాకృష్ణని కాత్యాయనీ, రమణారావు ఆపూటల్లా ఎగతాళి పట్టించారు. రాధాకృష్ణ సిగ్గుతో ముఖం కందగడ్డ చేసుకున్నాడు. నాన్నగారి ఆజ్ఞ గనక, తప్పదు గనక యింటికి బయలుదేరాడు.

* * *

ఇంట్లోకి అడుగుబెట్టిన రాధాకృష్ణని చూసి వెంకట్రావుగారు "ఏరోయ్ దొరా? ఎప్పుడు దిగావ్ వోడ?" అన్నాడు చిరునవ్వుతో. కుశల ప్రశ్నలూ వగయిరా ఆ ప్రశ్న వెన్నంటే ప్రారంభమైనాయి. కాత్యాయని వెళ్లిపోవటంతో ఇంట్లో వ్యక్తులు బాగా మారిపోయివుంటారని వూహించిన రాధాకృష్ణ పరిస్థితి అలా లేనందుకు కాస్త నిరుత్సాహపడ్డాడు ఆ రాత్రి భోజనం అయి తల్లితో కబుర్లు చెబుతూ కూచున్నవేళ ఆమె అన్నది: "కాత్యాయని లేచిపోయింది తెలుసునా?" అని.

"తెలుసు" అన్నాడు రాధాకృష్ణ.

"అవున్లే! ఇలాంటి దిక్కుమాలిన వార్తలు తొందరగానే పాకుతాయి. సావిత్రి అని పక్కింట్లో ఓ పంతులమ్మ తగలడిందిలే. దాని అన్నయ్యతో లేచిపోయింది."

"తెలుసుకున్నానుగా?" అన్నాడు రాధాకృష్ణ.

తల్లి మాట్లాడలేదు.

కాత్యాయని వూసు అతని దగ్గర మరెవరూ ఎత్తలేదు. మరునాడు ఉదయం చలపతిరావుగారు కొడుకును పిలిచి, "సింగరాజాయన వచ్చి వెళ్లాడు సాయింత్రంపోయి ఆ అమ్మాయిని చూసిరా?" అన్నాడు.

"అంత అవసరమా?" అన్నాడు రాధాకృష్ణ.

"ఎన్నాళ్లని ఆగుతాం? జరిగిన ముద నష్టపు పని నలుగురిలోకీ పొక్కకముందే నీదీ, సుందరిదీ పెళ్లి కానిచ్చేస్తాను"

"అంతకానిపని చేసిందా కాత్యాయని?"

"ఏమిటోయ్ నీ బోడి సవాళ్లు? అవున్లే! వర్ణ సంకరం కావటం మీకు ఆదర్శంగా?"

ఆయన మాటలు అర్థం కాలేదు రాధాకృష్ణకి. "వర్ణ సంకరమా?" అన్నాడు

"మరి నాయుడుతో లేచిపోవడాన్ని ఏమంటారు?"

రమణారావు నాయుడా? అనుకున్నాడు రాధాకృష్ణ

"పిచ్చి ప్రశ్నలు వెయ్యకపోయి చూసిరా?"

"నాకు యిష్టంలేదు"

"ఏం? నువ్వూ ఎవర్నినా 'లవ్' చేశావా?"

"నాకు యిష్టంలేదు"

"ఎందుకనీ అని?"

చలపతిరావుగారు తారస్థాయిలో అడిగిన ఆ ప్రశ్నకు ఉలిక్కిపడ్డారు వంటింట్లోవున్న తోడుకోడళ్లూ, పూజాగదిలోని వెంకట్రావుగారున్నూ.

"ఒక షరతుమీదనయితే చేసుకుంటాను."

"ఏమిటది?" వెటకారంగా ప్రశ్నించా డాయన.

"కాత్యాయనిని తిరిగి యింటికి రానివ్వండి"

నిర్ఘాంతపోయాడు చలపతిరావుగారు. తనయుడు మరీ బుద్ధావతారం అనీ, తల్లి దండ్రులమాట తప్ప వేరొకటి ఆచరించడనీ త్రికరణశుద్ధిగా ఆయన ఏనాడూ నమ్మకపోయినా, ఈరకంగా మాటాడగలడని వూహించలేదు. కాత్యాయనిపై వల్లమాలిన అభిమానమూ, ప్రేమా వున్నా తనని, అతిడి బాబాయిని కాదని వెళ్ళిపోయిన పాపిష్టిదాన్ని వెనకేసుకొస్తాడని అనుకోలేదు.

ఆవేశం తగ్గించుకుని సాధ్యమయినంత శాంతంగా "అందువల్ల ఎన్ని అనర్థాలున్నాయో ఆలోచించావా?" అన్నాడు.

"ఏమున్నాయి?"

"సుందరికి పెళ్లికాదు."

వెంకట్రావుగారు పూజ ముగించుకుని వచ్చాడు. ఆయన్ని గమనిస్తూనే, "సుందరి పెళ్లి కావాలి అని మొత్తుకుంటోందా?" అన్నాడు రాధాకృష్ణ.

"అదేం వెర్రిమాట? ఆడపిల్ల అడుగుతుందా? మనం ఆగగలమా?"

"అక్కయ్యకి ఆగలా?"

"ఏమిటంటావురా?" అన్నాడు వెంకట్రావుగారు ముదలంకించినట్లు.

రాధాకృష్ణ జవాబు చెప్పలేదు.

"అదే ఆఖరి మాటా?"

"ఆ"

"మాకు యిష్టంలేకపోతే?"

"వెళ్లిపోతాను."

చలపతిరావుగారి ఆత్మాభిమానం దెబ్బతిన్నది. ఎంతమాట అన్నాడు వీడు? ఆవేశంతో వూగిపోతూ "పోరా! వెళ్లిపో! నీతి జాతి వదులుకుని భ్రష్టురా లయిపోయింది అది. దానికోసం నువ్వు పోతున్నావు. పో! ఇప్పుడే వెళ్లిపో!" అన్నారు. వెంకట్రావుగారు అన్నగార్ని శాంతపరిచి, "నువ్వూ అర్థం చేసుకోవాలిరా రాధా! కన్నవాళ్లం మాకున్నపాటి ప్రేమ లేదంటావా? కట్టు బొట్లు అని కొన్ని వున్నాయి గదా?" అన్నారు. అనునయిస్తున్నారు. రంగం అంతవరకూ వస్తుందని వూహించని రాధాకృష్ణ కాస్తంత చలించాడు

ఆ చలనంలో గతించిన ఘడియల వేదనలు, ఆనందాలు, స్పందించాయి. అర్థంలేని, ఆదర్శాల కోసం తమను తాము వంచించుకుంటూ ఇతరుల్ని వంచిస్తూ, మంచికీ చెడుకీ, పాపానికీ, పుణ్యానికీ వున్న సరిహద్దుల్ని సంకుచితపరిచి, అర్థంకాని అనుభూతి వెదుక్కుంటూ బతికే నేటి నరస్వరూపాలు కనిపించాయి. యుగం మారిందని తెలియదు వీళ్లకి.

మారు మాట లేకుండా తన పెట్టె సర్దుకున్నాడు రాధాకృష్ణ. కొయ్యబారిపోయి, నిశ్శబ్దంగా కూచున్న పెద్దల పాదాలకు నమస్కరించి 'గద్గద స్వరాన్ని సంభాళించుకుంటూ 'వెళ్తున్నాను' అంటూ గుమ్మం దాటాడు.



# చిక్కి - ముక్కి

27-వ పేజీ తరువాయి

ముకుందరావుకు అసలు యీ పట్టభద్రులని చూస్తేనే అసహ్యం. చక్రధర్‌కూడా పట్టభద్రుడేకదా! అతని ఇంగ్లీషులో తప్పులు తీసి చూపడం ఆయనకు ఆనందం. తెలుగులో ఎన్ని తప్పులు రాసినా ఖాతరుచెయ్యరు. అతని ఇంగ్లీషు గురించే ఆయనబాధ అంతా. గవర్నమెంటు ఉద్యోగాలకు ఎగబాకేవాళ్లు మొట్టమొదట ఇంగ్లీషులో మంచి అనుభవం సంపాదించాలని ఆయన పట్టుదల. ఉన్నట్టుండి హఠాత్తుగా ముట్టడి ప్రారంభిస్తారు. "నీవల్ల గుడ్డిగవ్వంత ప్రయోజనం లేదు. ఈ రోజుల్లో ఎందుకూ పనికిరాని అణాకానీవెధవకూడా ఐ. ఏ. ఎస్. అయి కూచుంటున్నాడు. ఇక మా అంతటివాళ్లు లేరని విర్రవీగుతుంటారు." అని. అయినా మనస్సులో తమ్ముడు ఐ. ఏ. యస్. పాసై కలెక్టర్ అవ్వాలని అనుక్షణం దేవుణ్ణి కోరుకుంటూనేఉంటారు ప్రస్తుతం తనపై పెత్తనం చెలాయించే ఐ. ఏ యస్. కలెక్టర్లమీద తనకున్న పగ తీర్చుకోడనికి ఆయనకున్న మార్గం అదొక్కటే కావచ్చు.

తల్చుకుంటే కలెక్టరేకాదు, అటువంటి కలెక్టర్లను యాభైమందిని తయారుచెయ్యగల శక్తి ఆయనకున్నదని లోకానికి చాటాలి. తన హయాంలో ఆ అవకాశం దొరకనివ్వలేదు. ఆపరిస్థితుల్లో ఎవరూ ఏమీ చెయ్యలేరు. పరిస్థితులు ఆయన్ని బానిసచేశాయి. ఇప్పటివరకూ యింకొకరికి లొంగి పనిచెయ్యాల్సొచ్చింది. ఇటువంటి అవస్థ తమ్ముడికి రాకుండా చెయ్యాలనే ఆయన కోరిక అసలు నిజం చెప్పాలంటే పరీక్షకు వెళ్లే చక్రధర్‌కన్నా ఐ. ఏ. యస్. పుస్తకాలు ఆయనే ఎక్కువసార్లు చదవటం జరిగింది. 'అది చదివావా, యిది చదివావా, యీ న్యూస్ తెలుసుకున్నావా, మేధస్సును పరీక్షించేనిమిత్తం మరికల్లాంటి ప్రశ్నలు తొమ్మిది అడుగుతారట!' సదా యిదే గొడవ.

చక్రధరరావుకి బేజారెత్తిపోయింది. పోరు పడలేక ఒకరోజు ధైర్యంగా బదులు చెప్పాడు "మనిషి ఐ. ఏ. ఎస్. కోసం ప్రాణా లర్పించాలంటారా ?"

"అవున్రా! ప్రాణా లర్పించాల్సిందే! ఇప్పుడు నేను బండచాకిరీ చేసి ప్రాణా లర్పిస్తున్నాను చూడు. ఇలా ఆఖరుదశలో చావకుండా సుఖంగా ఉండటానికి మొట్టమొదట ప్రాణాలర్పించాల్సిందే!"

"మరి ప్రాణా లుండొద్దూ ?"

"అన్నీ ఉంటాయి! నాకేం నీతులు నేర్పక్కర్లేదు. నోరు మూసుకో!"

ఆయన చెప్పే ధోరణి చక్రధర్‌కు కొన్ని ధైర్యం యిచ్చింది. "మీకు నీతులేం నేర్పటం లేదు. ఉన్న వాస్తవాన్ని చెప్పాను."

"పోరా వెధవ. పెద్ద వాస్తవాన్ని తెలుసుకున్నావ్. నీమంచికే కదరా నేను ఏడ్చేది నీకు

నామీద అంత అక్కసుగా ఉంటే కలెక్టర్వై నీ పగ తీర్చుకుందువుగానీలే. అప్పటిదాకా నాగావంటే ఆ నోటికి రెండు కుట్లేస్తాను" అన్నారు. ముకుందరావుగారు. మరో సందర్భంలో యిటువంటి వివాదమేవచ్చి తమ్ముణ్ణి కొట్టటంగూడా జరిగింది. ఆయనభార్య, కూతురు అడ్డుపడక పోతే వ్యవహారం చాలాదూరం పోయేది. కాస్త నమాళించుకొని "పరీక్ష పాసయ్యేదారి చూడరా. పరీక్ష పాసై నా తలమీదే వచ్చి కూచో. కావాలంటే నా కాన్ఫిడెన్షియల్ రిపోర్టు కరెక్టు చెయ్యి. దానికోసమయినా ఐ. ఏ. ఎస్. పాసవ్వు. పోరా వెధవ."

ముకుందరావు తన కూతురు వివాహం గురించి కూడా ఆలోచించలేదు. తమ్ముడు ఐ. ఎ. ఎస్. పాసవ్వాలి. అదే ఆయన ఏకైక వాంఛ.

"ఇలా నన్ను చిత్రవధ చేస్తున్నావ్. చూడు, ఒకరోజు నేనే కలెక్టర్నై నీ కాన్ఫిడెన్షియల్ రిపోర్టు కరెక్టుచెయ్యకపోతే నా పేరు చక్రధరరావు కాదు" అనుకొన్నాడు మనస్సులో.

చివరికి ముకుందరావు కోరిక తీరింది. ఆయన ఆశలు ఫలించాయి. చక్రధరరావు అనుకున్నట్టే కాన్ఫిడెన్షియల్ రిపోర్టు దిద్ది చూపించాడు.

తమ్ముడు తన డివిషన్కే కలెక్టర్గా రావటం ఆయన కెంతో సంతోషాన్ని కలిగించింది. కాని అది ఆయన తలవిధి అని ఎవరూ అనుకోలేదు.

ఆ తరువాత పరిస్థితులు తలక్రిందు లయ్యాయి. కలెక్టర్ చక్రధర్ అన్నగారి మాట నిలబెట్టలేదు. 'ప్రేమ, ప్రేమ' అని ఆయన ఇష్టానికి వ్యతిరేకంగా తనకు నచ్చిన పిల్లను పెళ్లిచేసుకున్నాడు.

పెళ్లి అయింతరువాత చక్రధర్ అతని భార్య పార్వతి రెండుమూడుసార్లు ఏదో మాటవరసకి వచ్చి మొహం చూపించారు. కాని ముకుందరావు ఆయనభార్య వాళ్ల గుమ్మం తొక్కలేదు. ఒకసారి యింటికి రమ్మని బలవంతపెట్టడం జరిగింది. ముకుందరావు తన కూతుర్ని పంపినా తాను పోలేదు. తన భార్యను వెళ్లనివ్వలేదు. ఆమె కూడా భర్త అజ్ఞను మీరి వెళ్లలేదు.

ముకుందరావు ఎవర్ని అదుపులోపెట్టినా వయస్సునుమాత్రం అదుపులో పెట్టలేక పోయారు. యాభై అయిదేళ్లు అనుకోకుండానే దాటిపోయాయి. ఇంకా తాను అధికారుల అనుమతిపొంది మరో అయిదు సంవత్సరాల పాటు పనిచెయ్యెచ్చు. ఇంట్లో వయసొచ్చిన పిల్ల ఉంది. పెళ్లి చెయ్యాలి. ఇప్పటివరకూ సంపాదించిన సంపాదన తమ్ముడి చదువుకోసం ఖర్చుపెట్టారు. ఇటువంటి పరిస్థితుల్లో తాను 'రిటైర్' అయితే పిల్లపెళ్లి ఎల్లా సాధ్యపడుతుంది. మరో అయిదు సంవత్సరాలు ఎలా అయినా కష్టపడి పనిచెయ్యా లనుకున్నారు. కాని ప్రతిసంవత్సరం కలెక్టర్ తనకు అనుమతి ఇస్తుండాలి. పోయిన రెండు సంవత్సరాలు అనుమతి యిచ్చిన కలెక్టర్ బదిలీ అయి వెళ్లిపోయారు. ఇప్పుడున్న కలెక్టర్ చక్రధరరావు!

చక్రధరరావు తనయింటికి రాకపోయినా పార్వతి అప్పుడప్పుడు వస్తూనే ఉంటుంది. కారు హారన్ వినగానే కలెక్టర్భార్య వస్తుంది. తన 'ఎక్స్టెన్షన్' గురించి చెబుదామని నోటివరకూ వస్తుంది. పార్వతి యింట్లో అడుగుపెట్టి భయపడూ నమస్కరించగానే ఆమె తన మాట వివకుండా వివాహంచేసుకున్న తమ్ముడి భార్య అయిపోతుంది. ఇహ అభిమానం అడ్డుపడి నోట మాట రాకుండా చేస్తుంది. పార్వతిమనస్సు నిష్కల్మషమైంది. ఆమెకు ఇదేం తెలియదు. సరాసరి లోపలికెళ్లి సరస్వతిని మనసారా కావిలించుకొని "అక్కా, బావగారు, మీరూ యిక మా యింటికి రాకూడదనే తీర్మానించుకున్నారన్నమాట. మరీ పత్తిడిచేస్తే విజయని పంపిస్తారు. ఇలాగే మాటల్తో వదిలి ప్రయోజనంలేదు. ఒకరోజు అందర్నీ కట్టకట్టుకొని కార్లోవేసి తీసుకెళ్లిపోతాను."

"మరి మీ బావగార్నేం చేస్తావ్ ?" చురకలాంటి సరస్వతిప్రశ్నకి పార్వతి సిగ్గుపడి నెమ్మదిగా అంటుంది "బావగార్నిమాత్రం వదుల్తానా .... అక్కయ్యా, నాకూ అమ్మా నాన్నా లేరు. ఆ కొరత మీరే తీర్చాలి !"

పై సంభాషణ విన్నంతవరకే ముకుందరావు మనస్సుకు శాంతి. తరువాత మళ్లీ తన కుటుంబం.

---

ప్లీడర్ పద్మనాభంగారికి అపరిచిత వ్యక్తి ఎవరో ఒకరోజున ఉత్తరం రాశాడు. "పీలు నామాలు రాయించడంలో మీరు ఘటికులని నాకు తెలుసు. ఈమారు ఎక్కడైనా పని తగిలితే నా పేరు స్వేచ్ఛగా వాడుకో వచ్చని మీకు తెలియజేస్తున్నాను" అపరిచిత వ్యక్తి అనుమతి ఇచ్చాడు.

డి. ఎస్. రావు, (సూర్యాగుపేట)

---

తాను కట్టుకున్న ఆశాసౌధాలు, తన కూతురు పెళ్లి జ్ఞాపకంరాగానే గుండె చెదరిపోతుంది.

చక్రధరరావు ఆఫీసులో ఉన్నప్పుడు కలెక్టరన్నమాట మరచిపోయి తమ్ముడిమీద తాను చెలాయించే అధికారంతో ఎక్స్టెన్షన్గురించి అడుగబోయి మళ్లీ ఏదో గుర్తొచ్చి పిడుగుపడ్డట్టు కూలిపోతారు ముకుందరావుగారు. ఆక్షణం ఆయన్లో కలిగే ఆవేదనకు, కోపానికి యీ ప్రపంచం కాలి మసైపోలే దేమా అనిపిస్తుంది.

అక్కడ కుర్చీలో కూర్చుంది కలెక్టర్ ! కాదు తన తమ్ముడు ! కాదు తనకు ద్రోహం తలపెట్టిన వంచకుడు ! చక్రధర్ కలెక్టరయినా ఫరవా లేదు. తమ్ముడయినా ఫరవాలేదు. ఇప్పు డతను రెండూ కాదు! తనకోసం దేవుడు సృష్టించిన వేదన !

ఆఫీసులో యిద్దరూ ఏనాడూ అన్నదమ్ముల్లా మాట్లాడుకోలేదు. అటువంటి అవసరం వస్తే కాగితాలద్వారా సంప్రదింపులు జరుగుతాయి. లేదా యితరులద్వారా రాయబారం జరుగుతుంది. ఏనాడూ తమ్ముడి అంతస్తుకూ, హోదాకూ భంగం రాకుండా ప్రవర్తించారు ముకుందరావుగారు.

చివరికి ఒకరోజు ఎక్స్టెన్షన్ నిరాకరించ బడినట్లు కలెక్టర్ ఉత్తరువు వచ్చింది. అది చూసి సంతోషపడాలో, విచారించాలో అర్థంకాలేదు. 'ఇంతకన్నా ఎక్కువ వేరే ఏం చెయ్యగలడు' అనుకొన్నారు.

ఇన్ని సంవత్సరాలనుంచి పనిచేస్తున్న ఆఫీసు, పరిసరాలు తృప్తిగా విడిచిపెట్టే అవకాశం లేకపోయింది. 'నాకు మగసంతానం లేదనే కొరత లేదు. నా చక్రధరే నాకు సకలం !' అనుకొనేవారు. ఈనాడు తన కొడుకు కలెక్టరై, సరే, వాడూ యిలాగే పోట్నాడి తన్ను కాదని వెళ్లినా చివరికి సరస్వతికయినా అతన్ని పోరి తన అజ్ఞకు బద్ధుణ్ణి చేసుకొనే హక్కు ఉండేది. మరది దగ్గర ఆమె అటువంటి అధికారాన్ని ఎలా చెలాయించ గలుగుతుంది. దేవుడే తనను వంచించాడు.

ముకుందరావు మొహంలో ఎటువంటి సంచలనం కనిపించలేదు. రోజూ ఆఫీసు విడిచిపెట్టి వెళ్లినట్టే వెళ్లారు.

గుమ్మంలో కాలుపెట్టగానే యింటిముందు కారాగిన శబ్దం వినిపించింది. ముకుందరావు ఆ శబ్దం విననట్టే తన గాంభీర్యానికి ఎటువంటి లోటు రాకుండా నడిచి వెళ్లిపోయారు.

"అక్కయ్యా ! బావగారికి యాభై అయిదేళ్లంటాయి. తమ్ముడి చదువులకోసం కష్టపడింది చాలక యింకా విజయ పెళ్లికోసం గూడా ఆయన్ని కష్టపెట్టాలని చూస్తున్నారా. తనంతటి తమ్ముడు సంపాదిస్తున్నప్పుడు ఆయన కెందుకు చెప్పండి యీ శ్రమ ! ఇన్నాళ్లూ మీముం దొక రహస్యాన్ని దాచాను. ఇక దాచి ప్రయోజనం లేదు. పరస్పరం మేమెంత అర్థంచేసుకున్నా మా పెళ్లిముందు వారు నా దగ్గర ఒక వాగ్దానాన్ని తీసుకొన్నతరువాతగాని వివాహానికి సమ్మతించలేదు. 'నేను సర్వదా మీ చెప్పుచేతలలోనే ఉంటా' నని మాట ఇచ్చింతరువాతే నన్ను చేబట్టారు. కాని మా పెళ్లి మీ మనసుల్లో అపార్థాన్ని కలిగించింది. వారు సంపూర్ణంగా ఈ వాగ్దానం నావల్ల నెరవేరుతుందనే నమ్మకంతోనే నన్ను వివాహమాడారు. ఇది వారి తప్పెలా అవుతుంది? ఆయన చేసిన తప్పు ఒకటే. అన్నముందు ధైర్యంగా మనసు విడిచి మాట్లాడే శక్తి లేదు. విజయ పెళ్లికోసం ఎక్స్టెన్షన్ అప్లై చేశారని నాతో చెప్పి బాధపడని క్షణం లేదు. ఇప్పటికయినా అనుమతిస్తే కావలసిన ఏర్పాట్లన్నీచేద్దాం."

"పార్వతీ!"

లోపలి కొచ్చారు ముకుందరావుగారు. పార్వతి నమస్కరించి తల వంచుకొని నిల్చుంది.

"చికిగా డేడి?"

"ఎవరు?"

ఆఫీసు సాంకేతిక ప్రయోగాన్ని పొరపాటుగా అనేసినందుకు నాలుక కొరుక్కొని "కలెక్టర్గారు ...." అన్నారు.

"మీకోసం యింటి గుమ్మం వరకూ వచ్చి మిమ్మల్ని చూడగానే మీముందు నిలబడే ధైర్యం చాలక పారిపోయారు. ఆయన తరఫున నా తరఫున నేనే క్షమార్పణ కోరుకుంటున్నాను" అన్నది వినయంగా పార్వతి.

ఆయననోట మాట రాలేదు. మనసులో అనుకున్నారు. "నా తమ్ముడు. కలెక్టర్ చక్రధరరావు ఐ. ఏ. యస్ !"



లేని గాలికి అలలపైన నురుగు ఏర్పడి నీటితుంపర నా ముఖానికి తగిలినది. నీటిఒడ్డుకు సుమారు ఆరువందల అడుగుల దూరంగా పెద్దకొండలు కొలవ సాధ్యముకాని ఎత్తులను అందుకుంటు న్నాయి. కొన్నిటి అధోభాగములు మట్టినేలలోనుంచి పైకి కనిపిస్తున్నాయి. తీరమువరకూ సాగడమే కాక కొన్ని నీటిలోకి కూడా చొచ్చుకుని అలలతాకిడికి గురి అవుతున్నాయి. నీటిఒడ్డువెంబడే, నాకు ఇరువైపులా కొండల బాహ్యరేఖాస్వరూపం దిగంతముపైన మసకగా కనిపిస్తున్నది.

ఇది నిజమయిన సముద్రమే. భూమిమీద ఉండే వాటికి ఉన్న తీరంవంటి తీరమే ఉన్నది. అయితే దాని పరిమాణాలు ఇంతవరకూ ఎవరూ లెక్క వెయ్యలేదు.

నీటిమీద అంత దూరం చూడగలుగుతున్నా నంటే దానికి కారణం ఆ ప్రదేశమంతా వ్యాపించి ఉన్న కాంతి. ఇది కళ్లు మిరిమిట్లు గొలిపే సూర్య రశ్మి కాదు. ప్రతిబింబించిన వెలుగు కనుక మన కగా, పాలిపోయిన చంద్రుని కాంతి వలె వేడిలేనిది కాదు. దీని సంగతి వేరు. దాని తెల్లదనమూ ఉష్ణోగ్రస్థితిపైన ప్రభావం లేకపోవటమూ, వెన్నెలను మించిన కాంతి, 'మిణుగురు' మంటున్న దాని వ్యాప్తి — ఇవన్నీ చూస్తే విద్యుచ్ఛక్తి సంబంధము కలదని స్పష్టంగా తెలిసిపోతున్నది. మహా సముద్ర మొకటి పట్టేటంత పెద్ద 'గుహ' ను (అరోరాబొరియలిస్) పోలిఉన్నది.

పైకప్పు — కావలిసివస్తే ఆకాశ మనవచ్చు — నిండా పెద్ద మేఘాలు కదలుతున్నట్లు ఉన్నాయి. వాటి ఆవిరి ఘనీభవించి కుంభవర్షము సంభవిస్తుందేమో అనుకున్నాను. అక్కడి వాయు పీడన శక్తికి నీరు ఆవిరిగా మారేందుకే వీలు లేదు అనుకున్నాను కాని, నాకు తెలియని కారణాలవల్ల, పైన పెద్ద మేఘాలు పరచుకుని ఉన్నాయి. అయినా వాతావరణము 'నిర్మలము'గా ఉన్నది. కాంతి మేఘాలమీద పడి విచిత్రమయిన దృశ్యాలు కనిపించేవి. నీడలు స్పష్టంగా తెలిపే మబ్బుల క్రింది భాగాలకూ, పైభాగాలకూ మధ్య మెరుపు మెరిసేది. సూర్యుడు లేడు కనుక ఈ వెలుగులో వేడి లేదు. దాని ఫలితంగా ఆ వాతావరణమే మనస్సులో విచారము కలిగించేదిగా ఉన్నది. మెరుస్తున్న నక్షత్రాల ఆకాశము బదులుగా బరువైన గ్రానైట్ కప్పు ఉన్నదనే విషయం మరిచి పోలేక పోయాను.

అప్పుడు నాకు ఒక ఇంగ్లీషు 'కాప్టెన్' సిద్ధాంతం గుర్తుకు వచ్చింది. డొల్లగా ఉన్న భూగోళం లోపల గాలి, లోపలే పరిభ్రమిస్తున్న రెండు నక్షత్రాల—ప్లూటో, ప్రాసర్పిన్‌ల—కాంతికి ప్రకాశిస్తూ ఉంటుందని ఈయన అభిప్రాయము. ఆయన చెప్పినది నిజమే నేమో ?

కనీసం, ఒకటి మాత్రం నిజమని నిస్సందేహంగా చెప్పవచ్చు. మేము ఉన్న ప్రదేశానికి అన్ని వైపులా 'గోడలు' ఉన్నాయి. దాని వెడల్పు, పొడవు, ఎత్తు ఇవేమీ కొలవలేము. ఉజ్జాయింపుగా అంచనా వేసి చూడగా కప్పు కొన్ని మైళ్ళ పైన ఉండి ఉండాలి. మేఘాలు కూడా పన్నెండువేల అడుగుల పైన కలుతున్నట్లు కనిపించాయి — అక్కడ

# భూగర్భంలోనికి సాహసయాత్ర

24-వ పేజీ తరువాయి

వాయువుల సాంద్రత అధికమవటంచేత భూతలము మీదకంటె ఎక్కువ ఎత్తున గాని ఏర్పడవు.

ఈ పెద్ద ప్రదేశాన్ని 'గుహ' అని పిలవటము సరికాదు. కాని, భూగర్భాగాధాలలోనికి దిగినవారికి మామూలు భాష ఏమి సరిపోతుంది ?

అంతేకాదు, ఇటువంటి వైచిత్ర్యాలకు కారణాలు నాకు తెలియవు — భూగోళం చల్లబడుతున్నప్పుడు ఏర్పడితే తప్ప. కొందరు వైజ్ఞానికుల వర్ణనలు బట్టి ప్రఖ్యాతి చెందిన 'గుహలు' గురించి నాకు కొంచెం తెలుసు కాని ఇంత పెద్ద పరిమాణాలు కలది ఏదీలేదు.

---

"ఆహా, మా ఎద్దులకి మంచి మందిప్పించాడండీ మన కొత్త వెటర్నరీ డాక్టరు. మాత్రలు ఎంత చురుగ్గా పనిచేస్తున్నాయను కున్నారు?" అని చెప్పుకు పోయారు రాఘవేంద్రరావుగారు.

"ఏం మాత్రలండీ అవీ ?" సీతయ్యగారు అడిగారు.

"పేరు గుర్తుకు రావడంలేదు కాని పెప్పర్‌మెంట్ బిళ్ళల రుచి ఉందండీ !"

జి. ఎస్. (మద్రాసు)

---

వెనిజులా దేశంలోని 'గువాచరోస్' గుహలు బారన్‌ఫోన్ హంబోల్ట్ పరిశోధించాడు. రెండు వేల అయిదు వందల అడుగుల లోతు వరకూ దిగిచూసినా అంతు చిక్కలేదు. దాని లోతు అంతకన్నా కొంచెమే అధికమయి ఉంటుంది. కెన్‌టక్కీలోని మామూత్ గుహ నిజంగా పెద్దది. ఒక అగాధమయిన సరస్సుపైన లేచిన దాని 'కప్పు' అయిదు వందల అడుగుల ఎత్తు ఉంటుంది. కాని ఈ 'గోతులు' నేను చూస్తున్నదాని ముందు ఏమాత్రము ? ఇందులోని మహాసముద్రమూ, మబ్బుపట్టిన ఆకాశమూ, 'విద్యుద్దీపకాంతి', ఇవన్నీ ఎక్కడ ?

ఈ వింతలను మౌనంగా చూస్తూ ఉండి పోయాను. నేను ఏమి మాట్లాడినా నా ఆలోచనలు వర్ణించలేవు. భూలోకానికి అతిదూరంగా ఉన్న యురేనస్ ( Uranus ), నెప్ట్యూన్ ( Neptune ) గ్రహాలమీద నా ఊహకు అందని వైచిత్ర్యాలు చూస్తున్నట్లు అనిపించింది. కొత్త అనుభూతి తెలిపేందుకు కొత్తమాటలు కావాలి. ఇవి నా భావనాశక్తి అందుబాటులో లేవు. చూసి విస్మయం చెందాను. నా విస్మయంతో సమ్మోహమే కాక భయం సహితం కలిసినది.

అనూహ్యమయిన ఈ దృశ్యం నాకు క్రొత్త శక్తి యిచ్చినది. నా ఆశ్చర్యమే ఒక రకమయిన 'చికిత్స' క్రింద తయారయినది. చిక్కని గాలిలో ప్రాణవాయువు అధికంగా ఉంటుంది. ఇది నా ఊపిరితిత్తులలోనికి వెళ్లి నా ఉత్సాహం ఎక్కువ అయినది.

రెండు రోజులు బందీగా ఉన్న తర్వాత ఈ ఉప్పు వాసన వేసే గాలి, తేమ నాకు ఎంత ఆనందం చేకూర్చాయో మీకే తెలుస్తుంది.

ఆ చీకటి రాతికోన వదిలివచ్చినందుకు నేను విచారపడ నవసరమే లేదు. ఈ వింతలు మా పెదనాన్నకు బాగా అలవాటయిపోయాయి.

"చిన్న షికారు కొచ్చే వోపిక ఉందా ?" అని అడిగాడు.

"తప్పకుండా ! అంతకంటేనా ?" అన్నాను.

"మంచిది. నా చెయ్యిమీద ఆనుకో. నీటి అంచునే వెడదాము."

ఉత్సాహంగా, ఆయన చెప్పినట్లే చేశాను. ఇద్దరమూ కలిసి ఈ క్రొత్త కడలి ఒడ్డు వెంబడే నడిచాము. మాకు ఎడమ వైపుగా కొన్ని రాళ్లు పేరుకుపోయి చూసేందుకు అద్భుతంగా ఉన్నాయి. కొన్నిటిమీద స్వచ్ఛమయిన జలపాతాలు పడుతున్నాయి. మరి కొన్ని రాళ్ళవద్ద వేడినీటి ఊటలు సూచిస్తూ ఆవిరి లేస్తున్నది. ఈ ఊటలన్నీ నెమ్మదిగా పల్లం వైపు పారిపోతున్నాయి. చరియల మీద మాత్రం అవ్యక్త ధ్వనితో మనస్సు మెప్పించేవి.

ఈ ప్రవాహాల మధ్య మా హాన్సె సముద్రం లోనికి దిగటం గమనించాను. ప్రపంచం ప్రారంభం నుంచీ వేరే వ్యాసంగమే లేనివాడివలె ప్రవర్తిస్తున్నాడు.

"ఇది కూడా కనిపించదు కదా !" అన్నాను ఒక నిట్టూర్పుతో.

"అబ్బా !" అన్నారు ప్రొఫెసర్‌గారు. "ఇది కాకపోతే మరొకటి, అంతేగా భేదం ?"

ఆయన సమాధానంలో 'కృతజ్ఞత' లోపించినది అనుకున్నాను.

ఆ క్షణంలో నా కళ్లకు మరొక వింత దృశ్యం కనిపించినది. సుమారు అయిదు వందల 'అంగల' అవతల కొంచెం మెరక ప్రదేశంలో ఒక దట్టమయిన అడవి చూశాము. మరీ పెద్దవి, చిన్నవీ కాని చెట్లు, గొడుగుల ఆకారంలో ఉన్నాయి. గాలి బలంగా వీచినా ఏమాత్రం కదిలినట్లు లేవు. రాయిగా మారిన దేవదారువెన్నలవలె ఉన్నాయి.

త్వరగా నడవడం ప్రారంభించాను. ఈ వృక్షాలు ఏ జాతికి చెందినవి ? సరస్సు ప్రాంతాలలో తటస్థమయ్యే క్రొత్తరకం చెట్లా ? కాదు. వాటి నీడలోకి అడుగు పెట్టగానే అర్థమయిపోయినది కాని నా విస్మయం అధికమయినది.

అంటే, మామూలుగా మనకు బజారులో దొరికే వృక్ష విశేషాలే కాని, రాక్షస పరిమాణాలతో ఉన్నాయి.

"కుక్క గొడుగుల అడవి" అన్నాడు మా పెదనాన్న.

ఆయన వూహ తప్పుకాదు. ఆ వేడిలో, తడిలో ఈ విలువకల మొక్కలు నమ్మ శక్యంకాని పరిమాణాలకు పెరిగాయి. తెల్లగా ఉన్న ఈ కుక్క గొడుగు ఒక్కొక్కటీ ముప్పై, నలభై అడుగుల ఎత్తు ఉంటుంది. పైన 'బిళ్లల' 'వ్యాస పరిమాణం' కూడా ఇంత ఉండి ఉండాలి. కొన్ని వేలు ఉన్నాయి. ఆఫ్రికన్ గ్రామాలలోని ఇంటి కప్పులవలె దగ్గర దగ్గరగా ఉన్నవాటి 'శిఖరాల క్రింద నీడలో దట్టమయిన చీకటి వ్యాపించి ఉన్నది.

ఇంకా ముందుకి సాగిపోవటానికి సిద్ధంగా ఉన్నాను. ఆ సజీవ పటలంనుంచి దుర్భరమయిన చలిప్రసారమవుతున్నది. ఆ తేమలో, అంధకారంలో ఒక అరగంటసేపు తిరిగాము. తిరిగి నీటిఒడ్డు చేరుకొన్న తర్వాతనే నా మనసు కుదుటబడింది.

ఈ 'పాతాళ' లోకంలో మొలిచేవి కుక్క గొడుగులు మాత్రమే కానట్లు ఉన్నది. కొంచెం అవతల మరికొన్ని వృక్షాలు చూశాము. వాటి ఆకులు, కొమ్మలు పాలిపోయి రంగు లేకుండా ఉన్నాయి. అవి ఏమిటో సులభంగా తెలుసుకున్నాము. భూమిమీద సాధారణంగా పెరిగే పొదలే కాని ఇక్కడ రాక్షస పరిమాణాలకు పెరిగి ఉన్నాయి.

"ఆశ్చర్యం—అద్భుతం !" అని అరిచాడు మా పెదనాన్న. "భూమిమీద రెండవ యుగంలో ఉన్న వృక్షాలన్నీ ఇక్కడే ఉన్నాయి. మన తోటలలో చిన్నచిన్న మొక్కలుగా పెరిగేవన్నీ ఇక్కడ మహావృక్షాలు ! చూడు ఆక్సెల్ ! చూసి ఆశ్చర్యపడు ! ఏ వృక్షశాస్త్రజ్ఞుడికి ఇటువంటి 'కన్నుల విందు' లభించి ఉంటుంది !"

"అవును పెదనాన్నా, ఈ ప్రదేశంలోని ఉష్ణోగ్రస్థితి అతిప్రాచీనకాలంలో 'వర్ధిల్లిన' వృక్షాలు నశించిపోకుండా కాపాడి ఉండాలి."

"బాగా చెప్పావోయ్. కాని ఇది వృక్షాలకి మాత్రమే వర్తించదు. జంతువులకు కూడా ! ఇదొక జంతుశాల !"

"జంతుశాలా !"

"సందేహం లేకుండా. మన కాళ్లకింది ధూళి చూడు, నేలమీద ఎముకలు చూడు !"

"ఎముకలు !" అని అరిచాను. "అవును. అతి పురాతన కాలాలలో జీవించినవాటి ఎముకలు !"

వెంటనే వాటివద్దకు దూకి ఒక్కొక్క అస్థిక ముందూ ఆగి దానికి సంబంధించిన వివరాలు బయటకు చెప్పటం మొదలుపెట్టాను.

"ఇదిగో ఇది ఒక మాస్టొడాన్' (Mastodon) యొక్క చివ్వకం. ఇవిగో 'డినోతెరియమ్' దంతాలు .... " అని చెప్పుకుపోయాను. "ఈ జంతువులన్నీ ఈ తీరం వద్దనే నివసిస్తూ ఉండిఉండాలి. 'కాని...."

"కాని ఏమిటి ?" అన్నాడు మా పెదనాన్న.

"నాలుగు కాళ్ల జంతువులు ఈ గ్రానైట్ గుహలోనికి ఎలా వచ్చాయి ?"

"ఎందుకు రాకూడదు ?"

"భూగోళశాస్త్రం ఒప్పుకోదు. అత్యుష్ణోగ్రస్థితి కల రాయి ఆరిన తర్వాతనే మట్టినేల ఏర్పడి ఉండాలి కదా ! దాని తర్వాతనే ప్రాణులు వచ్చిఉండాలి."

"దానికేముంది ఆక్సెల్. మనం నుంచుని ఉన్న ఈ నేల మట్టినేల."

"ఏమిటీ! భూతలానికి ఇంత లోతునా ?"

"భూగోళం చల్లబడుతున్నప్పుడు కొన్ని చీలికలు వచ్చి పైనున్న మట్టినేల కొంచెం లోపలికి జరిగి ఉంటుంది."

"అయిఉండవచ్చు. అటువంటి రాక్షస మృగాలు ఇక్కడ జీవించి ఉన్నట్లయితే ఇంకా ఈ ప్రదేశాలలోనే ఎందుకు తిరుగుతూ ఉండకూడదు ?"

ఈ ఊహ నన్ను ఆశ్చర్యచకితుడిని చేసింది. భయంగా నా చుట్టూ చూశాను. కాని ఆ తీరము మీద ఏ జంతువూ కనిపించలేదు.

నాకు కొంచెం అలసట అనిపించినది. అందుచేత అలలు క్రిందుగా ఢీకొంటున్న ఒక ఎత్తు ప్రదేశంమీద వెళ్లి కూర్చున్నాను. అక్కడనుంచి తీరం వంకరలవల్ల ఏర్పడిన ఖాతం చూడవచ్చు. అవతలగా ఒక చిన్న 'నౌకాశ్రయం' వంటిది ఉన్నది. నేలలోనికి చొచ్చుకొని వచ్చిన జలభాగము గనుక ప్రశాంతముగానే ఉన్నది. రెండు మూడు నావలు సులభంగా లంగరువేసి ఆగేటంత విశాలము కలిగి ఉన్నది. నిండు తెరచాపతో ఏదైనా ఒక నౌక నాకు ఎదురవుతుందా అనిపించినది.

అమాయకపు శాంతయ్య వీధి మలుపులో ఉన్న పోలీసు దగ్గరకు వెళ్లి "చూడండి! మా ఆవిడ వస్తుందేమోనని గంట నుంచి ఇక్కడ కాచు కూర్చున్నా. నేను వెళ్ళిపోయేం దుకు దయచేసి ఆజ్ఞ ఇవ్వండి" అని అడిగాడట.

ఎమ్. చిట్టిబాబు (మద్రాసు)

కాని ఈ 'మిథ్య' నుంచి బయట పడ్డాను. ఈ 'పాతాళ'లోకంలో మేము తప్ప వేరు ప్రాణులు ఎక్కడ ? గాలి వేగం తగ్గిన తర్వాత అక్కడి నిశ్శబ్దం ఎంత ప్రగాఢమయినదో చెప్ప నలవి కాదు. ఎడారిలో కూడా ఆ రాతి గుట్టల చుట్టూ సముద్రంమీదా ఆవరించిన నిశ్శబ్దం ఉండదేమో. దూరంగా ఉన్న పొగమంచు తెరలు ఛేదించి ఉండాలనుకున్నాను. నా మనస్సులో ఏవేవి ఊహలు నిండినవో ! ఈ మహా సముద్రం అవధి ఎక్కడ ? ఎక్కడకు తీసుకుపోతుంది ? ఎప్పటికయినా అవతలి ఒడ్డు చేరుకొనగలమా ?

మా పెదనాన్న మాత్రం ఈ విషయమై సందేహపడనేలేదు. నాకు ఒకవైపు వెళ్లాలని ఉన్నది కాని భయంగానూ ఉన్నది.

ఒకగంటసేపు ఈ అద్భుతమయిన దృశ్యం చూసిన తర్వాత మేము రాత్రి గడిపిన చోటికి తిరిగి వెళ్లిపోయాము. పిచ్చిపిచ్చి ఊహలతో నిద్రపట్టినది.

## 31

మర్నాటికి పూర్తిగా కోలుకున్నాను. స్నానం చేస్తే, బాగుంటుందని అక్కడి 'మధ్యధరా సముద్రం" (ఈ సందర్భంలో ఉచితమయినపేరు) లో ఈతకివెళ్లాను.

మా భోజనాలకు వంటలు ఎన్నో ఉండవు. హాన్స్ మాత్రం వీటితోనే రుచికరమైన భోజనాలు తయారుచేసేవాడు. మంచినీరు, నిప్పుఉన్నది కాబట్టి భోజనానంతరం కాఫీచేసి ఇచ్చాడు. ఈ పానీయము ఇంత రుచికలది అనినేను అనుకోనేలేదు.

"ఇప్పుడు, ఈ సముద్రం ఆటూ పోటూ పరిశీలించే అవకాశం కలిగేట్లున్నది," అన్నాడు మా పెదనాన్న.

"అటూ పోటూ ఏమిటి!" అన్నాను నేను.

"తప్పకుండా అవే."

"సూర్య చంద్రగోళాల ఆకర్షణశక్తి ఇంత లోతునకూడా తెలుస్తుందా?"

"సందేహం లేకుండా. ప్రకృతి న్యాయాలను తప్పించుకునే శక్తి ఈ నీటికి మాత్రం ఉన్నదా? ఇక్కడ వాయుపీడనశక్తి అధికంగా ఉన్నా ఇక్కడ నీరు అట్లాంటిక్ సముద్రం నీటివలెనే ప్రవర్తిస్తాయిచూడు." అప్పటికి మేము ఇసుక మీద నడిచివెడుతూన్నాము: అలలుకొద్ది కొద్దిగా తీరంమీదకు తోసుకు వస్తున్నాయి.

"నిజంగానే వస్తున్నాయే!" అని అరిచాను.

"అవును ఆక్సెల్, అలల మీదనురుగు చూస్తే మొత్తానికి పదిపన్నెండు అడుగుల వరకూ నీరు లేస్తుందనుకుంటాను."

"ఆశ్చర్యంగా ఉంది.!"

"కాదు, ప్రకృతి స్వభావమే అంత."

"నువ్వేమయినా చెప్పు పెదనాన్నా! ఇదంతా నాకు నమ్మేట్లులేదు. భూగర్భంలోపల అటూ పోటూ, గాలి, తుపాను, ఇవన్నీ ఉండే సముద్రం ఒకటుందని ఎవరు వూహించగలరు!!"

"ఎందుకని వూహించలేరు? అలా ఉండరాదనే నియమం ఏమన్నా ఉన్నదా?"

"భూగోళ కేంద్రంలోవేడిఉంటుందనే సిద్ధాంతం వదిలివేస్తున్నాం కనుక నియమాలుఏవీ చెప్పలేను."

"అంటే ఇంతవరకైనా డేవీ సిద్ధాంతం సరియైనదేనని ఒప్పుకుంటావా?"

"అంతేగామరి. భుగోళంలోపల సముద్రాలే కాక దేశాలుకూడా లేవనటానికి వీలులేదు."

"అవును—కాని ప్రాణిరహితంగా నేమో!"

"ఒక్క క్షణం ఆగు! ఈజలాలలో మనకు తెలియని చేపలు ఎందుకుండ కూడదు?"

"ఇంతదాకా మనమేవీ చూడలేదు."

"సరే! గాలాలు కొన్ని తయారుచేసి, మన 'అదృష్టం' ఎలాఉంటుందో, వేసి చూద్దాం."

"ప్రయత్నించి చూద్దాం, ఆక్సెల్. ఈలోకంలోని రహస్యాలన్నీ ఛేదించి చూడాలి."

"కాని పెదనాన్న మనమిప్పుడు ఎక్కడ ఉన్నాం?"

"అడ్డంగా చూస్తే మనమిప్పుడు ఐస్‌లాండుకు సుమారు ఏడువందల ఏభై మైళ్ల దూరంలో ఉన్నాం."

"అంతదూరం వచ్చేశామా?"

"మూడువేల అడుగులలోపుగా ఈ దూరం సరియైనదేనని చెప్పగలను."

"దిక్సూచి ప్రకారం ఆగ్నేయంగా ప్రయాణం చేస్తున్నామా?"

# భూగర్భంలోనికి సాహసయాత్ర

"ఆ! పడమరగా పందొమ్మిది డిగ్రీల నలభై రెండు నిముషాలు తిరిగిఉన్నది—భూమిమీదవలెనే. మరొక చిత్రమైన వివరం గమనించాను."

"అదేమిటి?"

"సూది ధ్రువంవైపు తిరగటానికి బదులు పైకి లేస్తున్నది."

"అంటే అయస్కాంత కేంద్రం భూతలానికీ మన కీ మధ్య ఎక్కడో ఉన్నదన్నమాట."

"సరిగ్గా చెప్పావ్. ధ్రువ ప్రదేశాలలో డబ్భై ఛ డిగ్రీల 'రేఖ' కింద ఉన్నట్లయితే సూదినేరుగా పైకి సూచిస్తుంది. అంటే ఈ అయిస్కాంత కేంద్రం భూతలానికి మరీ అంతలోతుగా లేదన్నమాట."

"ఈ విషయం 'శాస్త్రం' అనుమానించలేదు."

అబ్బాయ్ శాస్త్రం తప్పులతో నిండిఉంటుంది —కాని ఈ తప్పులు చేసినాపరవాలేదు. వీటిని సరిదిద్దుకున్నప్పుడే నిజంతెలుస్తుంది."

"ప్రస్తుతం మనం ఎంతలోతున ఉన్నాం?"

"సుమారు నూటఅయిదుమైళ్ళు."

నావద్ద 'మాప్' పరీక్షించి చూశాను." స్కాట్‌లాండ్‌లోని పర్వత ప్రదేశం మనమీద ఉన్నదన్నమాట. 'గ్రాంపియన్' మంచుకొండల శిఖరాలు చాలా ఎత్తు అనివిన్నాను."

"అవును", అన్నాడు ప్రొఫెసర్‌గారు చిరునవ్వుతో."కొంచెం పెద్దబరువే మొయ్యవలసివస్తోంది. కాని పైకప్పు గట్టిది. ఈవిశ్వాన్ని నిర్మించిన శిల్పిమంచి వస్తువులనే వాడాడు. మానవుడు ఇంతనిశ్చలమయిన ఆధారం కల్పించలేడు. మన వంతెనలు, భవంతులు మహాసముద్రాన్ని ఇముడ్చు కోగల ఈగుహ ముందు ఏమాత్రం?"

"అబ్బే, అదికాదు, నాతలమీద పైకప్పువిరుచుకు పడుతుందనికాదు. కాని, పెద్దనాన్నా ఇప్పుడేం చేద్దామని నీ ఉద్దేశ్యం? భూమిమీదకి వెళ్ళిపోదామా?"

"తిరిగి వెళ్ళటమా! ఎంతమాట! ఇంతదాకా వచ్చినతర్వాత ప్రయాణం సాగించటమే అనుకుంటున్నాను."

"కాని ఈనీటికిందకి దిగడం ఎట్లా?"

"అందులోకి దూకుదామనుకొనడంలేదు! భూగోళంమీదకూడా సముద్రాలు పెద్దసరస్సులే. చుట్టూ నేల ఉండకుండా ఉండదు. ఈసముద్రమూ అంతే అయిఉండాలి. అందులో చుట్టూ గోడ ఉన్నది కూడాను!"

"అనుమానం లేదు."

"అంతే! అవతలతీరం చేరుకుంటే కొత్త మార్గాలు దొరికి తీరుతాయి."

"ఈ సముద్రం వెడల్పు ఎంతఉంటుందనుకుంటున్నావ్?"

"నూరు, నూటఇరవై మైళ్ళుంటుందనుకుంటున్నాను."

"ఆ?" అన్నాను, ఈ అంచనా తప్పు అయి ఉంటుందని ఊహిస్తూ.

"అందుచేత కాలం వృధా చెయ్యరాదు. రేపే సముద్రయానం మొదలుపెట్టాలి."

అనాలోచితముగా మేము ప్రయాణంచేసే నావకోసం నాచుట్టూ కలయచూశాను.

"అలాగా," అన్నాను. సముద్రయానమన్నమాట. బావుంది! అయితే ఏనౌకమీద 'టిక్కెట్టు' కొనుక్కుందాం?

"నౌక కాదబ్బాయ్, మంచి, గట్టితెప్ప."

"తెప్ప!" అని అరిచాను "నౌకానిర్మాణ మెంత కష్టమో తెప్పనిర్మించసాడంకూడా అంత కష్టం! అసలు—"

"అసలు, ఆక్సెల్ నువ్వుకొంచెం జాగ్రత్తగా విని ఉంటే సరిపోయేది!!"

"వినటమా?"

"అవును. సుత్తి శబ్దము హాన్స్ అప్పుడే పని ప్రారంభించాడని తెలుపుతున్నది.

"తెప్ప కడుతున్నాడా?"

"అవును."

"ఏమిటి! చెట్లునరికి—"

"అదా! చెట్లు పడిపోయే ఉన్నాయి. వచ్చి పని ఎలా జరుగుతోందోచూడు."

'నౌకాశ్రయం'ఏర్పడటానికి కారణమయినఅగ్రం చుట్టూ నడిచి వెళ్ళేసరికి పావుగంట అయినది. హాన్స్ కనిపించాడు కొన్ని అంగలలో అతనిని చేరుకున్నాను. సగం కట్టినఒకతెప్ప ఇసుకమీద చూసి ఆశ్చర్యపడ్డాను. అది ఏపలకతో చేశాడో తెలుసుకొనలేకపోయాను. నేలమీద కావలసినంత కలప కనిపించింది. ఒక నౌకాదళం కట్టేందుకు సరిపోయేట్లు ఉన్నది.

"పెదనాన్నా," అని అరిచాను, ఇదేంరకం పలక?"

"ఉత్తర ప్రదేశాలలో దొరికే వృక్షవిశేషాల చెక్క. సముద్రంనీటిలో నాని ఖనిజాలతో నిండిపోయింది."

"అది సాధ్యమేనా!"

"దానినేఅయిస్‌లాండ్‌వారు 'సుర్టార్ బ్రాండర్' (Surtar brandr) అంటారు. ఇదొక 'ఫాసిల్ చెక్క'."

"అయితే లిగ్నైట్‌లాగ రాయంత గట్టిగా తయారయి నీటిమీదనే తేలేదే!"

"కొన్నెప్పుడంతే. కాని ఇది ఇంకా పూర్తిగా ఫాసిల్ అవలేదు. నువ్వేచూస్తావుగా," అని మాపెదనాన్న ఒకముక్క సముద్ర లోనికివిసిరాడు.

కొయ్యముక్క మొదట అదృశ్యమయినది కాని నీటిపైకివచ్చి అలలమీద ఎగిరిపడటం ప్రారంభించింది.

"ఇప్పటికయినా నమ్మకం కుదిరిందా?" అని అడిగాడు మా పెదనాన్న.

"నమ్మటానికి వీలులేకుండా ఉందని నమ్మకం కుదిరింది!"

మరుసటిదినం సాయంత్రానికి, మాగైడ్ నైపుణ్యం ధర్మమాఅని, తెప్పతయారయినది. పది అడుగులు నిడివి, అయిదు అడుగులు వెడల్పు ఉన్నది. 'సుర్టార్‌బ్రాండర్' దూలాలు త్రాటితో బిగించి కట్టటంచేత చదునుగానే ఉన్నది. నీటిలోకి మార్చిన తర్వాత లిడన్ బ్రోక్ సముద్రంపైన చక్కగా తేలినది.

(సశేషం)

# ఏడుకొండలు

23-వ పేజీ తరువాయి

గాని పరిశీలనాశక్తిని విపరీతంగా ఆకర్షించింది. ఇవన్నీ శ్యామ్‌బాబు ఎందుకు చెప్పాడో, కాంతారావుగారు గ్రహించారు. అసలు ఆయన చాలాకాలం నుండి ఇటువంటి వ్యక్తికోసం ఎదురు చూస్తున్నారు. అనేక రకాల వ్యాపారాలు చేసి చెయ్యి కాల్చుకోవడం వల్ల, వ్యాపార రీత్యా ధనమార్జించాలనే కోరిక ఆయనలో అదృశ్యమైంది. దాని స్థానే వీలైనంత సులభంగా, అతి త్వరితంగా ధనార్జన చెయ్యాలనే కోరిక ఆయనలో బలపడింది. రాగిని మూలికల ద్వారా, బంగారం చెయ్యొచ్చుననే విషయం, ప్రపంచంలో కొంతమంది నమ్మకపోయినా, అనేకమంది సాధువులు ఋజువు చేశారు. ఆవిధంగా చెయ్యడం చాలా కొద్దిమందికే తెలుసు. కొన్ని కొన్ని పుస్తకాలలో ఈ ప్రక్రియ విధానం రాసి ఉంది. అంతేకాక ఒక ప్రసిద్ధ వైద్య గ్రంథంలో ఒక మహనీయుడు ప్రముఖ నాయకుల ఎదుట పాదరసాన్ని తెప్పించి బంగారంగా మార్చాడన్న విషయం కాంతారావుగారు చదివారు. డబ్బు సంపాదనకు ఇంత సులభమైన పద్ధతి ఉండగా, అనవసరంగా శ్రమపడటం ఎందుకని ? కాంతారావుగారు తనని తాను ప్రశ్నించుకున్నారు. వేమన స్పష్టంగా ఈ విషయం చెప్పేశాడు. అతి ప్రయత్నం మీద, బంగారం చేసే విధానాన్ని వర్ణించే పుస్తకాల్ని కొన్నిటిని కాంతారావుగారు సేకరించారు. కాని ఆయా ప్రక్రియల్ని చెయ్యడానికి, ఆయనకు స్వయంగా తీరుబాటూ, ఓపికా లేవు. శ్యామ్‌బాబు నమ్మదగిన వ్యక్తిగా కన్పించబట్టి, ఆయన ద్వారా ఈ సాధనాల్ని ప్రయత్నించి చూడాలని కాంతారావుగారు నిర్ణయించారు.

ఈ విషయం ప్రస్తావిస్తూ కాంతారావుగారు "శ్యామ్‌బాబుగారూ! మన మహర్షులు ప్రపంచ ప్రయోజనం కోసం అనేక విషయాల్ని కని పెట్టారు. అందులో బంగారం తయారుచెయ్యడం ఒకటి. రాగినుండి గాని, పాదరసంనుండి గాని బంగారం చెయ్యవచ్చును. అందుకు నేను కొన్ని గ్రంథాలు సేకరించాను. అందులో చెప్పిన పద్ధతుల్ని అనుసరించి ప్రయత్నం చెయ్యాలని ఉంది. మీ ఉద్దేశ మేమిటి ?" అని అడిగారు.

"నాకు దాని గురించి ఎక్కువగా తెలియదు. కాని లోకంలో ఈ విద్య, సాధువులకూ మొదలైన వాళ్లకే గాని ఇతరులకు సిద్ధించదనీ, ఇది సిద్ధించినవారికి ప్రపంచంయందు విరక్తి పుడుతుందనీ అనుకుంటారు. దీనిని గురించి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. మీరు ప్రయత్నం చెయ్యదల్చుకుంటే చెయ్యండి" అన్నాడు శ్యామ్‌బాబు.

"సాధువులకే సిద్ధిస్తుందని అనటంలో నిజమేమీ లేదని నా అభిప్రాయం. మనలాంటి వారికి కూడా సిద్ధిస్తుందని నా నమ్మకం. గట్టిగా మనం ప్రయత్నంచేసి దీన్ని సాధించినట్లయితే, మనకి ఎంతో ప్రయోజనకారి అవడమే కాకుండా, మనం లోకానికి ఎంతో మేలు చెయ్యవచ్చు."

ఆయన అన్న ఆఖరి మాటలకు శ్యామ్‌బాబుకు నవ్వొచ్చింది. "లోకానికి మేలు చెయ్యడం అంటే మీ ఉద్దేశం ఏమిటి ?"

"అంటే మనం రాగిని బంగారం చేసేశామంటే మన దగ్గర ఎంతో బంగారం సమకూరుతుంది. దానితో మనం హాయిగాఉండడమే కాకుండా అనేకమంది బీదవాళ్లకు ధన సహాయం చేయచ్చు. ధనం మన దగ్గర వుండిమాత్రం ఏం చేస్తుంది?

"అయితే మీ రింతవరకు ఎంతమంది బీద వాళ్లకు సాయం చేశారు ?" అని శ్యామ్‌బాబు ఆయన్ని సూటిగా అడిగాడు.

"అబ్బే ! నేను ఎవ్వరికీ సాయం చెయ్యలేదండి. నా పరిస్థితులు బాగా ఉన్నప్పుడు, నా వద్దకు వచ్చేవాళ్లంతా వ్యాపారానికి సంబంధించిన వాళ్ళేగాని, బీదతనంతో బాధపడేవాళ్లెవరూ వచ్చేవారు కాదు. ఒకవేళ ఎవరైనా ఏదైనా అర్థించడానికి వచ్చినా, వాళ్ళు నా దృష్టిలో పట్టి మోసగాళ్ళు గాను, నా దగ్గర డబ్బు కాజెయ్యడానికి కల్లిబొల్లి కబుర్లు చెబుతున్నవారిలాగా కన్పించేవారు. కాని, నా పరిస్థితులు మారి, నేను చికాకులో పడగానే, నా కంటికి కన్పించేవారంతా ఏదో విధంగా ఆపదలలో ఉన్నవారే. వారి బాధ నాకు బాగా అర్థమౌతోంది. మునుపు ఎవరైనా 'అయ్యా, రెండు రోజుల బట్టి తిండి లేదు' అని మొరపెట్టుకుంటే వాడిమీద కోపం వచ్చి, "వెధవా, దున్నపోతులా ఉన్నావ్ ! పని చేసుకో రాదూ" అని కేకలేసేవాణ్ని. ఇప్పు డెవడైనా ఒక్కపూట భోజనం లేదని అంటే వాడి బాధంతా నా కళ్లముందర కట్టినట్లుగా కన్పిస్తుంది. ఒకళ్లా ! ఇద్దరా ! ఒక పూటా ! రెండు పూటలా ! ఎన్నాళ్లని. ఎంతమందికని సాయం చేస్తాం ? దేశంలో ఎంతోమంది అటువంటివాళ్లున్నారు. మన సమస్యలే మనకి అలవిగాకుండా ఉన్నాయి. ఇతరుల కేం ఉపకారం చేస్తాం ? అందుకని ఈ యోగం సిద్ధించిందంటే, నాకున్న అప్పంతా తీరిపోవడమే కాకుండా, ఇతరుల కెంతైనా మేలు చెయ్యొచ్చునని చూస్తున్నాను" అన్నారు కాంతారావుగారు.

శ్యామ్‌బాబు కొద్దిసేపు ఆలోచించాడు. కాంతారావుగారు తనకీ బంగారం తయారయ్యే యోగం సిద్ధిస్తే, ముందు తన అప్పులన్నీ తీర్చుకొని, తను సుఖంగా జీవితం గడుపుతూ ఇతరులకు సాయం చేస్తారట ! ఒకవేళ ఆయన సుఖంగా ఉన్న తరువాత మళ్లీ ఆయనవద్దకు మోసగాళ్ళూ, వ్యాపారస్థులూ చేరితే ? ఆయన అప్పుడు బీదవాళ్ల గురించి మర్చిపోవచ్చు. అహా ? జీవితం గురించి యదార్థంగా ఆలోచించేవాళ్లు ఎంతతక్కువమంది వుంటారీ ప్రపంచంలో ! కర్ణుడూ, శిబి, దధీచి మొదలైనవాళ్లు తమ శరీరాల్నికోసి అర్థులకు ఇచ్చారు. లోకంలో ఎంతోమంది తమకు పూర్తిగా కడుపునిండే భోజనం దొరకకుండా అవస్థ పడుతూనే, తమకున్నదానిలో కొంత ఇతరుల కివ్వడానికి ప్రయత్నించి పుణ్యాత్ములౌతున్నారు. ఉపకారం చెయ్యదల్చుకున్నవాడు, తనకు అధికమైన ధనం లభించేవరకూ ఎదురుచూస్తూ కూచుంటే, వాడేం ఉపకారం చెయ్యగలడు ? వీడికి అంత ధనం లభించే దెప్పుడు ? ఒకవేళ లభిస్తే వీడి మనఃప్రవృత్తి మారదని గారంటీ ఏమిటి ? ఇంతకీ వీడిలా అనుకోడంలో ఉద్దేశమేమంటే, తనకు లేకపోవడంవల్ల ఇతరులకు సాయం చెయ్యలేదుగాని, తనకే గనక బోలెడు డబ్బుంటే ఎంత ఉపకారం చేసేవాడో ! అని, మొత్తానికి ఎవరికైనా ఉపకారం చెయ్యకుండా తప్పించుకోవడం మాత్రమే. నిజంగా ఉపకారం చెయ్యదల్చుకున్నవాడు తనకు ఉన్నా లేకపోయినా కూడా చేస్తాడు.

కాంతారావుగారివైపు తిరిగి శ్యామ్‌బాబు, "ఒకరికి ఉపకారం చెయ్యడం కూడా అంత సామాన్యవిషయం కాదులెండి. అయినా ఒకరి సంగతి మన కెందుకు ? మన సంగతేదో మనం చూసుకుంటే ఇతరుల కుపకారం చేసినంత ఫలితం. ముందర మనని మనం బాగుచేసుకుంటే, అప్పుడు తక్కినవిషయాలాలోచించవచ్చు" అన్నాడు.

"అదేనండీ నా ఉద్దేశం కూడాను. నేను అనేక పురాతన గ్రంథాల్ని సంపాదించాను. అందులో మంచివి, రెండు యోగాలు దొరికాయి. వాటికి తగిన సామగ్రి అంతా నేను సప్లయి చేస్తాను. మీరు ఆ 'భస్మం' తయారుచేసి యిచ్చారంటే, మనం బంగారం చేసెయ్యొచ్చు."

"అంత సులభంగా తయారవుతుందండీ ?"

"ఓ ! ఆయా వస్తువుల్ని సంపాదించామంటే చాలు."

"అయితే ఇన్నాళ్లబట్టీ ఎందుకు ఊరుకున్నారు ? మీ రీ పని ఎన్నో సంవత్సరాలక్రిందే చెయ్యవలసింది."

"అబ్బే ! నాకు తగిన తీరికా, ఓపికా లేక అశ్రద్ధచేశాను" అన్నారు కాంతారావుగారు. శ్యామ్‌బాబు తనలో, పాపం ! బంగారం చెయ్యడానికి ఆయనకు తీరికా, ఓపికా లేవు ! అనుకున్నాడు.

"అంతే కాకుండా, తగిన నమ్మకమైనమనిషి దొరకలేదు. ఇప్పుడు మీరు అన్నివిధాలా తగిన

---

ఒక వేదాంతి చచ్చి స్వర్గం చేరాడు. కొంత కాలం తరువాత అతడి శిష్యుడు అతణ్ణి చూడటానికి వెళ్లాడు. గురువుగారి పక్కన ఒక అప్సరస కూర్చుని ఉండటం చూసి "తమ తపస్సు ఫలించింది!" అన్నాడు శిష్యుడు ఉండబట్టలేక.

"ఓరి వెర్రినాగన్నా! ఈమె నా దగ్గరకు వచ్చి తన శాపం అనుభవిస్తోందిరా" అన్నాడు గురువుగారు చిరునవ్వు నవ్వుతూ.

వి. రామయ్య (విజయవాడ)

---

గారులా కష్టించడంవలన మిమ్మల్ని ఇది చేసి పెట్టమని కోరుతున్నాను'' అన్నారు కాంతారావుగారు శ్యామ్‌బాబు తనలో 'ఈయనకు తను స్వయంగా చేసుకోవడానికి తీరికలేదు ఎవరైనా చేసిపెడితే అనుభవించడానికి మాత్రం ఆయన సిద్ధంగా ఉన్నారు తను స్వయంగా కష్టపడరు, కాని ఇతరుల కష్టాన్ని సులభంగా తమ కుపయోగించుకోవాలని చూస్తారు ఇటువంటి మనస్తత్వంగల వాళ్ళకు ఎవరు సాయంచేస్తారు? ఒకరిని తమ కోసం కష్టపడమని కోరడానికి ఆయనకు సంకోచం కూడా లేకపోయింది ఒక కాంతారావుగారిలోనే కాక, చాలామందిలో ఈ గుణం ఉంది ఇంకొకరి శ్రమ ఫలితాన్ని కోరడంలో తమకు ఎంతవరకూ న్యాయమైనహక్కు ఉందో వాళ్ళు ఆలోచించరు అవతలవాడు మంచితనంవల్లనో, మొహమాటంవల్లనో, చాతకానితనంవల్లనో ఈ శ్రమపడడం జరిగితే, ఫలితం తమకు అందిస్తే, వీరు నిస్సంశయంగా అనుభవిస్తారు ఇది జమీందారులలోని జీర్ణించిపోయిన తత్వం అందుకే ఈనాడు వారి జమీలన్నీ 'హూష్ కాకి' అయిపోయాయి ప్రతి దేశంలోను ఇటువంటివారు పుట్టుతున్నారు పుట్టారు కాబట్టే, ఫ్రెంచి రివల్యూషన్, రష్యన్ రివల్యూషన్ మొదలైనవి వచ్చాయి కాని ఎన్ని రివల్యూషన్‌లు వచ్చినా ఇలాంటి మనుషులు పుట్టుతూనే ఉన్నారు వాళ్ళకు గట్టి పాఠం చెప్తేనే కాని, వాళ్ళ తత్వం మారదు వీరివల్ల సంఘానికి ఒక రకంగా కాక, అనేక రకాలుగా, నష్టం కలుగుతోంది ఒకవిధంగా, అమాయకులూ, మంచివాళ్ళూ అయిన సామాన్యప్రజకు, కష్టానికి తగిన ఫలితం దొరకటంలేదు వీరి చుట్టూ మోసగాళ్ళూ, దుర్మార్గులు చేరి వీరిని పెడమార్గాలు పట్టించడంవల్ల వారికే సంఘంలో గౌరవం లభిస్తోంది వారిని నమ్మి, వారి మాటలకు మోసపోయి ఈ జమీందారీ మనుషులు తమ ఆస్తులు పాడుచేసుకుంటున్నారు చివరికి అతినీతి ప్రబలిపోతోంది లంచగొండితనం, మోసం అనేవి విచ్చలవిడిగా వీరవిహారం చేస్తున్నాయి వీటన్నిటికి మూలం ఈ 'జూదపు మనస్తత్వం' (Gambling Tendency) ఒకరి శ్రమయొక్క ఫలితాన్ని, మనం శ్రమపడకుండా, అనుభవించాలి—అనే జాడ్యం ఇది నశించాలి దీన్ని నశింపజెయ్యటానికే గాంధీజీ 'బేసిక్ ట్రైనింగ్', 'ప్రతి వ్యక్తీ చరఖామీద నూలు వడికి ఖద్దరు ధరించాలి', అనే సూత్రాల్ని ఏర్పరచారు అవి మరచిననాడు జాతిలో నీతిసంపదే పోతుంది'' అని ఆలోచించాడు అయితే ఇవి సూటిగా చెప్తే కాంతారావుగారి మనసు కెక్కవు ఆ విషయాలన్నీ సమయం వచ్చినప్పుడు ఆయనకు చెప్పాలి అని శ్యామ్‌బాబు నిశ్చయించుకొన్నాడు

"ఈ ప్రక్రియల్ని ఎవరైనా వైద్యంచేసే వాళ్ళు చేస్తే సరిగా జరుగుతుందని నా ఉద్దేశం'' అన్నాడు శ్యామ్‌బాబు ఆలోచిస్తూ

కాంతారావుగారికి, శ్యామ్‌బాబు ఆమాత్రం ప్రోత్సాహకరంగా మాట్లాడటం చాలా సంతోషం కల్గించింది ఆయన ఆత్రుతతో "మీకు తెలిసిన అలాంటి వ్యక్తి ఎవరైనా ఉన్నాడా?'' అని అడిగాడు.

# ఏడు కొండలు

"ఈ ఊళ్లో మిశ్ర అని ఒక యునానీ డాక్టరున్నాడు అతనికి భస్మాలూ మొదలైనవి తయారు చెయ్యటంలో చాలా అనుభవం ఉంది అతన్ని ఈపనికి నియోగిస్తే సక్రమంగా చెయ్యగలడనుకుంటాను'' అన్నాడు శ్యామ్‌బాబు

ఇన్నాళ్లబట్టి తను అనుకుంటున్న పని, నెరవేరబోతోందని కాంతారావుగారికి ఎంతో సంతోషం వేసింది ఆయన "అయితే, ఆ మిశ్రను మీరు వెంటనే పిల్చుకురండి ఈ సంగతంతా చెబుదాం'' అన్నారు శ్యామ్‌బాబు, ఆ సాయంకాలమే తను మిశ్రను తీసుకువస్తాననీ, కాంతారావుగార్ని, అన్నీ సిద్ధంచేసి ఉంచవలసిందనీ చెప్పారు ఆలశ్యంకాకుండా తను ఈ విషయంలో ఎక్కువ జోక్యం కలుగజేసుకోననీ, మిశ్రను తీసుకువచ్చి అప్పజెప్పే వరకే తన బాధ్యత అనీ, తరువాత పని అంతా మిశ్ర



"హాస్యాన్ని అర్థం చేసుకునే శక్తి ఆడవాళ్ళకు బొత్తిగా లేకపోవడానికి కారణ మేమిటంటారు?" ఒక పెద్ద మనిషి పేరు పడ్డ సినిమా తారను అడిగాడు.

"స్త్రీలు మగవారిని ప్రేమించడానికి పుట్టారు కాని, వారిని అపహసించడానికి కాదు!" చిరునవ్వు చిందిస్తూ సమాధానం చెప్పింది.

సి కన్నయ్య (మద్రాసు.)

చేత చేయించుకునే బాధ్యత కాంతారావుగారిదే ననీ, శ్యామ్‌బాబు కాంతారావుగారికి స్పష్టంగా చెప్పేశాడు ఈలాటి విషయాలు జరుగుతాయంటే తను నమ్మననీ, అసలు బంగారం అవుతుందంటే తను ఒప్పుకోననీ, మిశ్రకు అటువంటి నమ్మకాలుండడంవల్ల, అలాంటి భస్మాలు తయారు చెయ్యడం అతనికి బాగా అలవాటవడంవల్లా, అతనే సరైన వ్యక్తన్నారు కాంతారావుగారు తను వెంటనే మనిషిని పొరుగూరికి పంపించి అందుకు కావలసిన వస్తువులన్నీ తెప్పిస్తాననీ, సాయంకాలం మిశ్రా వచ్చేటప్పటికి అన్నీ సిద్ధంగా ఉంచుతానని అన్నారు

ఆ సాయంకాలం శ్యామ్‌బాబు మిశ్ర యింటికి వెళ్లేటప్పటికి, మిశ్రగారు చాలా ఆనందంగా కన్పించారు

"రండి రండి, శ్యామ్‌బాబుగారూ! మీరు సరైన సమయానికి వచ్చారు మీకొక మంచి శుభవార్త చెప్పాలని మీకోసం ఎదురుచూస్తున్నాను'' అన్నారు, మిశ్రగారు

"ఏమిటది?'' అని శ్యామ్‌బాబు నవ్వుతూ అడిగారు వంటింటి గుమ్మంవద్ద నిల్చుని ఉన్న నారాయణి, కొద్దిగా సిగ్గుతో తల వంచుకొనిఉండడంగమనిస్తూ, కుర్చీలో కూర్చుంటూ

"నేనూ, నారాయణీ—అంటే, నారాయణి నన్ను—అనగా నారాయణి, నేను కూడా అనుకోండి—సరిగా చెప్పాలంటే నారాయణే ముఖ్యకారణం అనుకోండి అయినా నాకూ మొదటినుంచి మనసులో ఉందనుకోండి అయినా దమ్ములు చాలలేదు ఎన్నోసార్లు ప్రయత్నించాను, గట్టిగా అడిగేద్దామని ఊహూ! లాభం లేకపోయింది చివరికి మొన్ననే తెలిసింది—అసలు ఎన్నాళ్లబట్టో నారాయణి నన్ను ప్రేమిస్తోందని ''

"ఏమండోయ్! డాక్టరుగారూ! తప్పంతా నామీదికి తోసెయ్యాలని చూస్తున్నారా? నేనేం తమర్ని, ప్రేమించలా ఇంతోటి తాగుబోతూ నాకు దొరకడనీ, మిమ్మల్నే ప్రేమించాలి! హయ్యో! రాత!'' అంది మూతి, చేతులూ తిప్పుతూ నారాయణి

"ఏం? నేనేం తినిపోయాను తాగుడు మానేసి ఎన్నాళ్లయింది? చెప్పు! ఇంక—నువ్వు ప్రేమించకపోతే 'ఆ మాట' ఎందుకన్నావో చెప్పు ఇదిగో, ఈ పెద్దమనిషినే అడుగుదాం ఏమండీ, శ్యామ్‌బాబుగారూ! ఒక ఆడది మిమ్మల్ని చూసి ''

"నన్ను చూసా?'' అని అడిగాడు శ్యామ్ బాబు.

"మిమ్మల్ని కాదనుకోండి, నన్నుచూసి—''

"ఛీ! ఛీ! ఏం, మనిషి? గట్టుమట్టూ లేకుండా అన్నిమాటలూ మూడోమనిషిదగ్గర అనడానికి సిగ్గైనాలేదు'' అంది నారాయణి

"ఆ! అలా దారిలోకి రా! ఇప్పుడైనా ఒప్పుకుంటావా నన్ను ప్రేమించాననీ?'' అన్నాడు డాక్టరు మిశ్రగారు

నారాయణే, "చాల్లెండి, మీ పరాచికాలు" అంటూ లోపలికి వెళ్ళిపోయింది శ్యామ్‌బాబు, "ఇంతకీ సంగతేమిటి?'' అని అడిగాడు డాక్టర్ని. డాక్టరు, నారాయణి వెళ్లినవైపు చూస్తున్నవాడల్లా నవ్వుతూ శ్యామ్‌బాబు వైపు తిరిగి 'పెళ్లి' అన్నాడు

"ఎవరికి? మీకూ, నారాయణికీనా?"

"అవును"

"ఎప్పుడు?"

"రేపు, నారాయణి బయల్దేరి వాళ్ల వూరు వెళ్తుంది తిరిగి పదిరోజులలో వచ్చేస్తుంది. రాగానే, మా యిద్దరికీ పెళ్లి శ్యామ్‌బాబూ! మీరు దగ్గరుండి మా పెళ్లి జరిపించాలి'' అన్నాడు డాక్టరు మిశ్ర

"ఓ! తప్పకుండా అలాగే జరిపిస్తా అన్నట్టు డాక్టర్ బాబూ, నువ్వెప్పుడైనా బంగారం తయారు చేశావా?''

"లేదు శ్యామ్‌బాబూ! కాని బంగారం ఎలా తయారుచెయ్యాలో నాకు కొంత తెలుసు. కొన్నాళ్ళు ఆ ప్రయత్నాలలో నేను తిరిగినమాట

శాస్త్రవమే కాని చివరికి బంగారం చెయ్యడం నాకు సాధ్యంకాదని విరమించుకొన్నాను ''

"నువ్వు చేసిన ప్రయత్నం ఎంతవరకూ ఫలించింది ?''

"రాగికి బంగారపువన్నె తేవడం సులభమే కాని బరువు రావడం కష్టం బరువు వస్తే, వన్నె రాదు రస ప్రక్రియలు, గ్రంథాలలో చాలా ఉన్నాయి అవి చేస్తేమట్టుకు ఇలాటి అవకతవకలే వస్తాయి అందులో ఉన్న రహస్య మేమిటో స్వయంగా తెలిసినవాడు చెప్తేగాని తెలియదు పాదరసాన్ని గట్టిపడేట్టు చేస్తేనేగాని ఈ ప్రక్రియ జరగదు అసలు అది పాపమనీ, సంసారులు చెయ్యకూడదనీ అంటారు అదొక పిచ్చలాంటిది అందులో దిగినవాడు, ఆ ఆశలో పడి సర్వనాశనం అయిపోతాడు మీకు దానితో అవసర మేమొచ్చింది ?''

శ్యామ్‌బాబు, డాక్టరుకి కాంతారావుగారి సంగతంతా చెప్పి, ఆయనదగ్గర ఏవో సాధన రహస్యా లున్నాయనీ, వాటిప్రకారం, బంగారం చేసే భస్మాన్ని తయారుచేసే మనిషి కావాలన్నారనీ తమ మిశ్రగురించి చెప్పాననీ చెప్పారు

మిశ్రగారు, ఇదంత విని చిరునవ్వు నవ్వారు "అయితే జమీందారుగారి కీపిచ్చి బాగా పట్టుకుందన్నమాట పైగా మనం చేసిపెట్తే ఆయన దా న్ననుభవిస్తారా ! బాగుంది ఇటువంటి పిచ్చపనులు చేస్తే దానికి ఎంత పరిహారం చెల్లించుకోవలసివస్తుందో ఆయనకేమన్నా తెలుసా ?'' అన్నారు

"ఆయన జీవితమంతా ఇటువంటి పిచ్చపనులు చెయ్యడంతోటే గడిచింది ఇది బహుశా ఆఖరిది అవుతుందని నేను అనుకుంటున్నాను దీనితో ఆయనకు పూర్తిగా బుద్ధిరావాలని నా కోరిక అందుకే నిన్ను ఇందులో ప్రవేశపెట్తున్నాను ''

"సరే అయితే ! కాంతారావుగారికి బంగారం విలువ ఏమిటో పూర్తిగా తెలియజేస్తాను పదండి'' అన్నాడు మిశ్రగారు

నారాయణ ఇచ్చిన టీ త్రాగి, ఇద్దరూ కాంతారావుగారింటికి బయల్దేరారు వీరు వెళ్లేసరికి కాంతారావుగారు, కొన్ని మూలికలూ, ఇతర రసాయనికద్రవ్యాలూ, కల్వమూ, పుఠం పెట్టడానికి పిడకలతో సహా అన్నీ సిద్ధంగా ఉంచారు మిశ్రగారు తను పుస్తకాలలోంచి రాసుకున్న, ప్రక్రియావిధానాన్ని చదివి వినిపించారు మిశ్రగారు అదంతా విని, ఆ విధానంలో అన్ని వస్తువులూ రాశాడుగాని, ఒక మూలిక మాత్రం రాయలేదని చెప్పారు ఆయన అమాత్రం విజ్ఞానాన్ని ప్రదర్శించేసరికి కాంతరావుగారు ఆశ్చర్యపోయి "మీకు బంగారం చెయ్యటం ఇదివరకే తెలుసా ?'' అని అడిగారు

దానికి మిశ్రగారు, "అయ్యా ! ఆ విషయం పరమరహస్యం అయినా మీలాంటి గొప్పవాళ్ల ముందు దాచబుద్ధికావటంలేదు అందులో ముఖ్యంగా మీ దయార్ద్రహృదయంగురించి విన్నదగ్గర్నుంచి నాకు మీరంటే ఒక ప్రత్యేకమైన గౌరవ మేర్పడింది అసలు నాకు బంగారం చెయ్యటం మా గురువుగారు నేర్పారు కాని అది నా స్వంతంకోసం ఉపయోగించటానికి మాత్రం గురువాజ్ఞలేదు తయారుచేసిన భస్మాన్ని ఒక పావు తులం కూడా చెయ్యడానికి, నా స్వంత చేతుల్తో వాడకూడదు నా స్వంతానికి ఉపయోగించకూడదు అందువల్ల, నేను తయారు చేసుకోలేదు'' అన్నారు

మిశ్రగారి మాట వింటూ కాంతారావుగారు పరమానందంలో మునిగిపోతూ, "నేను చాలా అదృష్టవంతుణ్ణి ! నిజంగా మీరు తటస్థపడడం నా భాగ్యం ఈ వస్తువులనుబట్టి సుమారు ఎంత భస్మం తయారవుతుందో, సుమారు దానితో ఎంత బంగారం తయారుచెయ్యవచ్చునో చెబుతారా ?'' అని అడిగారు

కొద్దిసేపు ఆలోచించినతరువాత మిశ్రగారు "సుమారు ఇరవై తులాల భస్మం తయారవుతుంది ఒక తులం భస్మం నూరు తులాల బంగారాన్ని చేస్తుంది అంటే మొత్తం రెండువేల తులాల బంగారం తయారవుతుంది'' అన్నారు

శ్యామ్‌బాబు తనకి కొంత పనుందనీ, వెంటనే వెళ్లాలనీ చెప్పాడు ఆయన వెళ్లిపోయిన తరువాత మిశ్రగారు కాంతారావుగారితో "అయ్యా ! భస్మం



విద్యావేత్తల సమావేశానికి హాజరైన ఒక ఉపాధ్యాయుడు హఠాత్తుగా వేదికమీదకు వచ్చి "ఉపాధ్యాయులు వర్ధిల్లాలి" అని చెవులు చిల్లుపడేట్లు పొలికేక పెట్టాడు.

"ఏమి తిని?" వెంటనే ఆచివరి నుంచి మరొక కేక వినిపించింది.

జి. సాంబిరెడ్డి (నిడదవోలు).



చేసి నే నిచ్చేస్తాను దాని ఫలితం అనుభవించేవాళ్లు మీరు నాకు దానితో ఏమీ సంబంధం లేదు నాకు ముట్టేదల్లా కూలి మాత్రమే తులం భస్మం చెయ్యడానికి వెయ్యి రూపాయలు పుచ్చుకుంటాను'' అన్నారు

"అబ్బ ! మిశ్రగారూ మీ మేలు ఈ జన్మలో తీర్చుకోలేను మీరు వెంటనే ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా తయారుచెయ్యండి'' అంటూ, సంతోషంతో మిశ్రగారిచేతుల్ని పట్టుకుని ప్రతిమాలడం మొదలెట్టారు కాంతారావుగారు

"అలాగే, కాని మీతో చిన్న రహస్యం మాట్లాడాలి'' అని మిశ్రగారు అన్నారు, కాంతారావుగారితో

అంతవరకూ ఆ విషయం ఆలోచించని కాంతారావుగారు, ఆశ్చర్యపోయారు "ఏమిటీ ? తులానికి వెయ్యి రూపాయలా ? అంటే మొత్తం ఇరవై తులాలకీ, యిరవైవే లన్నమాట !'' అన్నారు

"అవునండి అదికూడా, రెడీకాష్ ముందు మీరు నా కివ్వాలి ''

"ఇరవైవేలునేనుఇప్పు డెక్కడనుంచితేగలను ?''

"పోనిండి ఇప్పుడు తొందరేమీ లేదు నేను ఈ ఊళ్లోనే ఉంటాను మీకు సొమ్ము సమకూరినతరువాత ఇగ్గరుగావి, అప్పుడే భస్మం చేసి ఇస్తాను ''

"అహ! హా! నా కిప్పుడు అర్జంటుగా అది తయారుకావాలి పోనీ ముందు కొద్దిగా, అంటే పదితులాలు తయారుచేసి ఇవ్వండి ''

"అలాగే, రేపు రాత్రి పదకొండుగంటలకి మా యింటికి రండి భస్మంచేసి సిద్ధంగా ఉంచుతాను వచ్చేటప్పుడు పదివేలు రూపాయలు తీసుకురండి'' అని మిశ్రగారు, వస్తువులన్నీ సంచిలో వేసుకొని, వెళ్లిపోవడానికి ఉద్యుక్తులయ్యారు

కాంతారావుగారు, మర్నాటి రాత్రిలోపల పదివేల రూపాయలు ఎలా సమకూర్చడమా ? అని ఆలోచిస్తూ, "సరే" అన్నారు మిశ్రగారు వెళ్లిపోయినతరువాత కాంతారావుగారు, తన చేతులో బంగారం తయారుచేసే భస్మం పడబోతోంది గదా, ఎంతో సంతోషా న్ననుభవిస్తూ, ఆ బంగారమంత ఏం చెయ్యాలా ? అని ఆలోచించసాగారు. ముందర దానితో అప్పులు తీరుద్దామని అనుకొన్నారు, గాని, తరువాత అప్పులు అంత ముఖ్యవిషయం కాదనీ, మళ్లీ ఏదైనా మంచి బిజినెస్సు చెయ్యాలని నిశ్చయించారు అయినా బిజినెస్ చెయ్యవలసిన అవసర మేముంది ? తులానికి వెయ్యిరూపాయలు కూలి పారేస్తే సరి నూరు తులాల బంగారం, అంటే పదివేల పైచిలుకు ఖరీదుగలది వస్తుంది మొదట ఒక పదివేలు పారేస్తే, లక్ష పైచిలుకు విలువగల బంగారం వస్తోందిగదా! మళ్లీ అందులోదే కొంత పారేసి మరో ఇరవై తులాలు చేయించచ్చు "అలా క్రమక్రమంగా హెచ్చించాలి ఈ దెబ్బతో తనొక కోటీశ్వరుడైపోవచ్చునని తోచింది, ఆయనకు

కొంతసేపు ఈ ఆనందా న్ననుభవించాక, డాక్టరు మిశ్ర కోరిన పదివేలూ మర్నాటి రాత్రి లోపల ఎలా సంపాదించాలా ? అన్న ఆలోచన పట్టుకుంది ఆయనకు ఏమైనా సరే, వెంటనే పదివేలు సంపాదించాలి ఇంతవరకు ఆయన, తన పరపతి నాధారంగా చేసుకుని అప్పు పుట్టించుకు వచ్చాడు. తనకు ఉన్న ఆస్తి మిల్లూ, రెండిళ్లూ, కొద్ది పొలమూను కాంతారావుగారు, మిల్లు తనఖా పెట్టయినా అప్పుచెయ్యడానికి నిశ్చయించుకున్నారు ఆనాళ సాయంకాలందాకా ప్రయత్నం చెయ్యగా, ఆస్తంతా తాకట్టు పెట్టెయ్యగా, ఎలాగో అతి కష్టంమీద పదివేల రూపాయలూ సంపాదించగలిగాడు అప్పటినుంచి రాత్రి పది గంటలు ఎప్పుడవుతుందా ? అని ఎదురు చూస్తూ కూచున్నారు ఆయనకు ఆ ఆత్రుతలో భోజనంకూడా ఎయించలా ఆ యన కళ్ల ముందు బంగారపు ముద్దలూ, ఇటికలూ, గొలుసులూ, ఆభరణాలు, మిణుగుతున్నాయి పచ్చగా మెరిసిపోతోన్న బంగారం ! ఎక్కడచూసినా అదే ! తనకు డబ్బవసరమైతే, ఇట్టే వెళ్లి బంగారా న్నమ్మి తీసుకొస్తారు ఇవనుంచి ఇంట్లో వన్నీ బంగారపుకంచాలే, బంగారపు గ్లాసులే. ప్రత్యేకంగా ఇద్దరు, ముగ్గురు కంసాలివాళ్లని ఇంట్లో పుంచుకొని అన్నీ తయారుచేయించాలి తన గదిలో బంగారపు వస్తువతప్ప మరేమీ ఉండ

కూడదు మళ్ళీ, తాతలనాటి జమీందారీ హోదా రావాలి! తను అదృష్టవంతుడు గాబట్టి, తల్చుకున్న వెంటనే అన్నీ జరిగిపోతున్నాయి

నౌకరు, పాలు గ్లాసుతో తీసుకొచ్చి ఇచ్చాడు ఆ గ్లాసు వెండిది దాన్ని చూడగానే ఆయనకు చిరాకేసింది వెధవ, వెండి! బంగారానికున్న దర్జా దానికేది? తనింట్లో వెండి సామానూ, ఇత్తడిసామానూ, కంచుసామాను ఉండటం తనకు చాలా నామర్దా! వెంటనే అవన్నీ పారేసి బంగారంవి చేయించేయ్యాలి!

గడియారం పదకొండుగంటలు కొట్టింది

కోటుజేబులో డబ్బు పెట్టుకుని, జమీందారు కాంతారావుగారు, ఆతృతతో ఊగిపోతూ, మిశ్ర యింటికి బయల్దేరారు ఆయన సాయంకాలమే నౌకరుద్వారా మిశ్రగారి యిల్లు ఎక్కడ ఉందో తెలుసుకున్నారు రాత్రి బయట చీకటిగా ఉన్నా, ఒంటరిగా, లైటైనా లేకుండా బయల్దేరారు ఇది పరమరహస్యమైన విషయం! రెండోకంటివాడికి తెలియకూడదు బయటకు ఈ విషయం పొక్కిందంటే, ప్రతివాళ్ళూ, మిశ్రను బంగారం చేసిపెట్టమంటారు! అసలు మిశ్ర ఈ భస్మాన్ని చెయ్యగలడని తెలుస్తే ఈపాటికి ఎంతోమంది అతనివెనకాల పడేవారు అయితే కూలి మాటో? అందరూ అంత డబ్బు ఇవ్వగలరా? పైగా ఏబుజువూ ఆధారం లేకుండా, మిశ్రమాటను నమ్మి ఇవ్వాలి! అదే ఇందులో ఉన్న కిటుకు! దానికి ఎవ్వడూ సిద్ధపడడు ప్రమాదంలేని పనికి ప్రతివాడూ సిద్ధమే ప్రమాదకరమైన పని చెయ్యడానికే ధైర్యం కావాలి అందుకు తెగించిన వాడినే విజయలక్ష్మి వరిస్తుంది (కాంతారావుగారు, జేబులోని నోట్లకట్ట నొకసారి తడిమి చూసుకున్నాడు) తనలో ఉన్న ప్రత్యేక గుణమే అది ఇన్నాళ్ళూ తన రోజులు కలిసిరాక, చేసిన ప్రయత్నాలు ఫలించలేదు ఇప్పుడు అదృష్టం తనని పిల్చి వరిస్తోంది! అందుకే, దేనికైనా కాలం సమకూడాలంటారు కాంతారావుగారి ఆలోచనలన్నీ, మిశ్రగారియిల్లు సమీపించగానే ఆగిపోయాయి ఆ యింటి తలుపులు మూసి ఉన్నాయి కాంతారావుగారు తలుపు తట్టారు మిశ్ర వచ్చి తలుపు తీశాడు కాంతారావుగారిని చూసి, లోపలికి రమ్మని పిలిచాడు

కాంతారావుగారు లోపలికి వెళ్ళారు లోపల గదిలో, ఒక కుంపటి, కణకణ లాడుతున్న బొగ్గులతో ఉంది, దానిప్రక్కన ఒక చిన్న మట్టి కుండ ఉంది ఒకమూల కాలిపోయిన పిడకలున్నాయి కల్వంలో ఏదో రసం ఉంది గది నిండా చిందరవందరగా, చిన్నచిన్న గిన్నెలూ, సీసాలూ, గరిటెలు మొదలైన సామాను అనేకం పడివున్నాయి

డాక్టరు మిశ్ర ఒక గాజుసీసా తీసాడు 'ఇది చూశారా? ఇందులో సరిగ్గా పదితులాల భస్మం ఉంది దీన్ని తయారుచెయ్యడం పూర్తయ్యి ఒక అరగంటయింది దానికి ఇంతసేపూ పూజ చేశాను ఇప్పుడు దీని మహత్యం పరిశీలించాలి'' అని తన చేతిలో ఉన్న సీసాను కాంతారావుగారికి చూపించాడు

అది అందుకుందామని కాంతారావుగారు చెయ్యి



చాచారు కాని మిశ్ర, "అబ్బెబ్బె! ఇది మీరు తాకవద్దు నేను ప్రొద్దుటినుంచి, పచ్చి మంచి నీళ్ళయినా త్రాగకుండా దీక్షలో ఉన్నాను ముందర దీన్ని పరిశీలించనివ్వండి, తరువాత మీరు దీనిని ఎలా తీసుకువెళ్ళాలో చెబుతాను" అని వారించి, "జై! సద్గురు మహరాజ్!" అని ఒక్క కేక వేసి, కళ్ళు మూసి, ఆ సీసాను చేతితో ఎత్తి పట్టుకుని ఏదో ధ్యానంచేశారు మిశ్రగారి వేషంకూడా ఆయన మాటల కనుగుణంగానే ఉంది ఆయన, తలకు ఒకగుడ్డ, ఎర్రది, కట్టారు సిల్కు లుంగీ, సిల్కు లాల్చీ వేసుకున్నారు. నుదుట విభూతీ, కుంకంబొట్టూ పెట్టారు ఆయునను చూస్తున్నకొద్దీ కాంతారావుగారి ఆనందం, ఆత్రుతా హెచ్చనారంభించింది కాంతారావుగారు, తనుకూడా లక్ష్మీ స్తోత్రం చదవడం మొదలెట్టారు ఆయనకు ఆ నిముషంలో భక్తిశ్రద్ధలు విపరీతంగా పుట్టాయి

"మీ దగ్గర ఏదైనా రాగికానీ ఉందా?" అని మిశ్రగా రడిగారు

---

రుక్మిణమ్మగారు తన భర్తకు రాజకీయరంగంలో ఎంత పలుకుబడిఉన్నదో ప్రక్కింటి పిన్నిగారికి చెబుతోంది. "మా వారు రెండు ఎన్నికల్లో ఓటు చేశారు. రెండుసార్లూ ఆయన ఓటుచేసిన అభ్యర్థే శాసనసభ్యుడుగా ఎన్నికయ్యారు..." అన్నదామె హుందాగా.

పి ఎల్ భాస్కర్ (మద్రాసు)

---

కాంతారావుగారి వద్ద కానీ లేదు మిశ్రగారే ఇల్లంతా వెతికి నాలుగు కాన్లు పట్టుకొచ్చారు. అందులో కల్తీలేని పాత రాగికానీ ఒకటి తీసి కాంతారావుగారికి చూపించారు దానిమీద ఎద్దు బొమ్మ ఉంది మిశ్రగారు, ఆ కానీని, కుంపట్లో ఎర్రటి నిప్పుల్లో "జై! సద్గురు మహరాజ్!" అంటూ పడేసి, బాగా కాలనిచ్చారు కాంతారావుగారు చూస్తుండగా, గాజుసీసాలోంచి, చాలా కొంచెం భస్మం, ఒక చిన్న పుల్లతో తీసివేశారు.

మిశ్రగారు కుంపటి బాగా విసిరారు బొగ్గుల మధ్య ఎర్రగా కాలిన కానీ పచ్చగా మారుతున్నట్టు కనిపించింది చేతితో పట్టకారు పట్టుకొని, బొగ్గుల్ని ఒకసారి ఇటూ, అటూ కదిపి, మళ్ళీ విసనకర్రతో గట్టిగా విసిరారు ఈసారి పసుపుపచ్చటి బంగారపు కానీ స్పష్టంగా కన్పించసాగింది. దానిని పట్టకారుతో పైకి తీసి లైటు వెల్తురులో పరీక్షించసాగారు కాంతారావుగారు ఆతృత పట్టలేక, "అయిందా? బంగారం అయిందా?" అని అడగ నారంభించారు మిశ్రగారు గీటురాయి తీసి, బంగారపు కానీతో గీటు గీశారు, ఆ మెరుస్తున్న గీటును చూసి తల ఊచి, ఆ కానీని కాంతారావుగారి చేతికిచ్చి పరీక్ష చేసుకోమన్నారు

"ఆ! బంగారమే? నిజంగా? నిజంగా?" అంటూ కాంతారావుగారు గీటు పరీక్షించి చూశారు నిస్సందేహంగా అది బంగారమే. 'యాసిడ్ టెస్టు' కూడా చేసారు అన్ని పరీక్షలకు నిలబడింది, ఆ బంగారపు 'కానీ'

కాంతారావుగారి సంతోషానికి అవధులు లేవు ఆయనకు మాటకూడా, ఆనందాతిరేకంచేత సరిగా రావటంలేదు ఇక వెంటనే తనచేతిలో ఆ 'భస్మపు' సీసా పడడమే తరువాయి "మరి . మరి—ఆ సీసా—ఇస్తారా?"అని అడిగారుమిశ్రను

మిశ్రగారు తల ఊపి, ఒక చేత్తో సీసాను పట్టుకుని, ఇంకొకచేతిని జాపి, "నే నడిగింది తెచ్చారా?" అని అడిగారు కాంతారావుగారికి, ముందర ఆయన ఏమడుగుతున్నదీ అర్థంకాలేదు. ఆయన ఆ సంతోషసంరంభంలో డబ్బు విషయం మర్చిపోయారు మళ్ళీ వెంటనే జ్ఞాపకమొచ్చి "ఆ! ఆ! ఇదిగో" అంటూ జేబులోని నోట్లకట్ట తీసి మిశ్రగారికిచ్చారు మిశ్రగారు, భస్మపు సీసా ఆయన కిచ్చేశారు కాంతారావు దాని నతి భద్రంగా తీసుకొన్నారు ఆయన వెంటనే ఇంటికి బయల్దేరారు మిశ్రగారు, కాంతారావుగారితో "మీరు ఇంటికి వెళ్ళగానే, స్నానంచేసి, శుచిగా, ఆ సీసాకి పూజచేసి, తరువాత దాని నుపయోగించండి" అని చెప్పారు "అలాగే అలాగే" అంటూ కాంతారావుగారు, పెద్దపెద్ద అంగలేసుకుంటూ, ఇంటి మొహం పట్టారు

మనిషికి కలిగే ఆనందం, చాలావరకూ, ఇతరుల కెవ్వరికీ లభించని వస్తువ తనకు లభించినప్పుడే కలుగుతుంది ఆనిముషంలో కాంతారావుగారు తానొక కుబేరుడి నయ్యానని భావించుకున్నారు. ఇతరుల కత్యంత దుర్లభమైనది, తనకు అతి సులభంగా అప్రయత్నంగా లభించింది దీనితో ఆయన ప్రపంచాన్నంతా జయించినంత సంతోషం పొందారు

మర్నాడు ప్రొద్దున్న శ్యామ్‌బాబు, ఎనిమిది గంటలకు కాంతారావుగారు పిలవడంవల్ల ఆయన ఇంటికి వెళ్ళారు

శ్యామ్‌బాబును చూస్తూనే కాంతారావుగారు ఏడుపుమొఖంతో, "శ్యామ్‌బాబూ! నా కొంప మునిగింది" అన్నారు ఆయన కండ్లవెంట నీళ్ళు కారుతున్నాయి శ్యామ్‌బాబు ఖంగారుపడి "ఏం? ఏం? ఏం జరిగింది?" అని అడిగారు

"తెలివితక్కువవల్ల మోసపోయాను ఆ మిశ్ర ఇంత మోసగాడని అనుకోలేదు పదివేల రూపాయలు కాజేసి పరారీ అయిపోయాడు నన్ను నట్టేట్లో ముంచేశాడు" అన్నారు కాంతారావుగారు శ్యామ్‌బాబు, అస లేమిటి జరిగిందో చెప్పమని గట్టిగా అడిగాక, మిశ్ర తనను భస్మం తయారుచెయ్యటంకోసం పదివేలు అడిగాడనీ, ఆ భస్మంతో తన కళ్ళముందర రాగికానీని బంగారపుకానీని చేశాడనీ, అది చూసి తను మిశ్రను నమ్మి పదివేలూ ఇచ్చేశాననీ, ఆ భస్మం తీసుకుని తను ఇంటికి వచ్చాననీ చెప్పి, కాంతారావుగారు "ఇంటికి వచ్చి చూస్తే ఆ భస్మం ఎందుకూ పనికిరాదని తేలింది." అన్నారు.

'వెంటనే మిత్రకు కబురు పంపలేక పోయారా?'

"పంపాను, శ్యామ్‌బాబూ ఆ దుర్మార్గుడు అప్పుడే చల్లగా ఈ ఊరు మంచి జారుకున్నాడు వాడు ముందునించే సిద్ధపడి ఉన్నాడు ఇంత దుర్మార్గం ఉంటుందని నేను ఊహించనైనా వూహించలేదు పోలీసురిపోర్టు చేసినా, వాడు దొరుకుతాడని నమ్మకంలేదు" అని కాంతారావుగారు ఎంతో బాధపడనారంభించాడు

శ్యామ్‌బాబు కొద్దిసేపు కాంతారావుగారి వైపు చూశాడు ముందు ఆయన తనని కూడా నమ్మకుండా, తనతో చెప్పనైనా చెప్పకుండా, మిత్రతో ఈవిధమైన ఏర్పాటు చేసుకున్నారని కోపం వచ్చింది, కాని, ఆయనయొక్క అత్యంత క్లిష్టమైన పరిస్థితుల్లో ఈయన ఈ పదివేలు పోగొట్టుకున్నందుకు, ఆయనను చూస్తే జాలి వేసింది కొద్దిగంటల వ్యవధిలో కాంతారావుగారు మహానందాన్నీ, అత్యంత విచారాన్నీ అనుభవించారు. ఒక్కసారి నేలమీదనున్న మనిషి శిఖరంపైకి వెళ్లినట్లు వెళ్లారు అక్కడ కొద్దిసేపయినా వుండకుండా, క్రింద అఘాతంలోకి త్రోయబడ్డాడు అటువంటప్పుడు, ఆ మనిషికి ఆ శిఖరమూ వద్దు, ఈ అఘాతమూ వద్దు, మునుపు తనుండిన నేలే బాగుం దనిపిస్తుంది. ఆ నేలయొక్క గొప్పతనం బాగా తెలుస్తుంది

తన జేబులోంచి ఒక లావాటి కవరు పైకి తీశారు, శ్యామ్‌బాబు అది తెరిచి, అందులోంచి ఒక నోట్లకట్టా, ఒక ఉత్తరం పైకి తీశాడు. కాంతారావుగారికి ఏమీ అర్థంకాలేదు.

"మిత్ర నాకు ఈ కవరు ఒక మనిషిద్వారా పంపాడు తను అర్జెంటుగా ఏదో పనిమీద వూరు వెళ్తున్నాననీ మళ్ళీ రెండురోజులలో తిరిగి వస్తున్నాననీ, కబురు పంపాడు ఈ ఉత్తరం ఏమిటో చదువుదాం, ఉండండి" అని శ్యామ్‌బాబు ఆ ఉత్తరం చదవ నారంభించాడు అందులో ఇలాఉంది

'శ్యామ్‌బాబుకు ఇందుతో పదివేలరూపాయలు పంపుతున్నాను ఇది కాంతారావుగారు, నాకు, బంగారం అయ్యేటందుకు కావలసిన భస్మాన్ని తయారుచేసినందుకు ఇచ్చిన కూలి నేను వారికి ఈ భస్మం నిన్న రాత్రి అందజేశాను అయితే వారికి ఒక్క విషయం చెప్పడం మర్చిపోయాను కేవలం ఆ భస్మం ఉన్నంత మాత్రాన బంగారం కాదు ఆభస్మం ఉపయోగించే మనిషికి ఆ 'బంగారుయోగం' ఉండాలి ఆ యోగం లేనివాడు ఆ భస్మాన్ని తాకినట్లయితే ఆ భస్మంయొక్క శక్తి పోతుంది కాంతారావుగారికి ఆయోగముండి, ఆ భస్మం పనిచేస్తే సరేసరి అలా లేకపోయి భస్మం పనిచెయ్యకపోతే ఈ పదివేలు ఆయనకు ఇచ్చెయ్యండి ఒక అర్జెంటు కేసు తగలడంవల్ల నేను ప్రక్కఊరు వెళ్తున్నాను ఇట్లు, మిత్ర' అని ఉంది

అది చదివి, శ్యామ్‌బాబు "మీరు ఆ భస్మం పనిచెయ్యటం లేదన్నారు కాబట్టి ఈ డబ్బు తీసుకోండి" అన్నాడు

కాంతారావుగారి మొహంలో కత్తివేటుకు కూడా నెత్తురుచుక్క కన్పించదన్నట్లు పాలిపోయింది "నాకు బంగారు యోగం లేదన్నమాట అనవసరంగా మిత్ర ననుమానించాను." అన్నారు, అతి మెల్లగా. శ్యామ్‌బాబు అందించిన డబ్బు తీసుకుంటూ, "పాపం, మిత్ర చాలా మంచివాడు కాబట్టి ఈ డబ్బు తిప్పి పంపించేశాడు మరొకడయితే, చేజిక్కిన డబ్బును ఇంత సులభంగా వదుల్తాడా? అతనిలో ఇంత నిజాయితీ ఉందని ఊహించనేలేదు నా జీవితంలో ఇంతవరకూ ఇటువంటి నిజాయితీఉన్న వ్యక్తిని చూడలేదు" అన్నారు కాంతారావుగారు మెల్లగా ఆలోచిస్తూ. క్రమక్రమంగా ఆయన మనస్సు స్థాయికి రాసాగింది నోట్లకట్టను ఒకసారి లెక్కపెట్టారు సరిగ్గా పదివేలుంది. రెండు, మూడు గంటలు తను ఈ డబ్బుకోసం నరకబాధ ననుభవించాడు ఇప్పుడు ఆ బాధ తీరింది. కాని మరో విచారం ఆయ న్నావరించింది అది, తన చేతిలో బంగారు యోగం లేదని నిర్ధారణగా తేలిపోవడం తను ఎన్నో సంవత్సరాలనుంచి ఏది సాధిద్దామని ఎదురుచూశాడో, ఆ మార్గం శాశ్వతంగా తనకు మూసుకుపోయింది. అది తల్చుకొని ఆయన ఒక నిట్టూర్పు విడచాడు "నాకు జీవితంలో ఉన్న, ఒక్క ఆఖరి ఆశా తీరిపోయింది" అన్నారు కాంతారావుగారు

కొద్దిసేపు మౌనంగా ఉన్నతరువాత, శ్యామ్‌బాబు "మీరు చాలా అదృష్టవంతులు' అన్నాడు కాంతారావుగారు ఆయనవైపు ప్రశ్నార్థకంగా చూశారు "ఆశలన్నీ తీరిపోవడం అంటే మాటలు కాదు. ఎంత వ్యతిరేక పరిస్థితులలో కూడా మనిషిని ఆశ అనేది వదలదు మానవుడికి కలిగే కోరికలకు అంతం ఉండదు తనకు దుర్లభమైన కోరికలు, అవి దుర్లభమని తెలిసికూడా, 'ఏనాటికైనా ఫలిస్తాయేమో? అనే ఆశతో జీవితం గడుపుతుంటాడు "ఆశాపాశము దా గడున్ నిడుపులేదంతంబు ." అని భాగవతంలో చెప్పినట్లు మానవుడి 'ఆశ' చాలా పెద్దది వేమన, అనేక రకాల ఆశల్ని వర్ణిస్తూ చివరకు ఆ "ఆశలుడిగినట్టి అయ్యలు ముక్తులు" అన్నాడు అందుకని ఆశలన్నీ తీరిపోతే మనస్సు నిర్మలమవుతుంది నిర్మలమనస్కులకే ఈ జీవితరహస్యం బోధపడుతుంది" అన్నాడు శ్యామ్‌బాబు

"మీరు నా పరిస్థితి చూసి అవహేళన చేస్తున్నట్లుంది" అన్నారు కాంతారావుగారు

"నాకా ఉద్దేశం ఎంతమాత్రం లేదు నా మాటలు మీకు రుచించకపోతే, నేను వచ్చినపని అయిపోయింది కాబట్టి, నే వెళ్తాను" అని శ్యామ్‌బాబు లేచాడు వెంటనే కాంతారావుగారు "అహహ! అలా కాదు. నాదే పొరపాటు. మీరు మొదటినుంచీ మీ కిలాటివాటిలో నమ్మకం లేదని చెప్తున్నారు కూచోండి నా పరిస్థితంతా మీకు తెలుసు. మీ ఉద్దేశ మేమిటో చెప్పండి" అన్నారు, శ్యామ్‌బాబుచేతులు పట్టుకొని కుర్చీమీద కూర్చోబెడుతూ.

కూచొన్న కొద్ది నిముషాలవరకూ శ్యామ్‌బాబు మాట్లాడలేదు కాంతారావుగారే మాట్లాడసాగారు. "నేను చిన్నప్పటినుంచి ఏవో అద్భుత కార్యాలు చెయ్యా లనుకొనేవాణ్ణి సాధారణమైన విషయాలేవీ నాకు నచ్చేవికావు ఏ వ్యక్తయినా, మామూలుమాటలు మాట్లాడితే నాకు గిట్టేది కాదు లక్షలలో వ్యాపారం, కోట్లలో లాభాలూ, ఏవో బ్రహ్మాండమైన బిజినెస్సులూ, ప్రపంచవ్యాప్తంగా ఎగుమతులూ దిగుమతులూ, ఎవరూ కనీ వినీ ఎరుగని పద్ధతులూ — వీటిగురించి ఆలోచిస్తూ, అలాంటి మాటలు మాట్లాడే వారినే చేరదీశేవాణ్ణి. కాని అటువంటి మాటలు మాట్లాడేవాళ్లంతా కపటులనీ, నిజంగా సమర్థులైనవాళ్లెవరూ అలా మాట్లాడరనీ, క్రమంగా తెలుసుకున్నాను ఎన్ని దెబ్బలు తిన్నా, ఎవరైనా నావద్దకు వచ్చి 'అరచేతిలో వైకుంఠం' చూపిస్తే వాళ్లను నమ్ముతూనే ఉంటాను అది నా హృదయదౌర్బల్యం దానివల్లే నా ఆస్తంతా పోగొట్టుకున్నాను ఆఖరికి ఈ బంగారు యోగంమీద ఎంతో ఆశ పెట్టుకున్నాను. కాని అసలు ఆ యోగమే నాకు లేదని తెలిసింది నిజమే! ఆ యోగమే ఉంటే నాకు ఏనాడో బంగారం లభించేది" అన్నారు నిస్పృహతో శ్యామ్‌బాబుకుఆయన్ను చూస్తే జాలివేసింది.

"కాంతారావుగారూ! భగవద్సృష్టి చాలా అద్భుతమైనది మనం కళ్లు పూర్తిగా తెరిచి చూస్తే మనకు కనిపించేదంతా అద్భుతమే! ఈ అద్భుతాలకోసం ఎక్కడికో పరిగెట్టనక్కరలేదు మనకు చేతికందినదాన్ని పారేసుకొని, అందని దానిలో ఏదో విశిష్టత ఉందని మానవులంతా పరిగెడతారు అందువల్ల మనకు లభిస్తున్నదల్లా విచారమే ఆ పద్ధతిని విపర్యయం చేసి ఆలోచించండి మనకు ఉన్నదానిలోని విశిష్టతను తెలుసుకోడానికి ప్రయత్నించండి దీనితో తృప్తిపడండి. లభించనిదానికోసం పడే ఆరాటం కన్నా, ఉన్న దానితో తృప్తిపడే ఆనందం ఎన్ని రెట్లు విలువైనదో తెలుసుకోండి రెండు పూటలా తిండి లేక, ఉండడానికి ఇల్లులేక, బాధపడేవాళ్ల నెంతమందినో మనం చూస్తున్నాం వాళ్లకన్నా మీ స్థితి ఎన్నోరెట్లు మెరుగుగా ఉందని తెలుసుకోండి ఆదర్శం ఉండకూడదని నే ననను కాని ఐహికాదర్శంకన్న ఆధ్యాత్మిక ఆదర్శం గొప్పది. దాన్ని సాధించడానికి ప్రయత్నించండి అద్భుతాలన్నిటినీ మించిన అద్భుతం, ఈ సృష్టి అటువంటి సృష్టియొక్క కర్తయైన భగవంతుణ్ణి ఆరాధించడంలో మీ మనస్సు లగ్నంచెయ్యండి" అని శ్యామ్‌బాబు ఆయనకు చెప్పి, ఆయనవద్ద సెలవుతీసుకున్నాడు కాంతారావుగారు చాలాసేపు అలాగే కూర్చొని, శ్యామ్‌బాబు మాటల్ని మననం చేసుకున్నారు ఆయన దృష్టి ఎదురుగా ఉన్న అల్మారులో ఒక మూలగా ఉన్న 'భగవద్గీత' అనే పుస్తకంమీద పడింది అది తీసి చదవ నారంభించారు.

(సశేషం)

---

"గుడ్డివాడు వ్రాసిన ప్రోనోటు చెల్లుతుం దంటావా?" న్యాయశాస్త్రం ఆచార్యుడు ఒక చురుకైన విద్యార్థిని అడిగాడు.

"కోర్టులో విచారణకు వచ్చినప్పుడు కదండీ తేలేది!" విద్యార్థి తపీమని సమాధానం ఇచ్చాడు.

ఎస్. నరసింహులు, (ముత్యాలపేట)

# కవిసార్వభౌముడు

16—వ పేజీ తరువాయి

ఇంద్రదిభూషు (శ్రియాశక్తి రాయలయొద్ద
బాదుకొల్పితి సార్వభౌము బిరుద
మెటుల మెప్పించెదో నన్ను నింకమీద
రావు సింగ మహీపాలు ధీవిశాలు
విందుకొలువున నెలకొనియుండు నీవు
సకల సద్గుణ నికురంబ శారదాంబ !"

సరిగా మూడుజాములకు శ్రీనాథుడు శుద్ధశ్రోత్రియ వేషముతో తనమిత్రులతో ప్రయాణమునకు సిద్ధమై రాజాచలదూతలకు తెలిపెను అప్పటికే వారు ఐదు వెండి పల్లకులను మేళతాళములను నర్తకులను వివిధ వినోదకులను సిద్ధము చేసిరి మేళతాళములు మొరిసినవి శ్రీనాథుని నృసింహభట్టును సుబ్రహ్మణ్యశాస్త్రిని లక్కన సూరిని పోతనను చెరియొకపల్లకిలో కూర్చుండ జేసిరి వంటవారికిని పరిచారకునకును మూడు గుఱ్ఱము లిచ్చిరి

రాజాచలములోని ప్రసిద్ధ నర్తకుల మేళము స్వాగతగీతము పాడినది ప్రధాన నర్తకి శ్రీనాథాదులకు మంగళహారతి పట్టగా శ్రీనాథుడు పదునారు సువర్ణములు పళ్లెరములో నుంచెను బోయీలు పల్లకు లెత్తిరి కొండవీటిలోగాని, విద్యానగరములోగాని చూడనంతటి మహావైభవముతో మేళ తాళాదులతో నారాయణపురమంతట నూరేగించి ఊరుదాటిరి

కవిసార్వభౌముడు దయచేయుచున్న వార్త అప్పటికే రాజాచలనగరమున ప్రకటింపబడి యుండుటచే, అక్కడినుండి జనులు తండోప తండములుగా—కొందరు అశ్వాదివాహనము లెక్కియు, పల్లకులలో కొందరు, మేనాలలో కొందరు, మరికొందరు కాలినడకను — ఎదురు వచ్చిరి నారాయణపురమునుండి రాచకొండ వరకుగల మూడుకోసుల మార్గమును ఆ జనములతో నిండిపోయినది స్వాగతగీతములు పఠించువారు, జయజయఘోషలు చేయువారు, హారతులు పట్టువారు, కవిసార్వభౌమునికి నమస్కరించువారు, ఆయన దర్శనమునకై త్రోపులాడువారుగా మహోత్సవము తరలినది.

కచేరీ కొండ అను నామాంతరముకల రాచకొండ దుర్గద్వారములు పుష్పపల్లవాలంకృతములై స్వాగతమొనగుచున్న తోరణములతో తెరచియున్నవి మహాప్రభువుల నెదుర్కొనుచున్నట్లే కవిసార్వభౌముని ద్వారపాలకులు ఎదుర్కొని నమస్కరించి దుర్గములో ప్రవేశపెట్టిరి రాజమార్గము పొడవునను స్వాగతతోరణములతో పందిళ్లు వేసియున్నవి దారిలో జనసమ్మర్దము త్రోపులాడకుండ జేయుటకు మూడువందల మంది భటులు నియుక్తులై యున్నను, వారి కాపని సాధ్యపడుటలేదు రాజమార్గమునకు ఇరువైపులగల మేడల యన్నియంతస్థులనుండియు జనములు కిటకిటలాడుచు శ్రీనాథ దర్శనార్థము వేచియుండిరి. కొందరు చెట్లెక్కిరి

పల్లకు లైదును సరాసరి పోయి సింగభూపాలుని సభామండపద్వారమున నిలిచినవి రావుసింగమహీపాలుడు రాజబంధువులతో, సామంత దండనాథ ప్రధానాధులతో, రాజపురోహిత పురస్సరముగా శ్రీనాథుని కెదురువచ్చి గౌరవించి, భటులు అడుగులకు మడుగులొత్తుచుండ, సభామండపమునకు కొనిపోయి ఉన్నతాసనమున గూర్చుండజేసి, అర్ఘ్యపాద్యాదులతో పూజించెను ఆనాడు రావుసింగమహీపాలుడు ప్రదర్శించిన భక్తి ఏప్రభువు ప్రదర్శించుటయు చూడలేదని యద్భుతావిష్టులై జనమందరు చెప్పుకొనిరి ఆ స్వాగతసభలో ప్రభువు రాజబంధువులు, ఉద్యోగులు, పెద్దలు, నాగరకులు, శ్రేణీపతులు శ్రేష్ఠులు బహువిధముల కవిసార్వభౌముని యెడల తమకు గల ప్రేమయు, భక్తియు ప్రకటించిరి

---

నాలుగేళ్ళ రాముడు మొదటి రోజు స్కూలుకెళ్ళి తిరిగొచ్చాడు

"ఏరా క్లాసులో మగపిల్లలంతా మంచివాళ్లేనా, అల్లరిచేస్తారా?" అని అడిగాడు వాళ్ళ నాన్న.

"చాలా మంచివాళ్లు," అన్నాడు రాముడు.

"ఆడపిల్లలు ?"

రాముడు మొహంమీద అసహ్యం కనిపించింది.

"అదేమిట్రా, మరి సుశీలతో కలిసి వస్తూంటే చూశాను !" అని అడిగాడు తండ్రి.

రాముడి ఆశ్చర్యం ఇంతా అంతా కాదు. "అదేమిటి," సుశీల అమ్మాయా?" అని అరిచాడు.

'సిద్ధాంతి' (రాజమండ్రి)

---

శ్రీనాథబృందము విడిది విశ్వేశ్వరకవి భవనమున నేర్పాటుచేసిరి వా రక్కడ నున్నన్నినాళ్ళు వారి కెప్పు డేమియవసరమగునో తెలిసికొని తీర్చుటకు, ఉన్నత రాజోద్యోగులు నియుక్తులై, ఆ భవనముముంగిట పడికాపులు కాయుచుండిరి

ఆరాత్రి భోజనానంతరమున తాంబూలసేవకు ముందు, శ్రీనాథుడు లేచి నడుముకు ఉత్తరీయము బిగించి, వృద్ధులను, పూజ్యులును అగు శ్రీవిశ్వేశ్వరుల పాదములకు అభివందన మాచరించి 'ఇదియంతయు మీ యమోఘాశీర్వచన ప్రభావమే' అనెను విశ్వేశ్వరుడు ప్రేమతో లేవనెత్తి "నాయనా, ఆ డిండిముని జయించి నా హృదయశల్యము నుద్ధరించినావోయి !' ఇన్ని సంవత్సరముల కీనాడు నేను సుఖనిద్ర పోగలను!' అనెను.

"చివరి క్షణములో నన్ను ఆదుకొన్నది మీరను గ్రహించిన చమత్కారచంద్రికయే. దానికి నవ్వుద్బోధించినవాడు ఈ కృష్ణ పోతరాజు!" అనుచు శ్రీనాథుడు పోతనను చూపి ప్రేమతో శిరస్సు మూర్కొనెను నృసింహభట్టు సభావిశేషము లన్నగారికి నివేదించెను

శ్రీనాథు డేమి పనిమీద దయచేసెనో, ఏ మడుగునో, ఎట్లు గౌరవింపవలెనో తెలియక రావు సింగమహీపాలుడు తహతహలాడుచుండెను సర్వజ్ఞ బిరుదాంచితులమైన మనము కవిసార్వభౌముల కెట్టి లోపము చేయరాదని వారి ప్రతిజ్ఞ

ప్రసన్నగోపాలస్వామి యాలయ ప్రాంగణమున రంగలక్ష్మీనివాసుడను సూత్రధారుని యధ్వర్యమున నడుచుచున్న నాట్యమండలివారు శ్రీ సర్వజ్ఞ విరచితమగు రత్నపాంచాలిక యను నామాంతరముగల కువలయావలియను నాలుగంకముల నాటికను ప్రభుసమక్షమున శ్రీనాథబృందము నెదుట రోజు కొక యంకము చొప్పున వరుసగా నాలుగురోజులు ఉదయవేళల ప్రదర్శించిరి.

ఒకనాడు ఆస్థానగాయకుని సంగీత విద్యావినోదము, ఒకనాడు ఆస్థాననర్తకి నృత్యవినోదము, ఒకనాడు విద్వాంసుల విద్యావినోదములు, ఒకనాడు కవీశ్వరుల కవితాగోష్ఠియు జరిగినవి. అట్లే ఇంద్రజాలము, మల్లవిద్య, ఖడ్గవిద్య మొదలైన వెన్నో ప్రదర్శించిరి సరిగా నవి శరన్నవరాత్రోత్సవదినము లగుటచే ఉత్సవశోభ ద్విగుణీకృతమయ్యెను

రాచకొండప్రభువు ఒకవంక నిట్లు వినోదములతో శ్రీనాథుని హర్షింపజేయుచుండ, నాగరకు లింకొకవంక తమలో తాము పోటీలుపడుచు, నాతని పిలుచుకొనిపోయి సాయంవేళలను, రాత్రులందును రామనాటకములు, శ్రీకృష్ణలీలలు, యక్షగానములు, తోలుబొమ్మలాటలు, పరుగుపందెములు, ఈత పందెములు పొట్టేళ్ల పోరులు, కోడిపుంజుల పోరులు, కోలాటములు, విదూషకవినోదములు రకరకములుగా ప్రదర్శించుచుండిరి

ఇంద రిన్నివిధముల గౌరవించి పూజించుచున్నను, శ్రీనాథున కేమాత్రము ఆనందము కలుగుటలేదు మర్యాదకై చిరునవ్వు తెచ్చుకొనుటే కష్టసాధ్యముగా నున్నది పెదకోమటి వేమప్రభువుల వియోగక్లేశము అతని వేధించుచున్నది

శ్రీనాథుడు వచ్చిన పనియేమో తెలిసికొనవలెనని రావుసింగమహీపాలుడు ఎంత ప్రయత్నించినను సాధ్యపడకుండుటచే, తుదకు ప్రత్యక్షముగా నడిగి తెలిసికొన నిశ్చయించి విద్వత్సభ చేసి శ్రీనాథుని రావించి పూజించెను శ్రీనాథునకు చూచాయగా మహీపాలుని యింగితము స్ఫురించినది. ఆతడీపద్యము చెప్పెను :

"సర్వజ్ఞ నామధేయము
శర్వునకే రావుసింగ జనపాలునకే
యుర్విం జెల్లును దక్కొరు
సర్వజ్ఞం డనుట కుక్క సామజ మనుటే !"

కొంతసేపు ఇష్టకథాగోష్ఠి జరిగినది అంతట మహీపాలుని వందియగు భట్రాజు ప్రభువుల యనుమతిగాని, కవిసార్వభౌముని సమస్యాపూరణము

చేయుడని యర్థించి చివరిపాద మీయగా నాత డీవిధముగా పూరించెను

"తక్కక రావుసింగవసుధావరు డర్థుల కర్థ మిచ్చుచో
దిక్కుల లేని కర్ణుని దధీచిని ఖేచరు వేల్పు మ్రాకు బం
టెక్కిన కామధేనువు శిబీంద్రుని నెన్నెదు భట్టు దిట్టలై
కుక్కవొ నక్కవో ఫణివొ క్రోతివొ పిల్లివొ బూతపిల్లివో!"

అనా డంతకు పూర్వము వంది తన ప్రభుస్తుతిలో కర్ణాదుల దానమును ప్రశంసించియుండుటచే, శ్రీనాథుని పూరణము సభ్యుల కెల్లరకు విశేషామోద కారి యయ్యెను

సరిగా నిప్పుడు రావుసింగమహీపాలున కవ కాశము చిక్కినది. అత డిట్లనెను. "కవిసార్వ భౌమా, మీరు దక్షిణాధీశులగు దేవరాయలవారి యాస్థానములోనే ఏమియు వర్ణింపక, సార్వ భౌములవలెనే అభిషేకము పొంది వచ్చితిరని విన వచ్చినది అట్టి మీరు మా వితరణమును నేడు ఉటంకించుచున్నారు మీబోటి కవిసార్వభౌములు అర్థించునది కానుకముగా గ్రహించి తీర్చినప్పుడే గదా మాపేరు నిలుచునది! మీ రే కోరికతో ఇక్క డికి దయచేసితిరో సెలవీయవేడెదను"

శ్రీనాథుడు కన్నులలో నిండుచున్న యశ్రు పూరమును నిరోధించుటకు కన్నులరమోడ్చి, ఎలుగువారుచున్న కంఠమును ప్రయత్నపూర్వక ముగా సరిచేసుకొనుచు ఇట్లు పలికెను: "సర్వజ్ఞ సింగభూపాలశేఖరా, రసజ్ఞశిఖామణులగు మీకు తెలియని దేమున్నది! మేము వీరనారాయణుల వితరణముచే వైభవముగా శ్రీవిద్యానగర యాత్ర చేసి రాగలిగితిమి వా రుండగా మా కేకొదవయు లేదు వారి ఋణము తీర్చుకొనుటకు వారిని కన్నులార దర్శించు భాగ్యమైన మాకు ప్రాప్తింప లేదు వీరోచితముగా వీరశయన మలంకరించి వీర స్వర్గము చూరగొన్నవారు ధన్యులే వారి సౌత రము పునరుజ్జీవితుల గావింపజాలము కదా! వారి కులదేవతయగు నందికంత పోతరాజు కత్తారిని మరల కొండవీటికి కొంపోయి ప్రతిష్ఠింపగలిగినచో మా ఋణము కొంతవరకైన తీరగలదేమోయని యాశించుచున్నాము దీనివలన కొండవీటికిని రాచ కొండకును వైరము కొంతకాలముపాటైన శాంతింపగలదేమో యనికూడ ఆశగా నున్నది"

శ్రీనాథుడు ప్రత్యక్షముగా నర్థింపలేదు. ఆయన దర్పము సింగమహీజాని కాయనయెడ గల గౌరవ మినుమడింపజేసినది "కవిసార్వభౌమా, మీరు సర్వవిధముల మా కారాధనీయులు ఇట్టి విషయ మున మీరు మమ్ము ఆజ్ఞాపించవచ్చును మాకు వేమభూపాలురతో శత్రుత్వ మున్నమాట సత్యమే. అది తరతరములుగా వచ్చినది అయినను వారి కులదేవతను మే మేమాత్రము అగౌరవింపలేదు మా రాజ్యములో వారి కులమువారికే దాని నప్ప గించి యథావిధి పూజలు చేయించుచున్నాము. మీ రెప్పుడు తీసుకొనిపోదలచినను, దానిని సగౌర వముగా మీ కర్పింతుము"

శ్రీనాథు డామాటలు విని విశ్వసించి ఆశీర్వ దించి తన రాక సఫలమైనదని తెలిపెను.

ఆతరువాత మూడు దినములకే శ్రీనాథుడు కొండవీటికి బయలుదేర నిశ్చయించెను. బయలు దేరుటకు ముందు విశ్వేశ్వర సన్నిధానమున పోతనను అతని యన్న తిప్పనార్యున కప్పజెప్పి యిట్లనెను:

"తిప్పనార్యా, వీడే నాకు సందిగ్ధసమయము లలో జయమార్గము నిర్దేశించిన బాలకృష్ణుడు! వీనికి గొప్ప కవితాయోగ మున్నది వీని ప్రతిభ యనన్య సామాన్యమైనది శ్రీ విశ్వేశ్వరుల కటాక్ష యోగముచే వ్యుత్పత్తి నతిశయింప జేసి కొనవలసిన యున్నది"

అంతట పోతనను దగ్గరకు తీసికొని యిట్ల నెను: "నాయనా, నీమీది ప్రేమాతిశయముచేత మాబోంట్లము నీ యెదుట నెన్నో భూషణ వాక్యములు పలికితిమి గర్వించి తలతిరిగి చెడి పోకు, తండ్రీ! చెప్పిన నాలుగైదు మంచి పద్య ములు తడవుచు నానందించుచున్నచో, వానితోనే కవిత పరిసమాప్తినొందునురా! మహాగ్రంథము చెప్పదలచినవారికి, చెప్పినదానిని చదువుకొనుచు ఆనందించు తీరిక యుండదు — బాలాదపి సుభా షితమ్ అని నేనుకూడ ఇకముందు భగవద్విషయ ములగూర్చికాని మహాకావ్యములు చెప్పరాదని నిశ్చయించితిని! శ్రీగురువులు ప్రసాదించిన యిష్ట దేవతను హృదయములో పదిలముచేసికొని వృద్ధి లోనికి రా! దీర్ఘాయుష్యమస్తు!"

అంతకు ముందే తన పాదములు రెండును కౌగి లించుకొని యశ్రువులతో నభిషేకించుచున్న పోత నను శ్రీనాథుడు బాహువులతో పొదివి, తన అమృత హస్తముతో శిరస్సును, బాహువులను, పృష్ఠ మును, హృదయమునుస్పృశించుచు ఆశీర్వదించెను

* * *

ఈమధ్య రాజ్యముల స్థితిగతులు సరిహద్దులు మారిపోయినవి వల్లభరాయని సేనలు కొండవీటి రాజ్యములోని పల్నాటిసీమ నంతటిని ఆక్రమించి నవి దక్షిణమున కందుకూరునుండి విద్యానగర సేనలు వంట మైలారురెడ్డి యాధిపత్యమున కొండవీటిరాజ్యములోనికి చొచ్చుకొని వచ్చు చున్నవి కొండపల్లిసీమ రాజమహేంద్రవరరాజ్య ములో లీనమైనది రాచకొండ, దేవరకొండ ప్రభు వులు శ్రీవిద్యానగర ప్రభువునకు సామంత తుల్యులగు మిత్రులైరి రాజమహేంద్రవర పాల కులు వట్టే యైరి. కొండవీటి రాజ్యము క్షీణించి బహమనీసుల్తానుతో మైత్రికి యత్నించు చున్నది ఈ మార్పు లన్నియు శ్రీనాథునకు స్పష్టముగా తెలియవు

రాచకొండ ప్రభువులు శ్రీనాథబృందమునకు తమభటులను కాపుగా నిచ్చి నందికంతపోత రాజుతో సురక్షితముగా దన్నడ కోటకు ఎదురుగా నున్న కృష్ణానది రేవుకు చేర్పించిరి అక్కడ శ్రీనాథుని సపరివారముగను నందికంత పోత రాజుతోడను తరణి నెక్కించి, ఆవలియొడ్డుకు పోవు నేర్పాట్లు చేసి, రాచకొండ పరివారము శ్రీనాథునికడ సెలవు తీసికొనిరి (సశేషం)




# చకచకా పెరగాలి...
# చురుకుగా తిరగాలి...

ఏడాదిలో ఎన్ని విద్దెలు నేర్చుకోవాలని! పాకాలి దేకాలి అడుగుల్లు వెయ్యాలి: ఊరోగా — ఈ యేడాదిలోనే బరువు రెట్టింపు పెరగాలి. పాపాయి ఇన్ని పనులు సాధించి చక్కబెట్టాలంటే తలిదండ్రులు అడుగడుగునా ఆదుకోవాలి. అతి శ్రద్ధచేసి పాప ఆరోగ్యం దెబ్బతినకుండా చూడడం తలిదండ్రుల బాధ్యత.

ఇందుకు అమృతాంజన్ లిమిటెడ్ వారి గ్రైప్ మిక్శ్చర్ అన్నివిధాలా తగినదని డాక్టర్లు చెబుతున్నారు. అది హాయిగా ఉంటుంది. చక్కగా పనిచేసి ఫలితాలు చూపిస్తుంది. పాలపళ్లు మొలిచే వేళల్లో పాపం కేమాత్రం బాధ లేకుండా చూస్తుంది.

మీ పాపాయికి ప్రతి ఉదయం, అమృతాంజన్ లిమిటెడ్ వారి గ్రైప్ మిక్శ్చర్ ఒక టీ స్పూను పోసి పట్టండి. పాప తన పనులన్నీ చకచక చక్కబెట్టుకు చక్కగా పెరిగి తిరుగుతుంది.




## అమృతాంజనము లిమిటెడ్‌వారి గ్రైప్ మిక్శ్చర్

తయారుచేయువారు:
అమృతాంజన్ లిమిటెడ్ 14/15, లజ్ చర్చి రోడ్, మద్రాసు-4,
బొంబాయి-1, కలకత్తా-1, న్యూఢిల్లీ-1,

JWT/-AM-G-1417

చిత్రసమీక్ష

# ఖైదీ కన్నయ్య

"అంతా ప్రేమమయం" అన్నాడోకవి. ఈశక్తి అతీంద్రియమైందికూడా. అది హృదయపు పొరలతెరల మాటున ఉండిదోచులాడుతునే వుంటుంది. సాంఘికస్థితి, అధికారం, అవకాశంలాంటి అడ్డంకు లెన్నివున్నా ఈశక్తి అప్పుడప్పుడు తొంగిచూస్తూనే ఉంటుంది. పై అడ్డంకుల ఒడ్డుల మధ్యగా ప్రేమ ప్రవాహం వివిధమైన వంపులతో సొంపులతో కద లాడుతూ ఉంటుంది. 'ధర్మా'న్ని ప్రేమించిన వాళ్ళు కొంతమందుంటే "కర్మ"న్ని ప్రేమించేవాళ్ళు కొందరుంటారు. అంతే తేడా. ఇలా విభిన్న రీతులలో నడచిన ఇద్దరు వ్యక్తుల గాధను వీలైనంత ఉత్కంఠ, సినిమసాలాలు మిళాయించి జనామోదం కోసమని నిర్మించిన చిత్రం రాజ్య లక్ష్మి పిక్చర్స్ "ఖైదీ కన్నయ్య."

నేరస్థ కార్యకలపాలు, పరిశోధనలు ఆధార మైన ఈ చిత్రకథ ఇది:

బ్యాంకు కాషియర్ కన్నయ్య (కాంతారావు) కుమారుడు రవిని, మరదలు మాధవి (గిరిజ) ఇంటిలో ఉండగా దొంగలెత్తుకుపోవటం కుమారుని రక్షించుకోవాలనే ఆశతో ప్రయత్నించిన కన్నయ్య ద్రవ్యాపహరణ ఖైదీ కావటం, రవి మరణించటం జరుగుతుంది.

జైలర్ (గుమ్మడి) మనసెంత మెత్తనో మని షంత కరుకు. ఏది ఏమైనా కర్తవ్యాన్ని విడవ కూడదనే వ్యక్తి. జైలర్ కుమారుడు రాజులో కన్నయ్య తనకొడుకు రూపాన్ని చూచుకొని ఆనం దిస్తాడు. ఈ కారణంగా కన్నయ్య జైలరు ఆదరణ పొందటం జరుగుతుంది.

కన్నయ్యపై పగబట్టిన "పాతకాపు" దుర్గారాయ యుడు (రాజనాల) జైలరుకుమారుణ్ణి ఎత్తుకుని తప్పించుకుపోతాడు.

కన్న కొడుకుకన్న మిన్నగా చూచుకుం టున్న రాజా కన్పడకపోవటంతో కన్నయ్య జైలు నుంచి పారిపోగా, కర్తవ్య నిర్వహణకన్న, కన్న కొడుకు ఎక్కువకాదని భావించే జైలరు తప్పించు పోయిన ఖైదీలకోసం వెతకటానికి బయల్దే రటం జరుగుతుంది. కన్నయ్య తనమిత్రుడు సిం గారం (రేలంగి), అతని ప్రియురాలు పద్మ (రాజ సులోచన) సహాయంతో, రాజా దొంగల ఆచూకీ కోసం మాధవి అన్న (బాలకృష్ణ)ను పట్టుకుని అతని ఆచూకీతో దొంగలున్న ప్రదేశం చేర్తాడు. ఆపైన సస్పెన్స్! .... ముష్టియుద్ధాలు, పారిపోయే కారు పందాలు, కథాంతం: జైలరుకు కొడుకు దక్కగా దొంగలకు కృష్ణజన్మస్థానం, విడుదల పొందిన కన్నయ్యకు మాధవికీ, సింగారం పద్మ (రాజ సులోచన)ల వివాహం.

కంట తడి పెట్టించకపోయినా కదలించకల సన్నివేశాలుకొన్ని గల్గి, జిలమైన కథంటూ కన్పించని ఈ చిత్రంలో కర్మవశాత్తు ఖైదీ అయిన కన్నయ్యగా కాంతారావు మరొక్కసారి మంచి నటన ప్రదర్శించాడు. గుమ్మడి కిలాంటివి కొత్తగాక పోయినా తననటనలో కొంత మెత్తదనం చూపిం చారు. దుష్టపాత్రల నిర్వహణలో దుర్గారావుగా రాజనాల, మరొక్కమెట్టు ఎక్కారు. హాస్యనటుడు బాలకృష్ణ ఈ చిత్రంలో వింతభూమికను కొంత బాగానే ఒప్పించాడు. మాధవిగా గిరిజ, పద్మగా రాజసులోచన కన్నయ్య మిత్రుడు సింగారంగా రేలంగి బాగా, కె. వి. యస్. రాజారెడ్డి, ప్రభృతులు పాత్రోచితంగా నటించారు.

అక్కడక్కడా 'అ'పూర్వ సభ్యతా అనుమానాన్ని కలిగించినా జి. కృష్ణమూర్తి సంభాషణలు బిగువుగానే వున్నాయి. 'ససురాల్' సంగీతం (తీయతీయని మాటలతో) సుస్వరాలతో అనుకరించామన్నట్లున్నా రాజన్ నాగేంద్రల సంగీతం వినసొంపుగావుంది

అసలీ చిత్రానికి ఆధారంహిందీ 'ఖైదీనంబరు911' మోడరన్ థియేటర్స్‌వారి తమిళచిత్రం 'ఖైదీ కణ్ణాయిరం'. దీనిని వీలైనంత మార్పులతో తెలుగులో నిర్మించారు. చిత్రాదిన చేసిన కొన్ని మార్పులవల్ల కథలో ఉత్కంఠ కొద్దిగా కుంఠిత మైందేమో అనిపించినా విఠలాచార్య చివరచివర చేసిన మార్పులలో ఉత్కంఠను కాపాడుతూ దర్శ కత్వం నిర్వహించారు.

మంచి మంచి సన్నివేశాలు, నవ్వటం చేతకానివారిని కూడా నవ్వజేసే హాస్యం, అనుకరణ మనిపించినా అదేంతప్పుకాదులే అనిపించే వినవిందు సంగీతం, బీచిసైడ్ ప్రేమకలాపం, 'మ్యాక్ డ్రైవర్' సరసం వరసగాగల ఈ చిత్రవిజయం "ఎప్పుడు, ఎక్కడా, ఎలా" అనే అనుమానం చూసేవారికున్నా దాన్ని చేసినవారికి ఉండకపోవచ్చు. ★

—నాగరాజ్.



రాజ్యలక్ష్మి ప్రొడక్షన్సువారి "ఖైదీ కన్నయ్య"లో గిరిజ, కాంతారావు.



ఓం : తత్ : సత్

## సుఖ జీవిత సేవ

"సిద్ధ ఔషధ మహిమ"

సిద్ధం పొందలేని మహిమకు ఒక తార్కాణము

# కె. టి. కృష్ణమూర్తి ఆచ్చారిగారి

# "మేల్ మాయిల్ మందు"

(Regd.)

**దీర్ఘకాల చర్మ రోగములకు ఉత్తమ నివారిణి**

నల్లరంగు, ఎఱ్ఱరంగు పొడలు, దద్దులు, పోట్లు, గజ్జి, (చర్మ సంబంధము) పొడలుగల చోట్లలో తిమ్మిర్లు, సూదితో పొడిచినప్పుడు నొప్పి లేకుండుట, విస్ఫోటక బొబ్బలు గలిగిన తెలియకుండుట, దుర్గంధ చర్మ అవయవములందు వ్యాపించి, రక్తములో కలిసి కుష్టు కలుగజేయుట, (నరముల సంబంధము) చేతి వ్రేళ్లు ముడుచుకొనుట, బొబ్బలు లేచుట, ముక్కు బంధనములు, పాదములందు నల్లని పుండ్లు ఏర్పడుట, కాలు చేతులు వ్రేళ్ళు తగ్గుట, ముక్కు సొట్ట పడుట, చూచుటకు విసుగు పుట్టించు రణములు (అస్థి సంబంధము) వీటికి ఉత్తమ నివారిణి.

1 మండలం నూనె, లేహ్యము 8 oz శ్రీ పరమాత్మస్నాన తైలం తపాల ఖర్చులతో రు. 12.

పూర్తి వివరములకు వ్రాయండి:

సిద్ధ డాక్టర్ K. T. కృష్ణమూర్తి ఆచ్చారి & సన్సు,
5/22, మేల్‌మాయిల్ P.O. (N. A. Dt.)



# ఉబ్బస రోగమా?

# ఎఫోమాగ్

ఎలిక్సర్
**(Ephomag Elixir)**

సేవించి శీఘ్ర నివారణ పొందండి.

నమ్మకంగా లోపలికి పుచ్చుకోదగిన
ఉబ్బస నివారణౌషధము.

అన్ని కెమిస్టు షాపులలోను దొరుకుతుంది.




**M.A.C. Margarets Pharma-Labs.**

40, SAN THOME HIGH ROAD, MADRAS-28.
Telegrams: MAGMARS Telephone: 71886.

# సినీ విహారం

9-వ పేజీ తరువాయి

ంరిగాయి ఇతర కళాశాలలవారు కూడా ఆ పోటీలో పాల్గొన్నారు "దానధర్మాలు అవసరమా? అనవసరమా ?" అనే చర్చలో తీవ్రంగా పాల్గొని గెలుపొందిన ఫలంగా పొంగిన ఉత్సాహావేశాలతో "పిక్‌నిక్" కి పోదాం అనుకున్నారు. క్షణమే పాతికమంది ట్రాన్సిస్టర్ రేడియోలతో, ుయిర్ గన్‌లతో, హులాహూప్‌లతో బయలుదేరారు

ట్రాన్సిస్టర్ రేడియోలోంచి ఒక పాట వినే ంరికి స్వేచ్ఛాజీవులైన ఈ విద్యార్థి బృందం ఆటలో ుడుగుపెట్టింది పెదవులపై పాట, పాదాలపై ుట ప్రారంభమైంది

అమ్మాయిలూ, అబ్బాయిలూ, కంఠస్వరాలు లిపి పాటను అందుకున్నారు అందులో తెలుగుతో ాటు ఇతర భాషల 'ఫోర్స్' కూడా ఉంది.

వారాని కొక్కటే సన్‌డే
కుర్రాళ్లకంతా అది జాలీ డే

ఈలోగా ప్రసాద్ తన మిత్ర బృందంతో చ్చి తమ ఆనందాన్ని వ్యాఖ్యానించారు

స్టూడెంట్‌లైఫు స్వీటూ
ఫ్యూచర్‌కు మెయిన్‌గేటూ

పద్మ లేడీ స్టూడెంట్లలో లేడిపిల్ల, లీడరూ ఆమె న సఖులతో వచ్చి విద్యార్థిదశపై విసుర్లు విసింది

బాధ్యతలున్నా పరీక్షలున్నా
బాధలు లేవన్నా ॥వా॥

వెంటనే సీమమిరపకాయ మధు అందు ున్నాడు పాటని

వన్ టు త్రీ ఫోర్ ఫైవ్
సిక్స్‌డేస్ అంతా చదువు

జంట కవిలా అందుకుని ఆనంద్ చరణాన్ని ూర్తి చేశాడు

సన్‌డే నాడు సెల్యూట్ పోడు
సరదాగా ఆడు

కొంచెం అవల రమను మిత్రబృందం హులాహూప్ మధ్య నిలబెట్టి ఆడుతూన్నారు వారు ుఅలా లలలా" అంటూ పాట అందుకున్నారు ళ్లీ ప్రసాద్ బృందం ముందుకు ఉరికింది .

మనముందు ఉంది గోల్
కొడతాము రేపు బాల్

ఈలోగా లత విడిపోయి మధును సమీపించి ాడాలి నేడు హవ్ తువ్" అని తన భావాన్ని ప్రకంచగానే ప్రేమ పాఠాలు తేలికగా అర్థమయే ుుకి హుషార్ పొంగి "ఆడాలి ఆట కవ్, కవ్"

ఉభయభాషా పాండిత్యంలో తాను కూడా ్కువ తినలేదని నిరూపించుకున్నాడు

వేడుక చెలికాడు ఆనంద్ "అమ్మా నాన్నా సొ ఇుస్తే — హాయిగ తిని తిరిగేము" అని దర్శీ కవ్వించాడు పాటలో రాగ తాళాలతోబాటు ుం కూడా పతాక స్థాయిని అందుకుంటోంది విద్యార్థి బృందం అంతా తమ ఆర్థిక స్థితి, ుకి సంబంధించిన జమాఖర్చులమీద తామే ్ప ప్రారంభించారు

"ఫస్ట్ వీక్‌లో కాపిటలిస్ట్" అని ప్రసాద్, "నెక్స్‌ట్ వీక్‌లో సోషలిస్ట్" అని లత, "ఆపై వారం కమ్యూనిస్ట్" అని పద్మ వినోదంగా విమర్శించగానే ప్రసాద్ గాలి తుపాకీని పేలుస్తూ జీవిత చిత్రాన్ని రచించాడు ఈ జోక్స్‌కి పిక్‌నిక్ పార్టీ అంతా ఉత్సాహంతో రెచ్చిపోయి గూళ్లలోంచి వదిలివేయబడిన పావురాలలాగ "వారాని కొక్కటే సన్‌డే" అని స్వైర విహారం చేశారు.

ఈ విద్యార్థి బృందగానంలో పాల్గొన్న నటవర్గం ప్రసాద్‌గా నాగేశ్వరరావు, పద్మగా సావిత్రి, లతగా వాసంతి బి ఏ, రమగా గిరిజ, మధుగా చలం, ఆనంద్‌గా రేలంగి, స్నేహకోటిలో కె ఎస్ రెడ్డి, ధర్మరాజు, లక్ష్మినారాయణ, రాజా ఫిలిప్స్ డిసిల్వా, గాడ్‌ఫ్రి, ఎరెల్, డెస్మండ్, ఎడ్రిక్స్, షిలాసీనియర్ జూనియర్, బెరిల్, బడ్డీ, చినరాజ్యం, పెదరాజ్యం, శాంత, జానకి, సత్యవతి, రాధాబాయి, రత్నకుమారి, అంజన్‌కుమార్, రఘురామ్, జూనియర్ నాగేశ్వరరావులు ఆటపాటల్లో పాల్గొన్నారు.

ఆచార్య ఆత్రేయ కలం నుంచి పొంగెన్‌లా ఉబికిన ఈ పాటకు వేణు మంచి బాణీ కుదిర్చాడు పి బి శ్రీనివాస్, జానకి, రాణి, రాఘవులు, బాలా త్రిపురసుందరి, కామేశ్వరరావులు హాయిగా పాడారు

మూడు రోజులలో ఈ పాట చిత్రీకరణ పూండిలో పూర్తయింది ఔట్‌డోర్ షూటింగ్ అంటే సూర్యభగవానుని కరుణా కటాక్షాలపై ఆధారపడి ఉంటుంది పద్మశ్రీ సంస్థవారు ఏరోజు కారోజు మదరాసులోనే నటవర్గానికి మేకప్‌లు పూర్తిచేయించి వారందర్నీ (పెద్ద తారలు మినహా) టి వి ఎస్ సంస్థవారి లగ్జూరియస్ కోచ్‌లో తెల్లవారుజామునే పూండికి పంపించే ఏర్పాటు చేశారు సాయంకాలం షూటింగు ముగియగానే ఆ కోచ్‌లో నాట్య బృందం అంతా తిరిగి చెన్నపురికి ప్రయాణం అయ్యేది ఆ కోచ్‌లో (టూరిస్ట్ బస్) టి వి ఎస్ వారు హంసతూలికా తల్పం లాంటి సీట్లను, పంకాలను అంతేకాక ఒక రేడియోను కూడా ఏర్పాటు చేశారు రేడియోలోని పాట వినగానే కోచ్ ప్రయాణీకులంతా నృత్యంలో ప్రావీణ్యం ఉన్నవారు కనుక ఆట ప్రారంభించేవారు షూటింగు మాత్రమే కాకుండా వారి "జర్నీ" కూడా జాలీడే"గా ఉంది నేను కూడా ఈ కోచ్‌లోనే జాలీగా తిరిగి వచ్చాను

"సిరిసంపదలు" లో గుమ్మడి కూడా నటించాడు ఈ పూండిలో చిత్రీకరింపబడిన సన్నివేశంలో ఆ పాత్ర పాల్గొనదు కాని, జాలీగా సాగుతున్న ఈ లొకేషన్ షూటింగ్‌ను సందర్శించడానికి ఆయన కూడా నేను వెళ్లిన రోజునే అక్కడకు వచ్చాడు ఆ ఒక్క రోజూ ఆయనకు తీరిక కలిగి నందువల్ల ఆ హాలీడేని జాలీడేగా చేసుకున్నాడు

వెండితెరపై ఈ జాలీడేని సృష్టించటానికి జరిగిన యీ కార్యక్రమ నిర్వహణకు నిర్మాతకు అధమం పాతికవేల రూపాయలు ఖర్చయిఉంటుంది ఐతేనేం ? నాలుగు నిమిషాలపాటు ప్రేక్షకుణ్ణి ఈ ఆటపాటలతో పరవశుణ్ణి చేయటంలో నిర్మాత విజయు డయాడని నాతోబాటు మీరూ అంగీకరిస్తారు. ★

# సోనియా

8-వ పేజీ తరువాయి

రేడియోదగ్గర్నుంచి యువతలకి "టా" అని కసిరారు నాకు భయమేసింది గబగబ వెళ్లి అమ్మ పక్కన పడుకుని కళ్లు మూసేసుకున్నాను అమ్మ నవ్వింది అప్పుడు నాన్నగారుకూడ నవ్వేసి వెళ్లి రేడియో తిప్పారు నేను తిప్పితే తిడతారు నాన్నగారేమో తిప్పచ్చా! ఇంతలో ఏదో అరుపు వినబడింది. కొంచెం ఆగి మళ్లీ వినపడింది ఏదో ఏడుస్తున్నట్లు నేను అమ్మవైపు చూసాను అమ్మ నాన్నగారివైపు చూసింది నాన్నగారు రేడియో ఆపేసి వెళ్లి తలుపుతీశారు నాకు భయమేసి అమ్మని గట్టిగా పట్టుకున్నాను తెల్లగా, నల్లగా ఉన్న చిన్నపిల్లి గబగబా లోపలికి వచ్చింది దూరాన కుక్కల అరుపులు వినబడ్డాయి "పాపం కుక్కలు తరుముతున్నాయిలా ఉంది అందుకనే ఇది యిలాగ పరిగెత్తుకువచ్చింది" అంటూ నాన్నగారు తలుపు వేసేశారు దాన్ని ఎత్తుకుని లోపలికి తీసుకవచ్చారు దానికి కొన్ని దెబ్బలున్నాయి. నాన్నగారు దెబ్బలకి మందురాసి ఒళ్లంతా దువ్వారు అమ్మ ప్లేటులో పాలు పోసి దానిముందుంచింది పిల్లిపిల్ల పాలన్నీ తాగేసి నాలికతో మూతి తుడుచుకుంది చాల బావుందిరా ఆ పిల్లిపిల్ల తెల్లటి ఒళ్లు అక్కడక్కడ నల్లటి మచ్చలు కళ్లు మెరుస్తున్నాయి తోక చుట్టుకుంటోంది నాకూ దానిని ముట్టుకోవాలనుంది కాని అది ఏమన్నా చేస్తుందేమో అని భయంగా ఉంది "బాబ్జీ, పిల్లిపిల్ల ఎంత ముద్దొస్తూందో చూసావా! మనం పెంచుకుందామా దీనిని" అంది అమ్మ "ఓ" అన్నాను యింకా అమ్మవెనకాల నుంచుని "భయంలేదురా. అదేం చెయ్యదు" అంటూ నా చెయ్యి పట్టుకుని నా చేత్తో దాన్ని దువ్వింది. అది కళ్లు మెల్లిగా మూసుకుంటూ "మ్యావ్" అంది ఇంక నాకు భయం తగ్గిపోయింది దానిని ఎత్తుకున్నాను, ముద్దుపెట్టుకున్నాను ఆరాత్రి అది నా పక్కమీదే పడుకుంది చలేస్తుందని దానికి కూడ కప్పాను.

మర్నాటి నుంచీ నాకూ, దానికీ బాగా స్నేహమయింది అస్తమానం అదీ, నేనూ కలిసే ఉండే వాళ్లం. పొద్దున్నే నాతోబాటు దానినీ లేపేవాడిని నాన్నగారు దానికి "సోనియా" అని పేరు పెట్టారు నేనూ, సోనియా ఒక్కసారే పాలు తాగేవాళ్లం నేను అన్నం తినేటప్పుడే అమ్మ దానికి కూడ దాని ప్లేటు పెట్టి అన్నం పెట్టేది నేను బిస్కట్లు, చాకలేట్లు తింటే దానికి కూడ పెట్టేవాడిని. ఎప్పుడైనా సోనియాకి పెట్టకుండా ఏమైనా తింటే తల పైకెత్తి 'మ్యావ్' అనేది నా బంతి తోటే మే మిద్దరం ఆడుకునే వాళ్లం ఎప్పుడైనా నేను దాని తోక గిల్లితే సోనియాకి కోపం వచ్చేది తోక చుట్టుకుంటూ అమ్మ దగ్గరికి వెళ్లేది నామీద చాడీ చెప్పడానికి అప్పుడు అమ్మ దాన్ని ఎత్తుకుని ముద్దుపెట్టుకునేసరికి దాని కోపం పోయేది మళ్లీ నా దగ్గరికి వచ్చేసేది రాత్రిళ్లు అదీ, నేనూ ఒక పక్కమీదే పడుకునే వాళ్లం. అమ్మ ఎప్పుడేనా తనదగ్గర తీసుకెళ్లి పడుకోబెట్టుకున్నా రాత్రి ఎప్పుడో నా దగ్గరికి వచ్చేసేది

మేము సినిమాకన్నా, ఎక్కడికైనా వెళ్లేటప్పుడు సోనియాని ఇంటిదగ్గరే ఉంచి వెళ్ళేవాళ్లం తిరిగి వచ్చేటప్పటికి దానికి కోపం వచ్చి ఉంటుందని నేను అనుకునేవాడిని. కాని సోనియా మమ్మల్ని చూడగానే అరుస్తూ చుట్టు తిరుగుతూ కాళ్లమీద కెక్కేది. అంటే తనని ఎత్తుకుని ముద్దుపెట్టుకోమని అర్థం ఇలాగే మేమిద్దరం అస్తమానం కలిసి ఆడుకుంటుండే వాళ్లం

ఓసారి మేము పండక్కి మా తాతగారి ఊరు వెళ్లాల్సి వచ్చింది పండక్కి రమ్మని రాశారుట మా తాతగారు రాజోలులో తాతగారి ఊరు ఏ పండక్కి అంటే సంకురాత్రికి పరే సోనియాని ఏం చేయడం అనుకున్నారు అమ్మా, నాన్నగారూ.

---

"పిచ్చ ఆస్పత్రినుంచి వచ్చిం తరువాత నేనెంత బాగుపడ్డానో చూశావా?" ఒక పెద్దమనిషి తన భార్యకు చెబుతున్నాడు. "సంవత్సరం క్రితం టెలిఫోన్ మ్రోగితే నేను అందుకుని సమాధానం చెప్పే వాణ్ణే కాను. ఇప్పుడు చూడు టెలిఫోన్ మ్రోగినా, మ్రోగక పోయినా టెలిఫోను అందుకుని సమాధానాలు చెబుతున్నాను!"

సి. కన్నయ్య (నెల్లూరు)

---

"తీసుక వెడదాం మనతో సోనియా లేకపోతే నేను ఎవరితో ఆడుకుంటాను ?" అన్నాను నేను "కానండీ, లేకపోతే వీడు సోనియాకోసం బెంగ పెట్టుకుంటాడేమో పదిహేను రోజులదాకా రాముగా" అంది అమ్మ కాని నాన్నగారు ఒప్పుకోలేదు ఎందుకంటే తాతగారికి పిల్లులు, కుక్కలు అంటే యిష్టం లేదుట పరే, యింకేం చేస్తాం! పక్కింటి పిన్నిగారికి సోనియాకి కాస్త పాలు, అన్నం పెట్టండని చెప్పి సోనియాని ముద్దుపెట్టుకుని వాళ్లింట్లో వదిలి దానికి తెలియకుండా మేము వచ్చేసాం రైల్లో కూర్చుని వెళ్లిపోయే చెట్లూ, కొండలూ చూస్తూ నేను సోనియాని మర్చిపోయాను తాతగారి ఊరు చేరుకున్నాం. అక్కడ అత్తలు, బాబాయిలూ, తాతగారు, మామ్మ చాలామంది ఉన్నారు. అందరూ నన్ను ఎత్తుకుని ముద్దుపెట్టేసుకున్నారు. నేను అమ్మ వెనకాల వెళ్లి నుంచున్నాను అక్కడ నా అంత పిల్లలు నలుగురు ఉన్నారు వాళ్లందరి ముందూ నన్ను అలా ముద్దుపెట్టుకుంటే నాకు సిగ్గేసింది వాళ్లు నవ్వారు వాళ్ల పేర్లు తర్వాత తెలిసాయి ఇద్దరబ్బాయిలూ, యిద్దరమ్మాయిలూ — రవి, బాబ్జీ, పాప్లీ, సరూ వీళ్లు మా అత్తల పిల్లలుట

తర్వాత నేను వీళ్లతో జట్టు కలిసాను. రైలుబండి ఆట, ముట్టించుకునే ఆట ఆడుకునే వాళ్లం. మా పెద్దత్త ప్రతిరాత్రి మా అందరికీ రాజకుమారుడు, రాక్షసుడు కథలు చెప్పేది. తాతగారు పగలు మాకు చాకలేట్లు పెట్టి కబుర్లు చెప్పేవారు ఇలాగ నేను సోనియాని చాల వరకు మర్చిపోయాను అమ్మా, నాన్నగారూ "సోనియా, ఎలాగుందో !" అనుకునేవారు. అప్పుడు నాకూ జ్ఞాపకంవచ్చేది నేను కూడ రవి వాళ్లకి సోనియా గురించి చెప్పేవాడిని సోనియాని యిక్కడికి తీసుకొచ్చివుంటే వీళ్లందరికీ చూపించివుండేవాడిని. సోనియా నా దగ్గరే ఉండేది. ఎవరిదగ్గరికీ వెళ్లేదికాదు అప్పుడు నాకెంత గొప్పగా ఉండేది! రవి, సరు అందరూ తను చెప్పినట్లు విని సోనియాని ఎత్తుకోనిమ్మని అడిగేవారు వాళ్లని ఏడిపించి చివరికి తను సోనియాని యిచ్చివుండేవాడు సరు తన పాపాయి బొమ్మని ఎత్తుకుందికి ఇవ్వదుగా! అప్పుడు తను సోనియాని ఇచ్చేవాడు కాదు భలేగా ఉండేది. బొమ్మైతే నడవలేదు మాట్లాడలేదు తన సోనియా నడవగలదు. ఎంచక్కా మ్యావ్ అనగలదు మళ్లీ బిస్కట్లు అవీ తినగలదు అసలు తీసుకొచ్చుంటే తాతగారుకూడ ఏమి అనరు. మొన్నను అడిగానుగా "తాతగారూ మీకు పిల్లులంటే, కుక్కలంటే ఇష్టం లేదాండీ" అని. ఆయన నవ్వి "మునుపు మేం పెంచుకునేవాళ్లం కుక్కని ఎందుకు అలా అడిగావు ?" అన్నారు. అసలు నాన్నగారి కేం తెలియదు సోనియాని తీసుకొచ్చుంటేనే బాగుండేది పాపం, యిప్పుడు దానికి అన్నం, పాలు పెడుతున్నారో లేదో పక్కింటివాళ్లు అయినా బిస్కట్లు ఎవరు పెడతారు యిప్పుడు ? దానితో బంతాట ఎవరు ఆడతారు పాపం!

ఓరోజు మేం మా మునుపు ఊరికి వెళ్లిపోవడానికి బయలుదేరాం అప్పుడు తాతగారు, మామ్మ, అత్తలు, బాబాయిలు అందరూ బొమ్మలూ, రూపాయిలూ, బిస్కట్లూ ఇచ్చారు. అందులో పెద్దత్త యిచ్చిన పిల్లిబొమ్మా, చిన్నత్త యిచ్చిన పాపాయిబొమ్మ సోనియాకి చూపించాలి. తర్వాత మే మిద్దరం దానితో ఆడుకోవచ్చు

మర్నాడు పొద్దున్నకి యింటికి చేరుకున్నాం ఇంటిముందు పడుకొని ఉంది సోనియా అంత దూరాన ఉండగానే పరిగెత్తుక వచ్చేది మునుపు. ఇప్పుడు బాగ కోపం వచ్చిఉంటుంది అన్ని రోజులు వదిలిపెట్టి వెళ్లామని అనుకుంటూ దగ్గరగా వెళ్లాను. "సోనియా" అన్నాను గబుక్కున కళ్లు తెరిచింది దాని కళ్లు మెరిసాయి. నీరసంగా "మ్యావ్" అంది, నేను దానిని ఎత్తు

## సోనియా

కుని ఇంట్లోకి తీసుకెళ్లి సోఫాలో పడుకోబెట్టాను. నాన్నగారు జవానుని పంపించి పాలు తెప్పించారు. అమ్మ సోనియా ప్లేటులోనే పాలు పోసి పెట్టింది. పాలు తాగి ఎన్ని రోజులో అయినట్లు, పోసిన పాలన్నీ తాగేసింది. తర్వాత ఓ అర గంటకి తాగిన పాలు కక్కేసింది. నా బొమ్మలూ, చాకిలేట్లు చూపిద్దా మనుకున్నాను. కాని అమ్మ యిప్పుడు వద్దంది. సోనియాకి జ్వరం వచ్చిందట. తగ్గాక చూపించమంది. ఆ రోజంతా అలాగే పడుకునుంది, సోనియా. "ఇన్ని రోజులూ ఎవ్వరూ పాలూ పొయ్యలేదు. అన్నమూ పెట్టలేదు. అన్ని రోజుల తర్వాత యివాళ పాలు తాగేసరికి కక్కుకుంది. ఇవాళ అన్నం పెట్టకు. పాలే పొయ్యి" అన్నారు నాన్నగారు. అమ్మ పాలే పెట్టింది సోనియా ముందర. కాని సోనియా ముట్టుకోనైనా లేదు పాలని. బలవంతంగా తాగించా లనుకున్నా. అది తాగలేదు. రాత్రి కూడా అది కొంచెం కూడ పాలు తాగలేదు. దానిని రాత్రికి సోఫాలోనే పడుకోనిమ్మంది అమ్మ.

పొద్దున్న కాలికి ఏదో మెత్తగా తగిలింది. లేచి చూశాను. సోనియా నా కాళ్లదగ్గర వచ్చి పడుకునుంది. మునుపటిలాగ నా దగ్గరికివచ్చి పడుకుంది కనుక జ్వరం తగ్గిపోయుంటుందనుకున్నాను. అమ్మనిపిలిచాను సోనియాకి జ్వరంతగ్గిపోయిందంటూ. లోపల కాఫీ చేస్తున్న అమ్మ పరుగెత్తుక వచ్చింది. "సోనియా" అంటూ దువ్వింది. సోనియా కళ్లు తెరవలేదు. ఇష్టం లేకపోతే ఒక్కసారి కళ్లు తెరచి కోపంగా మూలిగేది. అలా కూడా చేయలేదు. అమ్మ సోనియాని కుదిపి చూసింది. అయినా లేవలేదు. అమ్మ నాన్నగార్ని పిలిచింది. నాన్నగారు వచ్చి అటూ, యిటూ కదిపి చూశారు, సోనియాని. ఎటు తిప్పితే అటు ఉండిపోయింది. మొహం చేతులతో కప్పేసుకుంటూ "చచ్చిపోయింది సోనియా" అన్నారు. నాకేం అర్థమవలేదు. "అమ్మా, సోనియాకి కోపం వచ్చిందేమో, మనం యింతకాలం వదలిపెట్టి వెళ్లామని" అన్నాను. "అవునురా బాబ్జీ. మనమీద కోపంవచ్చి మనల్ని శాశ్వతంగా వదలి వెళ్లిపోయింది." అంది అమ్మ ఏడుస్తూ. "సోనియాని మనమే చంపేశాం. మనం సంక్రాంతికి అక్కడకు వెళ్లకపోయినా, లేదా మనం దానిని కూడ తీసుకవెళ్లినా సోనియా చనిపోయేది కాదు. పోషణలేక చనిపోయింది" అన్నారు నాన్నగారు. తర్వాత మా జవాను సోనియాని ఎక్కడికో తీసుకోపోయాడు. చచ్చిపోవడం అంటే ఏమిటో నాకు తెలియదు. కాని సోనియా లేకపోతే నాకేం తోచేదికాదు. సోనియా మళ్లీ మా యింటికి రాలేదు. సోనియాని తల్చుకుంటే ఏడుపు వచ్చేది. ఏ పిల్లి కనిపించినా సోనియా జ్ఞాపకం వచ్చేది. ఏ పిల్లి అయినా కనబడితే చాకలేటు యిద్దామని పిలుస్తేనే అది పారిపోతుంది. ఇంక నేను ఎవరికి చాకలేట్లు పెట్టను ? ఎవరితో ఆడుకోను. సోనియాలాంటి మంచిపిల్లి యింక లేదు.



# మనమూ-మనదేహస్థితి

15వ పేజీ తరువాయి

ఆక్సిజన్ (Oxygen) సంపర్కంవల్లా, కొన్ని ఎంజయములు ప్రభావం వల్లా కొవ్వులు జీర్ణంకాగా తయారయిన 'ఫేటీ ఏసిడ్లు' ఎసిటిక్ ఏసిడ్‌గా మారిపోతవి ఈ పని శరీర ధాతువులన్నింటిలోనూ జరుగుతున్నా నూటికి 90 పాళ్లు ఫేటీ ఏసిడ్లు 'ఏసెటిక్ ఏసిడ్' (Acitic acid) గా మారడం లివరులోనే జరుగుతుంది కొవ్వు డిపోలలో నిలవ వున్న కొవ్వు కణములు, లివరులో మళ్లీ ఫేటీ ఏసిడ్లుగానూ, గ్లిసరాల్ గానూ మారిపోతవి ఫేటీ ఏసిడ్లు దహన మైనప్పుడు ఏసెటిక్ ఏసిడ్‌గా మారుతుంది ఏసెటిక్ ఏసిడ్ దహన మైనప్పుడు, శక్తీ, నీరూ, కార్బన్ డయాక్సైడ్ తయారవుతుంది అంటే కొవ్వు, కొవ్వు కణములుగా శరీరంలో వినియోగం కాదు. లివరు వాటిని ఏసెటిక్ ఏసిడ్‌గా మారిస్తేనే కొవ్వులు శరీరంలో 'శక్తి' గా మారిపోతవన్న మాట లివరులో జరిగే రసాయనిక వికృతులు అతి సంక్లిష్టము లయినవి వాటిని అర్థం చేసుకోడం కష్టం కూడా కాని స్థూల్యమూ, మధుమేహమూ, హృద్రోగమూ అనాటి కానాడు అధికమైపోతున్న యీ కాలంలో ఆ రోగ కారణములనూ ఆహారమునకూ, ఆ రోగములకూ ఉన్న సంబంధమును అర్థం చేసుకోవాలంటే, జీర్ణకోశంలో జరిగే వివిధ రసాయనిక వికృతులను అర్థంచేసుకుని తీరాలి

ఫేటీ ఏసిడ్లనుండి తయారయిన ఏసిటిక్ ఏసిడ్ అంతా నేరుగా దహింపబడదు అందులో కొన్ని కణములు కలిసి 'కీటోనులు' (Ketones) అనే వస్తువులుగా మారిపోతవి మధుమేహం ముదిరిపోయినవారి మూత్రంలో ఏసిటోన్ (Acione) అనే పదార్థం తరుచూ ఏర్పడుతూ ఉంటుంది కీటోనులు చాలా రకములు అందులో ఏసిటోన్ ఒకటి

ఈ 'కీటోనులు' కూడా, ఏసెటిక్ ఏసిడ్ లాగే శరీరంలో దహింపబడి శక్తినిస్తవి. వీటి ఉత్పత్తి కూడా లివరులోనే జరుగుతుంది ఏ కారణంచేత, ఎందు కీ కీటోనులను లివరు తయారు చేస్తుందో ఇంకా నిర్ణయం కాలేదు శరీరం పరిపూర్ణారోగ్యంలో ఉన్నప్పుడు, ఇవీ పూర్తిగానే దహింపబడి శక్తి నిస్తవి కాని, మధుమేహం వంటి పరిస్థితులలోనూ, లివరు పూర్తిగా వ్యాధిగ్రస్తమయినప్పుడూ ఈ కీటోనులు శరీరంలో వినియోగింపబడక కీటోనులు మూత్రంలో బయటికి పోతవి 'ఏసిటోన్' ఒకరకమయిన వాసన గల వస్తువు అవి పెట్రోలులా తేలికగా ఆవిరి అయిపోయే వస్తువు అందువల్ల, ఈ వస్తువు మూత్రం ద్వారా పోతున్నప్పుడు, మూత్రం ఒక రకమయిన వాసన కొడుతుంది అల్లాగే ఏసిటిక్ ఏసిడ్‌కూ ఒక రకమయిన వాసన ఉన్నది అది ఏసిటోన్ వాసన వంటిది కాదు ఏసెటిక్ ఏసిడ్ వాసన ఘాటుగా, దుర్భరంగా ఉంటుంది మూత్రం మామూలుగా ఉండకుండా కొత్త వాసన కొట్టడం ఆరంభం కాగానే వెంటనే సమర్థుడయిన వైద్యుణ్ణి సంప్రదించడం, పానుపోను అనివార్యములయిన అనేక అనర్థాలను నివారించుకుంటానికి తోడుపడుతుంది.

లివరులో అనేక కీటోనులు తయారవుతవి. కాని వాటి నన్నిటినీ దహించే శక్తి గానీ, అందు కవసరములయిన ఎంజయిములు గానీ లివరులో లేవు. అందువల్ల కీటోనులు రక్తంలో ప్రవేశించి శరీరభాగములలో వివిధ ధాతువులచేత దహింపబడతవి.

కొన్ని సందర్భములలో ఈ కీటోనులు పూర్తిగా దహింపబడక 'కీటోసిస్' (Ketosis) అనే రోగస్థితి ఏర్పడుతుంది సాధారణంగా శరీరంలో తగినంతగా చక్కెరలు లేనప్పుడో, ఉన్నా ఇన్సులిన్ లోపమువలన అవి దహింపబడక, శరీరానికి కావలసిన శక్తి, కొవ్వుల నుండి, ప్రోటీనుల నుండి రావలసి వచ్చినప్పుడో, 'కీటోసిస్' అనే రోగస్థితి ఏర్పడుతుంది మధుమేహము, దీర్ఘమైన నిరశన స్థితి ఇటువంటి స్థితులు ఇందువల్ల రక్తంలో క్షారగుణం (Alkalainity) మారి ఆమ్లగుణం (Acidity) ఏర్పడుతుంది ఇందువల్ల, మెదడు చెడి, దీర్ఘమైన అపస్మారమూ, చివరకు మరణమూ సంభవిస్తవి నిత్యమూ తినుకునే భోజనంలో పిండి పదార్థములు—తేలికగా జీర్ణమయ్యే పిండి పదార్థములు విరివిగా ఉండడం ఎంత అవసరమో పై విషయములు నిరూపిస్తవి.

పైన వివరించిన విధులే కాక, లివరు, కొవ్వులనూ, భాస్వరమునూ కలిపి "ఫాస్ఫొలైపిడ్సు" అనే రసాయనిక వస్తువులను తయారు చేస్తుంది. ఆ వస్తువులు ఆరోగ్యరీత్యా అతిముఖ్యములు. 'కొలెస్టరాలు' ఒక రకమయిన ఫాస్ఫొలైపిడ్. ఆ విషయం వచ్చేవారం చర్చిస్తాను ★

---

# మనమూ-మనరాష్ట్రం

13-వ పేజీ తరువాయి

ఆదినుంచీ కాంగ్రెసులో ఉన్నవారికి, టిక్కట్లివ్వకుండా, మూక ఉమ్మడిగా వెలివేసి ఎక్కువమంది స్వతంత్రులు నెగ్గడానికి చేయూతయిచ్చారు. ఇప్పుడిక పార్టీ నాయకు డెవరు అన్న సమస్యపై ముఠాపడి అసలు తగాదా లేవనెత్తి బలాబలాలు పరీక్షించుకునే అవకాశం లేకపోలేదు అయితే యీసారి ముఖ్యంగా రాయలసీమ, తెలంగాణాలలో ఉభయ వర్గాలలోనూ స్థానికంగా బలంగల నాయకులు ఓడిపోవడంవల్ల, రాష్ట్ర నాయకత్వం కోసం ప్రాకులాడే రాయలసీమ నాయకులు, రాజీగా పోతారో, లేక ఎప్పటివలె పోటీకి సిద్ధ మవుతారో ముందు ముందు గాని తెలియదు

ప్రతిపక్షాలలో, అంతా అనుకున్నట్లు, కమ్యూనిస్టులదే పైచేయి అంది -పూర్వం శాసనసభలో వీరి సంఖ్య 35 కాగా ఈసారి 51 అయింది పైగా కమ్యూనిస్టుల మద్దతుతో గెల్చి కమ్యూనిస్టులకు అనుకూలంగా పోయే వారి సంఖ్య 10, 12 వరకూ ఉంది వీరిని కూడా కలుపుకుంటే కమ్యూనిస్టుల బలం 60 కి పైగానే ఉందని చెప్పవచ్చు అయితే తమకు తప్పకుండా వస్తాయనుకున్న కంకిపాడు, ఉయ్యూరు, సిరిసిల్ల స్థానాలు కమ్యూనిస్టులు పోగొట్టుకోడం విశేషం ఈ స్థానాలు కాంగ్రెస్‌వారు కూడా తమకు దక్కుతాయనుకోలేదు ముఖ్యంగా తెలంగాణలో ప్రముఖుడైన బద్దం యల్లారెడ్డి ఘోరపరాజయం (డిపాజిట్ కూడా దక్కలేదు) వీరికి పెద్ద దెబ్బ

ఆంధ్ర ప్రాంతంలో కమ్యూనిస్టులకు ఎక్కువ స్థానాలు (10) గుంటూరులోనే వచ్చాయి విశాఖ పశ్చిమ గోదావరి, రాయలసీమ జిల్లాలలో కూడా తగినన్ని సీట్లు గెలవడం గమనార్హం కృష్ణాలో 6 గెల్చుకొన్నారు వీటిల్లో చాలా భాగం ముక్కోణపు పోటీలలో వచ్చినవే

తెలంగాణాలో వీరికి ఒక మూడు సీట్లు తగ్గినా మొత్తం మీద బలమేమీ తగ్గలేదు. నల్గొండ స్థానం పోగొట్టుకున్నా జిల్లాలో 9 స్థానాలు నిలబెట్టుకున్నారు ఖమ్మంలో 5 స్థానాలకు నెగ్గారు ఇలా మొత్తం 136 స్థానాలకు పోటీ చేసి 51 స్థానాలు గెలిచారంటే, కమ్యూనిస్టుల బలాన్నిగురించి కాంగ్రెస్‌వారికి ఉన్న తప్పుడు అంచనాలు సవరించుకోడం చాలా అవసరం భారత చైనాల సరిహద్దు తగాదాగాని, కమ్యూనిస్టుపార్టీలోగల అంతఃకలహాలుగాని, ఎన్నికలలో ఆ పార్టీని ఏమాత్రం దెబ్బతీయలేదు కమ్యూనిస్టులను గురించి, కాంగ్రెస్ నాయకుల ప్రచారం కమ్యూనిస్టు పార్టీకి అండగా ఉన్న కార్మిక, కర్షక జనంలోకి ఎక్కలేదని తేలిపోయింది

ఈ ఎన్నికలలో విపరీతంగా దెబ్బతినిపోయినది స్వతంత్రపార్టీ ఈ పార్టీ పైకి వచ్చి, కాంగ్రెసుకు బలమైన ప్రతిపక్షంగా నిలుస్తుందని పలువురు ఆశించారు ఆ యాశలన్నీ అడియాసలైనాయి. 140 స్థానాలకు పోటీచేసి 19 స్థానాలు గెల్చుకుందంటే, పార్టీ బలం 'కరి మింగిన' వెలగపండు అని తేలిపోయింది. ఈ పార్టీకి శ్రీకాకుళం, విశాఖ, గుంటూరు, చిత్తూరు జిల్లాలలో బలం ఉందనుకున్నారు కాని ఉభయ విశాఖలలో అధమం పన్నెండు స్థానాలైనా వస్తాయనుకొంటే ఐదుకు మించి రాలేదు. గుంటూరు, నెల్లూరు జిల్లాలలో నామరూపాలు లేకపోయింది పైగా ఆ ఖా స్వతంత్రపార్టీ అధ్యక్షులు, రాష్ట్ర పార్టీ అధ్యక్షులు, రాష్ట్ర పార్టీ కార్యదర్శి ఇలా అగ్రనాయకులంతా పరాభూతు లవడంబట్టి ఈ పార్టీకి ప్రజలలో బలం లేదని, కేవలం నాయకుల పార్టీఅని నిరూపితమైంది.

ఈ 19 స్థానాలైనా వచ్చాయంటే, అది స్థానిక నాయకుల పలుకుబడి చలవేగాని, పార్టీ ప్రతిష్టవల్ల కాదు కాంగ్రెసుకు ఇప్పుడు ప్రతిపక్షం కమ్యూనిస్టు పార్టీ కావలసిన దుర్గతి ప్రజలకు పట్టింది నిజంగా స్వతంత్రపార్టీ బలమైన ప్రతిపక్షంగా తయారవాలంటే, ఈ ఎన్నికల గుణపాఠాన్ని నేర్చుకుని, ఈ కాలానికి సరిపడే సరియైన కార్యక్రమంతో, పురోభివృద్ధి దృక్పథంతో ముందుకు రావాలి స్వార్థప్రయోజనాల కోసం నాయకత్వం చలాయించడం కోసం పార్టీలు మారే వారిని పార్టీలు పెట్టేవారిని బయటికి తరిమి, యువనాయకత్వంతో అట్టడుగునుంచి సంస్కరిస్తే గాని ఈ పార్టీకి మోక్షం లేదు

ప్రతిపక్షాలలో కమ్యూనిస్టు, స్వతంత్ర తప్ప మిగతావన్నీ, ఎన్నికల మహా వెల్లువలో పూర్తిగా

అందరికీ విశ్వాసపాత్రములు

పిల్లలకు

కాస్మస్
కస్తూరి మాత్రలు

జంబిస్
జీర్ణకారి

కరిజన
గోరోజన మాత్రలు

బాలకస్
విరేచన మాత్రలు

నీలా (హెయిర్ ఆయిల్) తీవ్రమైన కేశముల సంరక్షణి

సాధారణము సాకెట్లు

సోల్ ఏజంట్లు: యునైటెడ్ కమ్మర్స్, మదరాసు, హైదరాబాద్, విజయవాడ

జక జక గూడు ఔషధములకు ఒక టవునుకు ఒక స్టాకిస్టును ఆహ్వానించెదము.

---

మ ధు మూ ర్తి క థ ల సం పు టి

# సా పా సా

అతి త్వరలో ప్రచురింపబడుతోంది

విడిప్రతి రు. 1-50. పోస్టేజి 50 న.పైలు

ఏజెంట్లకు 25% కమిషన్. ఆరు ప్రతులకంటె ఎక్కువ ఆర్డరు పంపే ఏజెంట్లుకే కమిషన్ యివ్వబడును.

ప్రతులకు:

మధుమూర్తి, 5, షరీఫుద్దీన్ వీధి, చూళమేడు మదరాసు-24కు వ్రాయాలి

NVKR

---

కుష్టు సమస్త మహా వ్యాధులకు

బొల్లి

మొదటి నెలలో
40% నివారణ!!!
10% నివారణ!!

మా లెప్సీన్ అమోఘ ఔషధము!!!

వివరములకు గ్రంధే రఘురామ గుప్త

అమర జ్యోతి ప్రొడక్ట్సు మార్కాపురం కర్నూలు జిల్లా

---

ఋతుక్రమం ఆలస్యమైతే?

విచారపడవద్దు ప్రఖ్యాతిగాంచిన

దేవి పిల్సు వాడండి

దేవి పిల్సు ముఖ్యంగా ఆలస్యమైన క్రమంగాకాక పోయిన, బాధతోగూడిన లేక ఆగిపోయిన బహిష్టుకు దేవి పిల్సు బాగుగ గుణం ఇచ్చును

DEVI Pills

INDICATED IN DELAYED SCANTY PAINFUL ARRESTED MENSES

SEENU & Co.

MFRS SEENU & CO MADRAS-21

SELLING AGENTS: DEVI AGENCIES 28 THANDAVARAYA GRAMANI ST MADRAS 21

స్టాకిస్టులు: మెసర్సు. దాదా & కో, హైదరాబాదు-1

---

'ఆంధ్రసచిత్రవారపత్రిక'లో

ప్రకటనలు మీవ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి.

---

# తరచుగా మూత్రవిసర్జన

చక్కెరతోగాని, చక్కెర లేకుండగాని తరచుగా మూత్రము వెలువడుట మిక్కిలి ప్రమాదకరమైన చిహ్నము శరీరాన్ని గుల్ల చేయడమే కాకుండా ఈ వ్యాధి, తన బంధంలో చిక్కినవారిని ఆరోజాకారోజా మృత్యువుకు ఆసన్నుగా చేయును ప్రథమదశలో శారీరక, మానసిక శ్రమలకు యిచ్చగించకుండుట, నడుములో నొప్పి, చూపుమాంద్యము, తొడల్లో తిమ్మిరి, నరముల బలహీనతతో ఈ వ్యాధి పొడచూపును. పై లక్షణములతో కూడిన వ్యాధికి వెంటనే తగిన చికిత్స చేయించకున్నచో, అధికదాహం, ఆకలి, గొంతు నోరు యెండుట, దురదలు, కాళ్ళలో వగుళ్ళు, తూకం తగ్గడం, శరీరమంతా పొట్లు, కీళ్ళనొప్పులు, కంటిపొరలు, క్షయ, గడ్డలు, రాచపుండ్లు, ఇట్టి భయంకర బాధాకరమైన వ్యాధులు యేన్నో సంభవింపవచ్చును

"పినస్ ఛారమ్" మాత్రలు వాడి అనేక వేల మంది తమ బాధలనుండి నివారణపొంది మృత్యు కరాళమునుండి రక్షింపబడిరి. "పినస్ ఛారమ్" శాస్త్రీయ పద్ధతులమీద ప్రాచీన యూనాని వైద్య విధానం ప్రకారం అమూల్య ఔషధుల కాకపదార్థముల, స్వాభావిక క్షారముల సారముతో తయారైనవి "అమిత దాహము, మూత్రంలో చక్కెర తగ్గి పలుమారు మూత్ర విసర్జనచేయు అవసరము 2 లేక 3 రోజులలోనే మీకు చాలా భాగము నివారణ యగును కొద్దిరోజులలోనే మీకు పగానికిపైగా స్వస్థత చేకూరినట్లనిపించును. "పినస్ ఛారమ్" కొద్ది వ్యయముతో సుఖముగా, తేలికగా సేవించవచ్చును దీనికి ప్రత్యేక పథ్యములేదు నిరాహారముతోనుండే అవసరంలేదు రోగులు పుష్టికరమైన ఆహారము తినేందుకై ఇదివరకటికంటే ఎక్కువ రకాల ఆహార పదార్థములు తీసికొనవచ్చును వివరములుగల ఇంగ్లీషు కరపత్రములు అడిగినవారికి ఉచితముగా పంపబడును 50 బిళ్ళల ఖరీదు రు. 6-75 న పై మాత్రమే. పోస్టేజి నిమిత్తం రు. 1-6 న పై అదనం (ఒకేసారి రెండు, అంతకుపైగా సీసాలను తీసికొన్నచో పోస్టేజి ఉచితం)

(SELLING AGENTS)
Barrys Commercial Corporation
(A. P. W.)
27/A, Dhurumtollah Street
CALCUTTA-13.

# మీ అందానికి మంచిదారి



మీ జీవిత విజయాలకు అందం అవసరం. ఎండవేడికి యింకా యితరకారణాలవల్ల ముఖం క్రమేపి నల్లబడి, ముదిరూపువస్తుంది. గ్లోరియా అనే ద్రవముయొక్క అద్భుతసౌందర్య పోషకశక్తి మీ ముఖంలోని అసహ్యమయిన ముదిరూపును పోగొట్టి ఆకర్షణీయమయిన లేతదనాన్ని తెస్తుంది. మీ అందం దినాదినాభివృద్ధి అవడానికి నెలకు అర్ధమం కొన్నిసార్లు అయినా గ్లోరియా అనే సౌందర్య పోషక ద్రవాన్ని వాడండి. ముఖంమీద మొటిమలను పాటి మచ్చలను, ముడతలను, నమ్మకంగా పోగొట్టి ముఖాన్ని తెలుపుచేసి, కాంతిని, అందాన్ని తెచ్చును. మొదటి పూతకే మీకు ఆశ్చర్యాన్ని కలిగించే అందాన్ని యిస్తుంది. ఒకసారి వాడి చూస్తే మీరెప్పుడూ విడువరు. అన్నిషాపులలో దొరకును.

**జనితా ప్రాడక్ట్సు - ఏలూరు. (ఆంధ్ర)**

దుర్గా షాపెప

## డాక్టర్ వృత్తి చేయండి!

ఇంటిలో విరామంగా కూర్చొని వుండేప్పుడు. పోస్టల్ ట్యూషన్ ద్వారా, హోమియోపతి చదువుకొని, గవర్నమెంటురిజిస్టర్డు కాలేజిద్వారా డిప్లొమా పొందండి. ప్రాస్పెక్టస్ ఉచితము. వివరములకు వెంటనే వ్రాయండి.

INDIAN
HOMOEOPATHIC
COLLEGE
(APW) JULLUNDUR CITY

## అందరు చెలాకైన కాలేజీ విద్యార్థులూ టినోపాల్ వాడుతున్నారు!



అవును! అందరూ టినోపాల్‌ను ఉపయోగిస్తున్నారు!

పడుచువారు సొగసుగా కనపడాలని ఉవ్విళ్లూరుతారు. దానికి వారు నిజంగా తెల్లని దుస్తులను ధరించాలి. తెల్ల దుస్తులను ఊరికే ఉతుకుతే సరిపోదు. మీరు వాటిని ఉతికిన తరువాత టినోపాల్ పెట్టి, వచ్చే మార్పును చూడండి. టినోపాల్ ఎంతో పొదుపు చేకూరుస్తుంది: ఇంటిలోనివారి బట్టలన్నిటకి కొంచెము టినోపాల్ సరిపోతుంది. నేడే టినోపాల్ కొనండి!







టినోపాల్ జె. ఆర్. గెయిగి. ఎస్. ఎ. బాల్. స్విట్జర్లెండ్ వారి రిజిస్టరు చేయబడిన ట్రేడు మార్కు

**కొంచెము టినోపాల్ తెల్లని దుస్తులను అన్నిటికన్న తెల్లగా చేయును**

తయారుచేయువారు:
సుహృద్ గెయిగి లిమిటెడ్, వాడి వాడి బరోడా

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు:
సుహృద్ గెయిగి ట్రేడింగ్ లిమిటెడ్, పి. ఓ. బాక్స్ 965, బొంబాయి 1

SISTA'S-SG-142 TEL

# న్యూఢిల్లీ లేఖ

7–వ పేజీ తరువాయి

ఉర్దూ అధికారభాష అయి కూర్చున్నది హిందీ నేర్చుకుంటేనే ప్రమోషన్‌లని వేరొకవంక కేంద్ర ప్రభుత్వోద్యోగులకు స్పష్టం చేశారు ఢిల్లీలో పారిశ్రామిక ప్రదర్శనం ఏర్పాటైంది అమెరికా సహాయంతో మూడవ పంచవర్ష ప్రణాళిక అమలు ప్రారంభమైంది గోవావిజయం వీటన్నిటికి తలమానికమైనది

ప్రతి తడవ ఎన్నికలముందు ఇలాంటి పరిస్థితులే ఏర్పడితే, ఈ దేశంలో ప్రజాస్వామ్యాన్ని రక్షించగలిగినవాడు ఆభగవంతు డొక్కడే!

*  *  *

"జపాన్ టైమ్సు" పత్రిక ప్రచురించిన ఒక ప్రముఖమైన వ్యాసంనుంచి సంగ్రహించి ఇక్కడ పొందుపరుస్తున్నాను "జపాన్—అమెరికాలవాణిజ్యం జపానీయులు ఇంగ్లీషు మాట్లాడగల గటంమీద చాలా వరకు ఆధారపడి ఉంటుందని అమెరికా సాంస్కృతిక, విద్యావ్యవహారాల సహాయ మంత్రి శ్రీ పి హెచ్ కూంబ్స్ ఇక్కడ అన్నారు కొన్ని ప్రత్యేకపరిస్థితులు దృష్ట్యా ఈఅభిప్రాయంతో ఏకీభవించక తప్పటం లేదు యదార్థానికి ప్రపంచంలో ఏదేశంతో వాణిజ్యం చేయదలచినా జపానీయులు ఇంగ్లీషు నేర్చుకోవడం అవసరమని చెప్పవచ్చు దాదాపు అన్నిదేశాలలోను ఇంగ్లీషు రెండవ భాషగా చెలామణిలో ఉండటమే ఇందుకు కారణం కనుక జపానీ విద్యార్థులు ఏదోవిధంగా కష్టపడి ఆ భాషలో ప్రావీణ్యం సంపాదిస్తే ఎక్కడికి వెళ్లినా ప్రయోజనకారిగా ఉండే పరికరాన్ని పొందామని భావించవచ్చు"

"మహా సభలో పాల్గొన్న జపానీప్రతినిధులు జపానులోని ప్రాథమిక పాఠశాలల్లో ఇంగ్లీషు బోధించటం లేదని, సెకండరీ పాఠశాలల్లో మాత్రం ఐచ్ఛికవిషయంగా ఆభాషకు స్థానం ఉన్నదని తెల్పారు కాని యథార్థానికి జూనియర్ హైస్కూల్ దశనుంచీ చాలా మంది విద్యార్థులు పట్టుదలగా కాకపోయినా, ఆభాషాధ్యయనం చేస్తూనే ఉన్నారని మానమ్మకం అయినప్పటికీ, ప్రస్తుత విధానాన్నిసవరించి, ప్రాథమిక పాఠశాలల్లోనే ఇంగ్లీషు ప్రవేశపెట్టటంఎంతైనాఅవసరం"

ఇక మనదేశంలో చూడండి 16 సంవత్సరాల పరిపాలనలో కాంగ్రెసు సాధించిన ఘనవిజయమేమంటే ఇంగ్లీషు భాషను సర్వ నాశనంచెయ్యటం తమ పట్టభద్రులు విద్యావంతులైన బ్రిటిష్ వారితో సమంగా మంచి ఇంగ్లీషు వ్రాయగలరని, మాట్లాడగలరనీ మద్రాసు, బొంబాయి రాష్ట్రాల వారు వెనుక గర్వించేవారు అయితే అది ఇప్పుడు నిజంకాదు ఆభాషాధ్యయనానికి జూనియర్ హైస్కూల్ దశలో పడవలసిన పునాదిని ఇప్పుడు నాశనం చేశారు న్యూఢిల్లీలోని ఒకకళాశాలలో 75 మంది విద్యార్థులలో ఇద్దరు మాత్రమే ఇంగ్లీషులో ఉత్తీర్ణులయ్యారు! ఈనాటి విషాద పరిస్థితి ఎలా ఉన్నదంటే ఇక్కడ విద్యార్థులకు ఇంగ్లీషు ఎంతాబాగా వచ్చునో హిందీకూడా అంతగానేవచ్చు.

*  *  *

జీవితభీమా సంస్థ 1961 సంవత్సరంలో రు 608 కోట్ల విలువగల పట్టాలు జారీచేసి, ఇంతకుముందు ఏ సంవత్సరంలోను సాధించని వ్యాపారాభివృద్ధిని సాధించింది

1960 లో ఈ సంస్థ రు 497 కోట్ల 54 లక్షల వ్యాపారం చేసింది 1961 లో చేసిన వ్యాపారం దీనికంటే 22 3% అధికమన్నమాట. ఇలాగే 1960 లో చేసిన వ్యాపారం 1959 లో చేసినదానికంటే 15% ఎక్కువ 1959 లో రు 429 కోట్ల 17 లక్షల వ్యాపారం జరిగింది.

దేశంలోని కొన్ని ప్రాంతాలలో ప్రకృతి విపర్యయాలు, కల్లోలాలు సంభవించినందువల్ల 1961 సంవత్సరం భీమా సంస్థకు గడ్డుగానే పరిణమించింది అయినప్పటికి రు 702 కోట్ల 93 లక్షల పట్టాలు కొత్తగా జారీచెయ్యాలని నిర్ణయించుకొని రు 608 కోట్ల 75 లక్షల వ్యాపారం పూర్తిచేయ గలిగింది

ఈ ఏటి వ్యాపారానికి సంబంధించిన సమగ్ర సమీక్ష వెలువడటానికి మరికొంత వ్యవధి అవసరం అయితే 1961 నవంబరు 30 వ తేదీ నాటికి జారీ అయిన 8,23,470 పట్టాలలో 5,78,897 పట్టాలు (అంటే నూటికి 70 వంతులు ) కొత్తగా భీమా చేయించుకున్న వారివే అయివుండటం ముదావహం దేశమంతటిలోను మదురై, కటక్ విభాగాలలో వీరి శాతం అత్యధికంగా ఉన్నది కోయంబత్తూరు, తిరువేంద్రం, లక్నో విభాగాలు ఆ తరువాత స్థానాలు ఆక్రమించాయి

ఇక మండలాల వారీగా చూచినా దక్షిణ మండలందే అగ్రస్థానం ఈఏడు దక్షిణ మండలంలో రు 151 కోట్ల 68 లక్షలవిలువగల పాలసీలు కొత్తగా జారీ అయ్యాయి తూర్పు మండలం ద్వితీయ స్థానం ఆక్రమించింది ఇక్కడ రు 138 కోట్ల 91 లక్షల వ్యాపారం జరిగింది

గత సంవత్సరం వ్యాపారంతో పోల్చి చూస్తే ఈ ఏడు ఉత్తర మండలంలో సాధించిన అభివృద్ధి ఇతర మండలాల్లో కంటే ఎక్కువగా ఉంది 1960 లో చేసిన వ్యాపారం కంటే ఈ మండలం ఇప్పుడు 32 1% వ్యాపారం ఎక్కువగా చేసింది కేంద్ర మండలం 24 8% అభివృద్ధి సాధించి ద్వితీయ స్థానం ఆక్రమించింది దక్షిణ మండలం 23 5%, తూర్పు మండలం 20 9%, పశ్చిమ మండలం 16 6% అభివృద్ధి చూపగలిగాయి

కలకత్తా విభాగం రు 65 కోట్ల 2 లక్షల విలువగల పట్టాలు కొత్తగా జారీచేసి దేశమంతటిలోను ప్రథమస్థానం పొందింది ఆ తరువాతి స్థానం బొంబాయి విభాగానికి లభించింది ఇక్కడ రు 58 కోట్ల 2 లక్షల కొత్త వ్యాపారం జరిగింది

దేశవ్యాప్తంగా ఇంతటి అభివృద్ధికి ప్రధాన కారణం ఈ ఏడు భీమా సంస్థ మరికొన్ని కేంద్రాలు నెలకొల్పటమే 1960 లో 387 శాఖా కార్యాలయాలు, 74 అభివృద్ధి కేంద్రాలు ఉండేవి 1961 లో శాఖా కార్యాలయాలు 440కి, అభివృద్ధి కేంద్రాలు 133 కి పెరిగాయి. ★

# యువ ప్రపంచం

## విద్యార్థులపై విమర్శలు : కొన్నిటికి సమాధానం

'పాంచజన్య, ఉత్తరమూ, దాని మీద జరిగిన విమర్శా, ప్రతివిమర్శా కూడా చదివాను. విద్యార్థులు సమ్మెలుచేసి దౌర్జన్యాలలో పాల్గొనటం చాలాగర్హనీయమైన విషయం. ప్రతివిషయంలోనూ విద్యార్థుల అనుమతి తీసుకునే పైఅధికారులు ప్రవర్తించాలంటే వీలుపడదు. [నేను చదువుకుంటున్న రోజుల్లో సున్నా మార్కులువచ్చిన ఒక విద్యార్థిని పైక్లాసుకు పంపనందున నిరాహార దీక్ష చేశాడు'] అలాగే విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనరాదనే వాదాన్ని కొంతవరకూ బలపరచవచ్చు. కాని కొంతవరకే బలపరచవచ్చు; ఏదైనా ఒకసమస్య మరీ దుర్భరమయిపోయినప్పుడు దాని పరిష్కారంకోసం, సంఘం దృష్టిని దానివైపు మరల్చే ఉద్దేశ్యంతోగాని కొద్దిగానైనా ఆందోళన కలిగించే హక్కు విద్యార్థులకు ఉంటుంది. ఉదాహరణకు, అమెరికాలో నీగ్రో పిల్లలను చేర్చుకోని స్కూళ్ళలో, కాలేజీలలో విద్యార్థులు వారిని చేర్చుకుని తీరాలంటే 'మీకీ విషయాలు తెలియ'వని వారిని అణగద్రొక్కడం తప్పేనని ఎవరైనా ఒప్పుకునితీర్తారు.

రోజుకు రెండు పరీక్షలు ఇంటర్మీడియేట్ చదివేవారే వ్రాస్తూ ఉండగా ఇప్పుడు బి.ఇ. క్లాసులవారికి వచ్చిన కష్టమేమిటని వాదిస్తారు. ఇది బలమైన వాదనగా కనబడదు. నేను బి. ఇ. చదవకపోయినా--నేను చదివినది ఒక భౌతిక శాస్త్రంలో ఆనర్స్ కోర్సుకి—వారి పరీక్షలు ఇంటర్మీడియెట్ పరీక్షలకన్నా కష్టమైనవని అనుకుంటాను. [ఆనర్సులో రోజుకి రెండు పేపర్లు (మెయిన్ సబ్జక్టులో) ఎక్కడా లేవని కూడా అనుకుంటున్నాను] రోజుకి ఒకటే ఒకపరీక్ష ఉండటం మంచిది.

'సైన్స్'చదివేవారికి 'హ్యూమానిటీస్' ఉండకూడదనేవారు పొరబడుతున్నారని నా అభిప్రాయం.

కొన్ని రాజకీయ పక్షాలు, కొందరు రాజకీయవాదులు-వీరినినాయకులనడం మంచిదికాదు! ఎక్కడఏవిధమయిన అలజడిఉన్నా దానిని ఉపయోగించుకుంటారు. అంతమాత్రాన సాధారణంగా మధ్యతరగతులలో 'మేధావు'లమనుకొనేవారు రాజకీయనాయకులమీద తమకుండే న్యూనతా, ఈర్ష్యాభావాలను నీతులుగా మార్చి చెప్పటం హాస్యాస్పదంగా ఉంటుంది. పికాకుపట్టి పరీక్షలుపాసయి ఏ ముఖ్యమంత్రికన్నా, ప్రజానాయకునికన్నా గొప్పవారమనుకునేవారు చాలామంది ఉన్నారు. కాని వారి అభిప్రాయం కేవలం అభిప్రాయంగానే మిగిలిపోతుంది...

విద్యార్థులలో క్రమశిక్షణ పెంపొందించదలచినవారే వారి కష్టనిష్ఠూరాలు కనుక్కొని ప్రవర్తించక పోయినంతకాలం ఏవో సమస్యలు ఉంటూనే ఉంటాయి !

యం. వి. రమణ (విశాఖపట్నం)

కవరుపైన 'యువప్రపంచం' శీర్షికకు అని స్పష్టంగావ్రాయాలి

## గమనిక

'యువప్రపంచం' శీర్షికకు వచ్చే వ్యాసాలూ, ఉత్తరాలూ కూడా చాలామట్టుకు 'కాంపోజిషన్' వ్యాసాలను పోలి ఉంటున్నాయి. యువప్రపంచానికి సంభవించే సమస్యలు చర్చించే బదులు చాలవరకూ అప్రస్తుతమయిన విషయాలు ఉద్బోధించే పద్ధతి కనిపిస్తున్నది! రాజకీయ నాయకుల ఉపన్యాసాలే పునశ్చరణ చేసి లాభంలేదు! యువ రచయితలు ఇది గమనించి నేటి యువప్రపంచం ఎదుర్కొనే సమస్యలను నిర్మొహమాటంగా చర్చించినట్లయితే ఈ శీర్షిక లక్ష్యం కొంతమట్టుకు నెరవేరుతుంది!











## పొట్టికథ

### ఆప్తమిత్రులు

ఒక వర్తకుడికి ముగ్గురు స్నేహితు లుండేవారు. వారిలో ఇద్దరిమీద అతడికి వల్లమాలిన అభిమానం; మూడవ వాడంటే కొంచెం చేట్టుగానే ఉండేవాడు. ఇలా ఉండగా ఒకరోజున పన్నులు ఎగవేశాడనే ఆరోపణపై వర్తకునికి కోర్టునుంచి తాఖీదు వచ్చింది. తన నిజాయితీ నిరూపించుకునేందుకు అతడికి సాక్షులు కావలసివచ్చారు. వెళ్ళి తన కిష్టులైన స్నేహితులిద్దరినీ అడిగాడు.

వారిలో ఒకడు అతని వెంట కోర్టుకు రావడానికే ఒప్పుకోలేదు. రెండవ వాడు కోర్టు గేటుదాకా వస్తానన్నాడు. పాపం వర్తకుడు దిగులుపడి ఇష్టం లేని మూడవ స్నేహితుణ్ణి ఆశ్రయించాడు. అతడు వర్తకునితోపాటు కోర్టుకు వెళ్ళి, సాక్ష్యం చెప్పి విడిపించాడు.

ఈ విధంగానే మృత్యువు వచ్చి సృష్టికర్త రమ్మంటున్నాడని పిలుచుకు వెళ్ళేటప్పుడు, ప్రతివ్యక్తి ముగ్గురు స్నేహితుల్ని తన వెంట రమ్మంటాడు. అతడు అధికంగా ప్రేమించే మొదటి మిత్రుడు - డబ్బు - అతని వెంట ఒక్క అడుగు కూడా ముందుకు వెయ్యదు. రెండవ మిత్రుడు - బంధువులు, పొరుగువారు_అతని వెంట స్మశానం వరకే వస్తారు. అతని గౌరవానికి నోచుకోని మూడవ మిత్రుడు మాత్రమే- అతని మంచిపనులు - అతనితోపాటు సృష్టికర్త వద్దకు వచ్చి, మోక్షం ఇప్పిస్తాయి.

కె. ఏసునాథం (గుంటూరు)



ప్రముఖ ఆంధ్రనాయకుడు అయ్యదేవర కాళేశ్వరరావుగారు ఫిబ్రవరి 26 వ తేదీన మరణించారు. వారు మళ్లీ శాసనసభకు ఎన్నికైనట్లు ఆ మర్నాడు తెలిసింది.








Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street Madras-1, Chief Editor: S. Sambhu Prasad.